


సంపాదకులు : శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి

**SRI HYMA PUBLICATIONS Pvt. Ltd.,**
**Hyderabad**

# తత్త్వమర్థస్వరూపిణి

**1st JUNE 2006**

"తత్ త్వమసి" అని వేదవాఙ్మయం నిరూపించింది. "తత్", "త్వం" అనే పదాల అర్థాలకు లక్ష్యం ఆత్మ. అలాంటి ఆత్మ తత్త్వమే "అమ్మ". తత్త్వ స్వరూపుడే గణపతి. అమ్మ ఆలయ సముదాయ ప్రాంగణంలో గణపతి ఆవిర్భవిస్తున్న వేళ వెలువడుతున్న ఈ సంచిక "తత్త్వమర్థస్వరూపిణి".


సంపాదకుడు : శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి

ముఖచిత్రం : శ్రీ బాలి

ముఖచిత్రం గురించి : అమ్మ చరిత్రలో (ఛిన్నమస్త) మిలాతీకి అమ్మ ప్రసాదించిన ఓ దివ్యదర్శనం.

Mother Photographs : Late Dr. Potluri Subba Rao [Chirala Doctor Garu]

Other Photographs : Gundavarapu Sekhar, Narakoduru.

Book Layout design, DTP : Bandi Narasimha Rao, Bandi Lakshmi Nageswari. Rajahmundry.

Title designer : N. Durga Prashanth, Preeti Digital Graphics, Rajahmundry.

Printed at : MUDRICA, Vijayawada.

---

Printed and Published by V. Dharmasuri, Chairman, Sri Hyma Publications Pvt. Ltd., Flat No. 41, Ramsai Symphony Dwellings, Khairathabad, Hyderabad.

## FOREWORD

When I was sitting with Amma, there was a relaxed discussion regarding some of my relatives: My brother's father- in- law got a temple of Goddess Kota Sattemma constructed in Timmarajupalem, a village in the West Godavari Dt., of Andhra Pradesh. They are a rich family. I told Amma, "They have lot of money, they constructed one temple."

Mother said, " They can't construct a temple just because they have lot of Money. If they have the Praptha, the good fortune, then alone, they can construct a temple."

As we see the history of evolution of temples at Jillellamudi, the first ones were Hymalayam, and Anasuyeswaralayam, which were got constructed during Amma's Physical presence. In the recent past, a magnificent temple, the Nava Naga Nageswaralayam was consecrated on 1.6.2005. The financial support for the project came from Rahi Racharla, USA,

the illustrious second son of Sri Racharla Lakshminarayana, Guntur, an ardent devotee of Amma. Before the commencement of the construction, Sri RacharlaLakshminarayana met Sri Tiruchi Swamy at Bangalore and apprised him of the project. Sri Tiruchi Swamy instantly said "It would have been good if a Ganesha temple is built first." Sri Lakshminarayana did not have the necessary energies to take up both projects, the conditions in Jillellamudi were also not congenial to commene two projects at a time.

After Nageswaralayam was constructed and the deity intalled, Sri Brahmandam Rangasai, USA made a request, that he wanted a Ganesha temple to be constructed at Jillellamudi, he would fund the project and Sri RL is to supervise the construction, idol installation and subsequent activity relating to the temple. The committee of Sree Viswa Jananee Parishat readily agreed to the proposal. It is a strange coincidence or a manifestation of a perfect Divine plan that exactly one year after Nageswaralayam was constructed, on 1.6.2005, Ganesha idol is being installed on 1-6-2006. Divine sense of timing is perfect. This souvenir is being brought out to celebrate the intallationof Ganehsa's idol in Jilellamudi, and also to commemorte the first aniversary of Sri Nava Naga Nageswaralayam.

How fortunate are Rahi and Rangasai to be able to construct two temples at the Mahakshetra of Jillellamudi!

Equally blessed is Sri Racharla Lakshminarayana who ignored all his health problems to take up this gigantic task of supervising construction of both Nageswaralayam and Ganesha Temple. The 70 plus devotee's sheer grit and determination saw him through many trying situations in implementing the project. We recalled Amma's words "None can match his faith" How blessed are those who are able to render any service at Jillellamudi.

While we thought it will be very approprate if a Souvenir is published by us, to mark the grand occasion, articles are contributed by erudite scholars like Dr. Salaka Raghunadha Sharma, Sri Mallapragada Srimannarayana Murthy etc., Sri Rahi Racharla, USA (who rendered into English the speech of His Holiness Sri Chandraekharendra Saraswathi,) besides contributing his own articles about Amma. Dr. Parsa Haragopal, USA, contributed his thoughts in the form of an article highlighting the non dualistic state of Amma. Mr.Rcihard Schiffman, New York contributed his own artcile.

Apart from these, the souvenir contains various articles on Amma and Lord Ganesha. We are confident, the souvenir will be found to contain a wealth of useful information by the spiritual seekers across the globe.

Sri Hyma Publications (P) Ltd., which is a Company being incorporated under the Companies Act, desires to publish spiritual literature in English, Telugu and various other Indian and Foreign, languages. This souvenir is our first venture. Our thanks are due to Mrs.Vasa Jyothi and her husband Sri Vasa Mohan, USA, who funded the cost of publishing this souvenir. Sri Mallapragada Srimannayana Murthy, inspite of his busy schedule took up the onerous responsibility of editing the articles for the souvenir.

We pray to Amma, to give us the strength to carry out the activity of publishing excellent spiritual literature in the days to come. We cordially invite all the readers to visit Jillellamudi and receive Amma's Prasadam and Blessings.

V.DHARMASURI
CHAIRMAN,
**SRI HYMA PUBLICATIONS (P) LTD.**

## కృతజ్ఞతాభివందనములు

**వక్రతుండ! మహాకాయ! కోటి సూర్యసమప్రభ! ।**

**నిర్విఘ్నం కురు, మే దేవ! సర్వ కార్యేషు సర్వదా ॥**

శ్రీ వరసిద్ధి వినాయకుని విగ్రహప్రతిష్ఠామహోత్సవము, శ్రీ నాగేశ్వరాలయ ప్రథమ వార్షికోత్సవము రెండూ ఒకరోజు (జూన్ ఒకటిన) కావడంతో ఓ ప్రత్యేక సంచికను వెలువరించాలనే ఆలోచన చివరి నిమిషంలో కలిగింది. శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణ మూర్తి గారిని అభ్యర్థిస్తే - 'ఇది మన అంఆ పనిగదా' అని, తన పనులన్నింటినీ ప్రక్కన పెట్టి సంచిక సంపాదకత్వ బాధ్యతను సంతోషంగా స్వీకరించారు.

సమయం అంతగా లేకున్నా, సోదరులు ఆ సర్వేశ్వరుడిపై భక్తితో - ఆయన్ని అక్షరాలతో అర్చించుకోవాలనే ఆర్తితో అందించిన రచనలను ఈ సంచికకు పంపించారు. ఈ సంచికలో తపస్వి - శ్రీ భాస్కరరావు అన్నయ్య వ్రాసిన 'అంఆ చరిత్ర' నుండి కొన్ని ఘట్టాలను కూడా యథాతథంగా మీకు అందిస్తున్నాము.

అంఆ చరిత్రంటే కొండముది రామకృష్ణ అన్నయ్యా కూడా మన మదిలో మెదులుతారు. ఆ స్మృతి చిహ్నంగా అన్నయ్య రచించిన అనేకానేక అద్భుత వ్యాసాల (మాతృసంహిత) నుండి (కొండముది వారసులకు కృతజ్ఞతలతో) ఓ వ్యాసాన్ని ప్రచురిస్తున్నాం.

ఆ దేవదేవుని కరుణ ఉంటే ఇక ముందు ఎప్పుడైనా అంఆ చరిత్ర నుండి కొన్ని ఘట్టాలను గొప్ప హృదయసంస్కారము గల పండితులచే సుమధుర, సుమనోహర శైలిలో - మూలంలోని కథకి, భావానికి ఏమాత్రము నష్టం వాటిల్లనివ్వకుండా (అమ్మ సమక్షంలో కొండముది రామకృష్ణ అన్నయ్య వ్రాసిన రీతిగా) తిరిగి వ్రాయించి, వాటికి - అద్వితీయ చిత్రకళానైపుణ్యాన్ని తోడుచేసి ఆధ్యాత్మిక ఔన్నత్యం గల బాపు గారితో చిత్రాలు గీయించి మీకు అందించాలని ఉంది.

ఈ సంచికను చదివేటప్పుడు మీ మనస్సులలో ఆ సర్వశక్తిస్వరూపుడు ఒక్క క్షణమైనా ఆవిష్కరింపబడితే ఆ ఘనత -

అంఆ చరిత్రని అందించిన శ్రీ భాస్కరరావు అన్నయ్య, ఆర్తితో రచించిన రచయితలు, శ్రద్ధ ఓర్పులతో సంచిక Layout design, DTP చేసిన శ్రీ బండి నరసింహారావు, శ్రీమతి లక్ష్మీనాగేశ్వరీ దంపతులు, ముఖచిత్రం వేసిన శ్రీ బాలి, టైటిల్ డిజైన్ చేసిన శ్రీ యన్. దుర్గా ప్రశాంత్, అద్భుతమైన అమ్మ ఫోటోలు మనకు మిగిల్చి వెళ్ళిన చీరాల డాక్టరు గారు, ఇతర ఫోటోలు అందించిన శ్రీ గుండవరపు శేఖర్, తన రచనలతో పాటు సంపాదకీయ బాధ్యతలను నిర్వర్తించిన శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, సంచిక ప్రచురణకు ఆర్థిక సహకారం అందించిన శ్రీ వాస మోహన్, శ్రీమతి జ్యోతి దంపతులు... వీరందరిది.

"ఓం మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః । మాధ్వీర్నస్సంత్వోషధీః మధు నక్తముతోషసి మధుమత్పార్థివగ్ం రజః । మధుద్యౌరస్తు నః పితా । మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః । మాధ్వీర్గావో భవంతు నః ॥

సత్కార్యం ఒనరింప అభిలషించే మనకు గాలి తియ్యగా వీచుగాక, నదులు తియ్యని నీటితో ప్రవహించుగాక, చెట్టుచేమలు పరిపుష్టితో ఉండుగాక, భూమి మాధుర్యాన్ని అందించుగాక, మన పితయైన ఆకాశం తియ్యదనాన్ని వర్షించుగాక, చెట్టుచేమల అధిపతియైన చంద్రుడు తియ్యగా ఉండుగాక, పశువులు అధికంగా పాలను ఇచ్చు గాక!"

**కృతజ్ఞతాభివందనములతో...**

శ్రీ హైమా పబ్లికేషన్స్ ప్రైవేట్ లిమిటెడ్, హైదరాబాదు.

# విషయసూచిక

ఓం గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవింకవీనాముపమశ్రవస్తమమ్
జ్యేష్ఠరాజం బ్రహ్మాణాం బ్రహ్మాణస్పత ఆ నః శృణ్వన్నూతిభిస్సీద సాదనమ్ మహా గణపతయే నమః ఓం



దేవగణాలకు అధిపతివి కనుక గణపతిగా పేరుగాంచిన నిన్ను కీర్తించి,
ఆహ్వానిస్తున్నాము. మేధావులలో నువ్వు మేటివి ; సాటిలేని ఖ్యాతి గాంచినవాడవు;
ప్రధానులలో శ్రేష్ఠతముడవు; వేదాలకు నాయకుడవు; మా మొరలను ఆలకించి మమ్ము
రక్షింప సత్వరం ఏతెంచి కటాక్షిస్తావు గాక! మహా గణపతియైన నీకు నమస్కారము.

# శ్రీ గణేశ పంచరత్నమ్

1. **ముదాకరాత్తమోదకం సదా విముక్తి సాధకం**
   **కలాధరావతంసకం విలాసి లోకరక్షకమ్**
   **అనాయకైకనాయకం వినాశితేభ దైత్యకం**
   **నతాశుభాశునాశకం నమామి తం వినాయకమ్.**

ఆనందముతో హస్తమందు మోదకమును ధరించిన వాడును, ఎల్లప్పుడు విముక్తి సాధకుడును, చంద్రుని ఆభరణముగా శిరస్సున ధరించిన వాడును, విలాసి లోకమునకు రక్షకుడును, సర్వ లోకమునకు మరియొక ప్రభువు లేని ఏక నాయకుడును, గజాసురుని నాశముచేసిన వాడును, నమస్కరించు వారల అశుభములను శీఘ్రముగా నశింపచేయు వాడును నగు వినాయకుని నమస్కరింతును.

2. **నతేతరాతిభీకరం నవోదితార్క భాస్వరం**
   **నమత్సురారినిర్జరం నతాధికాపదుద్ధరమ్,**
   **సురేశ్వరం నిధీశ్వరం గజేశ్వరం గణేశ్వరం**
   **మహేశ్వరం త మాశ్రయే పరాత్పరం నిరన్తరమ్.**

తనకు నమస్కరించనివారలకు అత్యంత భయంకరుడును, నూతనముగా ఉదయించిన సూర్యునివలె ప్రకాశించుచున్నవాడును, నమస్కరించు సురాసురులు గలవాడును, నమస్కరించు వారల అధికమైన ఆపత్తులను పోగొట్టువాడును, సురేశ్వరుడును, నిధీశ్వరుడును, గజేశ్వరుడును, ప్రమథ గణేశ్వరుడును మహా ప్రభువును పరాత్పరుడును నగు ఆ వినాయకుని నిరంతరము ఆశ్రయింతును.

3. **సమస్తలోకశంకరం నిరస్తదైత్యకుంజరం**
   **దరేతరోదరం వరం వరేభవక్త్ర మక్షరమ్,**
   **కృపాకరం క్షమాకరం ముదాకరం యశస్కరం**
   **మనస్కరం నమస్కృతాం నమస్కరోమి భాస్వరమ్.**

సమస్త లోకమునకు సుఖమును కలుగ చేయువాడును, నశింపచేసిన రాక్షసశ్రేష్ఠులు గలవాడును, పెద్ద పొట్ట గలవాడును, శ్రేష్ఠుడును, శ్రేష్ఠమైన గజ వక్త్రము గలవాడును, నాశరహితుడును, కృపకు క్షమకు సంతోషమునకు నిలయమైనవాడును, నమస్కరించువారలకు చక్కని మనస్సును కలుగచేయువాడును, ప్రకాశించు వాడును అయిన ఆ వినాయకుని నమస్కరింతును.

4. **అకించనా ర్తిమార్జనం చిరంతనో క్తిభాజనం**
**పురారి పూర్వనందనం సురారిగర్వచర్వణమ్**
**ప్రపంచనాశభీషణం ధనంజయాదిభూషణం**
**కపోలదానవారణం భజే పురాణవారణమ్.**



దరిద్రుల ఆర్తిని పోగొట్టువాడును, వేదములకు నిలయమైనవాడును, పరమేశ్వరుని పెద్ద కుమారుడును, రాక్షస గర్వ భంజకుడును, ప్రపంచనాశమందు భయంకరమైనవాడును, అగ్ని మున్నగు దేవతలకు అలంకారమైనవాడును, గండస్థలమందు స్రవించు మద జలమును నివారించుచున్నవాడును నగు అనాదిసిద్ధ గజమును (వినాయకుని) సేవించెదను.

5. **నితాన్తకాన్త దన్తకాన్తి మన్తకాన్తకాత్మజమ్**
**అచింత్యరూప మన్తహీన మన్తరాయకృన్తనమ్**
**హృదన్తరే నిరన్తరం వసన్త మేవ యోగినాం**
**త మేకదన్త మేవ తం విచిన్తయామి సంతతమ్.**

అత్యంత మనోహరమైన దంత కాంతి గలవాడును, మృత్యుంజయుని పుత్రుడును, వాఙ్మనసాతీతమైన రూపముగలవాడును, నాశరహితుడును, సర్వ ప్రతిబంధక నాశకుడును, యోగుల హృదయ పుండరీకములందు నిరంతరము వసించువాడును నగు ఆ యేకదంతునే నిరన్తరము స్మరింతును.

**మహాగణేశపంచరత్న మాదరేణ యోఽ న్వహం**

**ప్రజల్పతి ప్రభాతకే హృది స్మర న్గణేశ్వరమ్**

**అరోగతా మదోషతాం సుసాహితీం సుపుత్రతాం**

**సమాహితాయు రష్టభూతి మభ్యుపైతి సోఽ చిరాత్.**

ఎవడు ఈ మహాగణేశ పంచరత్నమును ఆదరముతో ప్రతి నిత్యము గణేశ్వరుని హృదయమున స్మరించుచు ప్రాతః కాలమున పఠించునో, అతడు ఆరోగ్యమును, పాపరాహిత్యమును, యోగ్యమైన సాహిత్యమును, యోగ్య సంతతిని పూర్ణాయువును అష్టైశ్వర్యములను శీఘ్రముగా పొందును.

*శ్రీ శంకర భగవత్పాద కృతమగు గణేశ పంచరత్నము సమాప్తము.*



**భూ నాయకం వా ధన నాయకం వా**

**భజన్ భువం వా ధనమేతి లోకే।**

**తం విఘ్ననాథం న భజామి కింతు**

**సహస్ర శస్తం ప్రణమామి నిత్యం॥**

భూమి పుష్కలంగా ఉన్న భూనాయకుణ్ణి ప్రార్థిస్తే కొంత భూమిని మనకు అనుగ్రమిస్తాడు. సంపదలు దండిగా గల ధననాయకుణ్ణి సేవిస్తే, కొంత ధనం మనకు ప్రసాదిస్తాడు. మరి, విఘ్ననాయకుణ్ణి ఆరాధిస్తే, కొన్ని విఘ్నాలు మనకు ఇస్తాడేమో, అందుకని ప్రార్థించనే ప్రార్థించను. అయితే, మా జోలికి రావద్దని, విఘ్నాలు కల్పించవద్దని కోరుతూ, వేన వేల నమస్కారాలు మాత్రం చేస్తాను.

# శ్రీ గణేశ స్తుతి

ఉ. అంకముఁ జేరి శైలతనయాస్తన దుగ్ధము లానువేళ బా
ల్యాంక విచేష్టఁ దొండమున నవ్వలి చన్ కబళింపఁబోయి యా
వంకఁ గుచంబుఁగాన కహివల్లభహారముఁగాంచి వే మృణా
ళాంకురశంక నంటెడు గజాస్యునిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.

మనుచరిత్ర - అల్లసాని పెద్దన.

భావము : బాలుఁడైన విఘ్నేశ్వరుఁడు అర్ధనారీశ్వర స్వరూపులగు పార్వతీ పరమేశ్వరుల కుడివైపున నుండు పార్వతి ఒడిలోఁ గూర్చుండి ఆమె చనుబాలు త్రాగుచు, చంటిపిల్ల వాని చేష్టగాఁ దనతొండమున రెండవ స్తనము పాలు త్రావఁబోయెను. కాని కుడిభాగము ఈశ్వరుని శరీరమగుటచే ఆ వైపున స్తనము లేదు. ఈశ్వరుఁడు భుజగభూషణుఁడు కావున అచ్చట భుజగహారమున్నది. పాలు త్రావు పిల్లవాఁడగుటచే బాల వినాయకుఁ డేమాత్రమును భయపడలేదు. వెంటనే గజముఖుఁడు దానిని తామర తూఁడుగా భ్రమించి, అది తన కిష్టమే కావున, దాని నంటఁబోయెను. అట్టి గజాస్యుని ఇష్టసిద్ధికై కొల్తును.



మ. "కరముం జాఁపకుమయ్య దక్షిణపుభాగంబందు వాతాశిరాట్
సరముం, బుఱ్ఱయు, నస్థిమాలయును, భస్మంబుం, ద్రిశూలంబుఁ, గుం
జరచర్మాంబరమున్ వెఱంగొలుపు నా శర్వాణి", యట్లే యటం
చౌరిమన్‌స్తన్యముఁ గ్రోలు బాలకు ద్విపాస్యుం గొల్తు నిష్టాప్తికిన్.

భారతాచార్య డాక్టర్ జొన్నలగడ్డ మృత్యుంజయరావు.

భావము : బాల గణపతి అర్ధనారీశ్వరుఁ డగు శివుని వామభాగమునఁగల పార్వతి ఒడిలో కూర్చున్నాఁడు. అతనిని పార్వతి హెచ్చరించుచున్నది. "నాయనా! నీ కరమును (తొండమును, చేతిని) కుడివైపునకు పోనీకు సుమా! ఆ వైపున నీకు భయమును గలిగించు వస్తువులు చాలఁగలవు. పాములదండ, పునుక, ఎమ్ములహారము, విభూతి, త్రిశూలము, ఏనుఁగు చర్మము అనువానిని చూచి జడిసికొందువు." అనఁగా బాలుఁడట్లే యని ఒద్దికతోపాలుత్రాగెను. అట్టి ద్విపాస్యుని ఇష్టసిద్ధికై కొల్తును.

2

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్**

**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే.**

**భావము :** శుక్ల + అంబర - ధరమ్ - తెల్లని వస్త్రమును ధరించినట్టియు, శశి వర్ణమ్ - చంద్రుని వర్ణముగలిగి నట్టియు, చతుర్భుజమ్ = నాలుగు భుజములు గలట్టియు, ప్రసన్న వదనమ్ = తేఁట ముఖము గలట్టియు, వినాయకుని సకల విఘ్నములు ఉపశమించుటకై ధ్యానింతును.

3

**వన్దే వన్దారు మన్దార మిన్దు భూషణ నన్దనమ్,**

**అమన్దానన్ద సందోహ బన్ధురం, సిన్ధురాననమ్.**

**భావము :** వన్దారు మందారం = నమస్కరించువారికి కల్పవృక్షమయినవాఁడును, అమన్ద + ఆనన్ద - సందోహ - బన్ధురం = అధికమైన ఆనందముల సముదాయముచే ఒప్పు వాడుఁను, ఇందు భూషణనందనమ్ = చంద్రశేఖరుఁ డగు నీశ్వరుని కుమారుఁడును అగు, సిన్ధర + ఆననమ్ = గజముఖుని, వన్దే = నమస్కరింతును.

4

**ఆలమ్బే జగదాలమ్బే హేరంబచరణాంబుజే,**

**శుష్యన్తి యద్రజః స్పర్శాత్ సద్యః ప్రత్యూహవార్ధయః,**

**భావము :** యద్రజః స్పర్శాత్ = వేని ధూళి స్పర్శమువలన, సద్యః = వెంటనే, ప్రత్యూహవార్ధయః = విఘ్నములనెడి సముద్రములు, శుష్యన్తి = ఎండిపోవునో, అట్టి, జగత్ + ఆలమ్బే = జగత్తునకాధారములగు; హేరమ్బ - చరణాంబుజే = వినాయకుని పాదపద్మద్వయమును, ఆలమ్బే = పట్టుకొనుచున్నాను.

5

**అగజాననపద్మార్కం గజానన మహర్నిశమ్,**

**అనేకదం తం భక్తానా మేకదన్త ముపాస్మహే.**

భావము : అగజా + ఆనన - పద్మ + అర్కం = పార్వతి ముఖ పద్మమును వికసింపఁజేయుటలో సూర్యుఁ డైనవాఁడును, గజ + ఆననమ్ = ఏనుఁగు మోము గలవాఁడును, భక్తానాం = భక్తులకు, అనేకదం = పెక్కింటి నిచ్చువాఁడును, అగు, ఏకదన్తం = ఒక దంతము మాత్రమే కలవాఁడు అగు, తం = వానిని, ఉపాస్మహే = ఉపాసింతును.

అగజానన పద్మార్కం, గజాననం, అనేకదం-తం, ఏకదంతం అను పదబంధములలోని స్వారస్యము ప్రశంసనీయము.

## 6

**అన్తరాయ తిమిరోపశాన్తయే, శాన్తపావన మచిన్త్యవైభవమ్,**

**త న్నరం వపుషి, కుఞ్జరం ముఖే, మన్మహే కిమపి తున్దిలం మహః.**

**భావము :** అన్తరాయ - తిమిర + ఉపశాన్తయే = విఘ్నములనెడి, చీఁకట్లు ఉపశమించుటకై, శాన్త-పావన - మచిన్త్య - వైభవమ్ = శాంతము, పావనము, ఊహకందని వైభవము కలది అగు, కిమపి = ఒకానొక, తుందిలం = అధికమగు, మహః = తేజస్సును, మన్మహే = నమస్కరింతును.

విఘ్నములనెడి చీకట్లు పోవుటకై శాంతము, పావనము, ఊహకందని వైభవముకలదియు అగు ఒకానొక అధికమగు తేజస్సును నమస్కరింతును.



Sri Varasiddi Vinayaka Temple, Jillellamudi

ఓం నమో గణేభ్యో గణపతిభ్యశ్చవో

నమో నమో వ్రాతేభ్యో వ్రాత పదిభ్యశ్చవో

నమో నమో విరూపేభ్యో విరూపేభ్యశ్చవో నమః ॥

# శ్రీ గణేశ భుజంగప్రయాత స్తోత్రమ్

**రణత్ క్షుద్ర ఘంటా నినాదాభిరామం**
**చలత్తాండ వోద్దండ పత్పద్మ తాళమ్**
**లస త్తుందిలాంగోపరి వ్యాలహారం**
**గణాధీశ మీశానసూనుం త మీడే.**

చిఱుగంటలు గల్లుగల్లని మ్రోయుచుండ పాద పద్మములు తాళము వేయగా నృత్యముచేయుచు సర్పహారము తన దొడ్డశరీరమున మిసమిసలాడుచు వింత గూర్పగా నొప్పు శివుని కుమారుని గణాధీశుని నుతించెదను.

**ధ్వనిధ్వంస వీణాలయోల్లాసి వక్త్రం**
**స్ఫుర చ్ఛుండ దండోల్లస ద్బీజపూరమ్**
**గళ ద్దర్ప సౌగంధ్య లోలాళిమాలం**
**గణాధీశ మీశానసూనుం త మీడే.**

నిరుపమాన వీణాతాళముల కుల్లాసపడు ముద్దు మొగముతో, తొండముతో బంతివలె మాదిఫలమునుదాల్చి, స్రవించుచున్న మదజల సౌగంధ్యమును మరగిన తుమ్మెదలు బారులుతీరిచి ఝుంకారములు చేయుచుండ నొప్పు శివపుత్త్రుని గణాధీశుని వినుతించెదను.

**ప్రకాశ జ్జపారక్త రత్న ప్రసూన**
**ప్రవాళ ప్రభాతారుణ జ్యోతి రేకమ్**
**ప్రలంబోదరం వక్రతుండై కదంతం**
**గణాధీశ మీశానసూనుం త మీడే.**

జారుతున్న యుదరముతో, వక్రతుండముతో, ఏకదంతముతో, రాశిబోసిన మందారపువ్వులో, రత్నములో, పగడములో లేక ఉదయించుచున్న సూర్యుడో అన్నట్లు ఎఱ్ఱని జ్యోతి స్వరూపుడై వెలుగు ఈశాన పుత్త్రుని గణాధీశుని వినుతించెదను.

**విచిత్ర సురత్నమాలా కిరీటం**
**కిరీటోల్లస చ్చంద్ర రేఖా విభూషమ్,**
**విభూషైక భూషం భవధ్వంస హేతుం**
**గణాధీశ మీశానసూనుం త మీడే.**

తత్త్వమర్థస్వరూపిణి - 14

వివిధ రత్న విచిత్ర కిరణమాలికలతో కిరీటము, కిరీటముపై చంద్రరేఖా విభూషణము కలిగి విభూషణములకు విభూషణమై మోక్షప్రదుడైన పరమేశ్వర కుమారుని గణాధీశుని స్తుతించెదను.

**ఉదంచ ద్భుజావల్లరీ దృశ్య మూలో**

**చ్చల ద్భ్రూలతా విభ్రమ భ్రాజ దక్షమ్,**

**మరుత్సుందరీ చామరైః సేవ్యమానం**

**గణాధీశ మీశానసూనుం త మీడే.**

నృత్యము చేయునప్పుడు పైకెత్తిన కరములందలి పుష్పగుచ్ఛములతోపాటు చూడముచ్చటయైన చలించుచున్న కనుబొమల విలాస దీప్తులకు దిట్టయై అమరీ చామర సేవ కానందించు శివకుమారుని సేవించెదను.

**స్ఫుర న్నిష్ఠురాలోల పింగాక్షి తారం**

**కృపా కోమలోదార లీలావతారమ్**

**కళాబిందుగం నీయతే యోగివర్యై**

**ర్గణాధీశ మీశానసూనుం త మీడే.**

కొంచెము నిష్ఠురములై కదలుచున్న గోరోచనపు వన్నెగల నయన తారకలు వెలుంగుచుండు యోగివర్యులు హృదయమున కళాబిందు మధ్యమున నిల్పి కీర్తించుచుండ కరుణాకోమల లీలావతార మూర్తియగు శివకుమారుని గణనాథుని వినుతించెదను.

**య మేకాక్షరం నిర్మలం నిర్వికల్పం**

**గుణాతీత మానంద మాకారశూన్యమ్,**

**పరం పార మోంకార మామ్నాయ గర్భం**

**వదంతి ప్రగల్భం పురాణం త మీడే.**

గుణాతీతమగుటచే నానందమై, ఆకార శూన్యమగుటచే నిర్వికల్పమై, సంసారసాగరమున కావల సమస్త వేదములను గర్భమున దాల్చిన నిర్మల ప్రణవాక్షర మూర్తియై, పురాణపురుషు డని చెప్పబడు శివకుమారుని గణనాథుని ప్రశంసించెదను.

**చిదానంద సాంద్రాయ శాంతాయ తుభ్యం**

**నమో విశ్వకర్త్రే చ హర్త్రే చ తుభ్యమ్,**

**నమోఽ నన్తలీలాయ కైవల్యభాసే**

**నమో విశ్వబీజ! ప్రసీ దేశసూనో!**

విశ్వమునకు బీజము, కర్తయు, పితయు, హర్తయు నగుచు విశ్వమునందలి అనంత లీలలకు ఒకేఒక్క శాంతప్రభాకందమై సత్యజ్ఞానానంద ఘన మూర్తి వగు నో శివపుత్రా! నీకు నమశ్శతములు.

**ఇమం సుస్తవం ప్రాత రుత్థాయ భక్త్యా**

**పఠే ద్యస్తు మర్త్యో లభే త్సర్వకామాన్**

**గణేశప్రసాదేన సిద్ధ్యంతి వాచో**

**గణేశే విభౌ దుర్లభం కిం ప్రసన్నే?**

ఈ స్తవమును ప్రాతఃకాలమున భక్తితో పఠించిన మనుష్యుడు సర్వకామములను వాఙ్మాధుర్యమును కైవసము చేసికొనును. శ్రీగణేశ్వరుడే ప్రసన్నుడైనచో సిద్ధింపని దేముండును?

*శ్రీ శంకర భగవత్పాద కృతమగు గణేశ భుజంగ ప్రయాత స్తోత్రము సంపూర్ణము*



## శ్రీ గణేశ షోడశ నామ స్తోత్రం

**సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః ।**

**లంబోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః ॥**

**ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః ।**

**వక్రతుండ శ్శూర్ప కర్ణో హేరంబ స్స్కంద పూర్వజః ॥**

**షోడశైతాని నామాని యః పఠేత్ శృణుయాదపి ।**

**విద్యారంభే వివాహే చ ప్రవేశే నిర్గమే తథా ॥**

**సంగ్రామే సర్వ కార్యేషు**

**విఘ్నస్తస్య న జాయతే ॥**

# శ్రీ విఘ్నేశ్వరాలయ భూమిక

- రాచర్ల లక్ష్మీనారాయణ

2004లో శ్రీ నవనాగేశ్వర ఆలయానికి రూపకల్పన జరిగిన తరువాత, ఆ పని నిమిత్తం బెంగుళూరు వెళ్ళి శ్రీ రాజరాజేశ్వరీ దేవస్థాన వ్యవస్థాపకులైన శ్రీశ్రీశ్రీ తిరుచ్చి స్వామిగళ్‌తో సంప్రదించిన రోజున వారు "వినాయకుని గుడి కట్టి, శ్రీ నాగేశ్వర ఆలయం కట్టరాదా ?" అని సూచించారు.



శ్రీశ్రీశ్రీ తిరుచ్చి స్వామిగళ్, బెంగుళూరు

శ్రీ నాగేశ్వర ఆలయం పూర్తికావస్తూ వుండగా అంటే 2005 మార్చి/ఏప్రిల్‌లో ఒక రోజున చి॥ బ్రహ్మాండం రంగశాయి (యు.యస్.ఎ.) నుండి ఫోన్ వచ్చింది. "జిల్లెళ్ళమూడిలో వినాయకుని గుడి కడితే ఎలా వుంటుంది?" అని అడిగాడు. "నీ ఉద్దేశం ఏమిటి" అని నా సలహా అడిగాడు. నాకు ఆనందం కలిగింది. కారణం, అది బెంగుళూరు స్వామివారు నాకు ఇచ్చిన సూచనే ! కనుక.

అయినా, నేను అన్నాను "నాకుగా ఏ ఆలోచన లేదు, ఈ ప్రస్తావన స్వామివారు సూచించారు. ఆ సంకల్పం నీ ద్వారా వచ్చింది అంటే అది 'అమ్మ' సంకల్పమే ! స్వామివారి నోట సూచనప్రాయంగా మనకు చేరింది; అందుకు 'అమ్మ' నిన్ను నిర్ణయించి ప్రేరణ కలిగించి ఉండవచ్చు" అని.

శ్రీ రంగశాయి సంతోషించి ఆ కార్యక్రమాన్ని తన భుజస్కంధాలమీద వేసుకొని ఆ పనిని నిర్వర్తించడానికి నన్ను కోరాడు. ఆనందంతో 'అమ్మ' సేవగా ఆ సోదరుని కోరిక మేరకు చేపట్టాను.

ఒక సందర్భంలో హైమను గురించి అమ్మ మాట్లాడుతూ - "వినాయకుడు, కుమారస్వామి, ఆంజనేయస్వామి అంశలతో పుట్టింది నాన్నా" అని వివరించింది. ఆ కారణంగా వినాయకుని అంశ అయిన హైమకు కూడా సేవచేసే సౌభాగ్యం కలిగిందని సంతోషించి ఆ కార్యక్రమ భారాన్ని స్వీకరించాను.

గర్భాలయం రూపుదిద్దుకుంటున్నది. ఆ సమయంలో శ్రీ బుచ్చిరాజు శర్మ (రాజుబావ) జిల్లెళ్ళమూడిలో 4, 5 రోజులు ఉన్నాడు. మాటల సందర్భంలో అడిగాడు. "అక్కడే వినాయకుని గుడి కట్టాలనే సంకల్పం, గర్భాలయం ఆ స్థలంలోనే నిర్మాణం చేయాలని నీకు ఎందుకు అనిపించింది, కారణం ఏదైనా వున్నాదా?" అని.

నా మనస్సుకు అక్కడ కట్టాలని తోచడమే కాని అంతకు మించి ఏ కారణం లేదు. మొదట అక్కడ సూచన నేను చేయడం, పెద్ద స్థలంలో కడదామని కమిటీ వారు వేరే ప్రయత్నం చేయటం, అది విఫలం కావడం, చివరకు నాకు తోచిన స్థలంలోనే కట్టుబడి ప్రారంభం కావటం జరిగిందని తెలియపరచాను.

శ్రీ బుచ్చిరాజుశర్మ ఆనందించి "అదే సరి అయిన స్థలం" అన్నాడు. నేను ఆశ్చర్యపోయాను. ఎక్కడైతే వినాయకునికి "గర్భగుడి" ఏర్పడుతున్నదో ఆ స్థలంలోనే "అమ్మ" స్నానాల 'దడి' వుండేదని, అక్కడే 'అమ్మ' స్నానం చేస్తూ ఉండేదని రాజు వివరించాడు.

నాకు ఆనందం కలిగింది. 'అమ్మ' మాట గుర్తుకు వచ్చింది. "ప్రేరణే భగవంతుడు నాన్నా!" అని. ఆ ప్రేరణ మేరకే సరి అయిన స్థలంలో వినాయకుని గర్భగుడి రూపుదిద్దుకున్నది. కారణం ఆ కాలంలో పార్వతీదేవి స్నానంచేస్తూ తన నలుగుపిండితో 'బొమ్మ'ని చేసి, అందంగా రూపుదాల్చిన ఆ బొమ్మకు ప్రాణంపోసి, వినాయకుడిని చేసింది. ఇది అందరికీ తెలిసిన కథే !

1941లో అమ్మ, నాన్న గారు, సుబ్బారావు పసివాడిగా వుండగా జిల్లెళ్ళమూడిచేరి, స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. ఆ స్థలమే ఇపుడున్న శ్రీ నవ నాగేశ్వర ఆలయ యాగశాల ప్రాంగణం.

'అమ్మ' అన్నట్లు 'నాగేంద్రుడే' నాగేశ్వరుడై వచ్చాడు. ఆ ప్రకారం నాన్నగారు తన ఆఫీసుగా చేసుకొని నివసించిన స్థలంలో "శ్రీ నవ నాగేశ్వర ఆలయం", అమ్మ స్నానాల 'దడి' స్థానంలో వినాయకుని గర్భాలయం ఏర్పడటం ఎంత ఆశ్చర్యకరమైన 'అమ్మ' ఏర్పాటు. అవును నిజం. అమ్మది "తోలు నోరు కాదుగా, తోలు మాట రావడానికి".

ఆ స్నానాల 'దడిలోనే 'అమ్మ' స్నానం చేస్తూ సంకల్పించి ఉండవచ్చు, అక్కడే వినాయకుని గుడి ఏర్పడాలని. ఆ సంకల్పానికి అనుగుణంగానే 'ఋషి' పుంగవుడైన శ్రీ బెంగుళూరు స్వామి వారు సూచించడం,

శ్రీ రంగశాయి (యు.యస్.ఏ.) కి వినాయకుని గుడి కట్టాలని ప్రేరణ కలగడం, అమ్మ అనుగ్రహంతో ఆ బాధ్యతను నేను ఆనందంగా స్వీకరించడం జరిగాయి అనిపిస్తుంది.

'అమ్మ' దయతో ఆ గుడి అందంగా రూపు దిద్దుకుని, ప్రతిష్ఠకు సిద్ధంగా వుంది.

2006 జూన్ 1వ తేది ప్రతిష్ఠా కలాపం జరుగుతుంది. సిద్ధ క్షేత్రమైన జిల్లెళ్ళమూడిలో వరసిద్ధి వినాయకుణ్ణి దర్శించి, సేవించి, తరించే మహద్భాగ్యాన్ని మనకు అనుగ్రహిస్తున్న 'అమ్మ'కు సాష్టాంగ ప్రణామాలు సమర్పిద్దాం.



**విగ్రహ రూప శిల్పి - శ్రీ పృథ్వీ కాళప్ప [T.T.D.], తిరుపతి.**

## విగ్రహ ప్రతిష్ఠ

భగవంతుని-ప్రతిష్ఠ మనం కాదుగా చేయాల్సింది. మనకు ఏం సాధ్యమవుతుంది? అంతటా ఉన్న భగవంతుడు ఒక చోట 'ఇక్కడ ఉన్నా'డని ప్రతిష్ఠిస్తున్నామంటే మన గుర్తు కోసం, మన లక్ష్యం కోసం. దాన్ని విగ్రహం, రాయి-అనుకోవటం లేదుగా. అందులో ఉన్నాడనుకుంటున్నాము. అక్కడ ఆయనకు ఉండాలనిపిస్తే అదే జరుగుతుంది.

**- అమ్మ**

# శ్రీ గణేశ వైభవము

- మల్లా ప్రగడ శ్రీమన్నారాయణమూర్తి

మన దేవతల్లో విచిత్రమైన రూపంగల దేవతలు కొందరున్నారు. ఆంజనేయుడు, నరసింహుడు, విఘ్నేశ్వరుడు, గరుత్మంతుడు, హయగ్రీవుడు మొదలైనవారు ఈ కోవకు చెందినవారు. వీరిలో విఘ్నేశ్వరుడు తొలిపూజలందుకునే ఇలవేల్పుగా ప్రశస్తిపొందాడు.

విఘ్నేశ్వరుడికి గణపతి, వినాయకుడు, గజాననుడు మొదలైన ఎన్నో పేర్లున్నాయి. గజాసుర సంహారం చేసి, తిరిగి వస్తున్న భర్తకు స్వాగత సత్కారాలు నిర్వహించాలని భావించి, అభ్యంగన స్నానం చేయాలనుకున్న పార్వతీదేవి, నలుగుపిండితో ఒక బాలుణ్ణి చేసి, ప్రాణంపోసి, సింహద్వారం వద్ద కావలి ఉంచడం, పరమశివుడు రాగా, బాలుడు అడ్డగించగా, కోపగించిన ఈశ్వరుడు త్రిశూలంతో బాలుని శిరచ్ఛేదం చేసి, తరువాత సంగతి తెలుసుకొని బాధపడి, ఎలాగైనా బాలుణ్ణి బ్రతికించాలని భావించి గజాసురుని 'గజ' శిరస్సును తెచ్చి, ప్రాణప్రతిష్ఠ చేయగా, ఆ బాలుడు 'గజాననుడు', 'హస్తిముఖుడు' అయ్యాడు.

తండ్రి విధించిన నియమం ప్రకారం - భూప్రదక్షిణం చేయడానికి బదులు తల్లిదండ్రులకే భక్తి శ్రద్ధలతో ముమ్మారు ప్రదక్షిణం చేసి ప్రమథగణాలకు అధిపతియై, 'గణపతి' అయ్యాడు. విఘ్నాలను తొలగించి, "విఘ్నేశ్వరు"డయ్యాడు. తనను మించిన నాయకుడు వేరొకడు లేరు కనుక గణపతి "వినాయకుడ"య్యాడు. విఘ్నాలను అణచివేసి, దేవతా గణాలకు నాయకత్వం వహించి వినాయకుడయ్యాడు. పెద్ద పొట్ట వల్ల "లంబోదరుడ"ని, చేటలంత చెవులవల్ల "శూర్పకర్ణుడ"ని పేర్లు వచ్చాయి.

గణపతికి ఇంత విడ్డూరమైన రూపం ఉండడం మనకు ఒక్కని సందేశం ఇవ్వడానికే. ఆయన చెవులు చాల పెద్దవి. అంటే శ్రద్ధగా శ్రవణం చేసే గుణం ఉన్నవాడన్న మాట. ఉపనయన సంస్కారంలో వటువు మోదుగకర్ర పట్టుకుంటాడు. ఆ కార్యక్రమానికి 'పలాశదండధారణం' అని పేరు. మోదుగకే సంస్కృతంలో "సుశ్రవసుడు" అని మరో పేరు. అంటే 'మంచిచెవులు గలవాడు' అని అర్థం. ఉపనయనంతో వేదాధ్యయనం ఆరంభం అవుతుంది కనుక, ఆనాటి నుంచి వటువు మంచి చెవులుగల వాడుగా ఉండాలని పలాశదండధారణం తెలియచేస్తోంది. శ్రద్ధాసక్తులతో శ్రవణం చేయడం విద్యార్థికి ఉత్తమ లక్షణమని ఈ సంప్రదాయం తెలియచేస్తోంది. మంచి చెవులవలే పెద్ద చెవులు కూడా శ్రద్ధగా శ్రవణ చేసే స్థితికి సంకేతాలు. పైగా ఆ చెవులు చేటల్లా ఉంటాయి. ఆయన 'శూర్పకర్ణుడ' కదా! ప్రోగుపడిన ధాన్యంలో పనికివచ్చే పదార్థాన్ని మిగిల్చి వ్యర్థపదార్థాన్ని చెరిగివేసేవి చేటలు. 'వినినంతనె వేగపడక వివరించే' గుణం కలిగి, ఆ మాటలలోని మంచిని మాత్రమే మనం గ్రహించాలని, గణపతి చెవులు మనకు సూచిస్తున్నాయి.

చిన్న కళ్ళు గణపతివి. సూక్ష్మదృష్టికి, ఏకాగ్రతకు సంకేతం. జీవునికి గల ఇంద్రియాల్లో కన్నులు చాల చైతన్యవంతమైనవి. కన్నుల ద్వారానే బాహ్యవస్తువులను గురించి మన మనస్సులలో ఒక 'సంగం' ఏర్పడి, అది కామానికి దారితీసే అవకాశం ఉంది. బాహ్యదృష్టిని పరిమితం చేసుకొని, అంతర్ముఖత్వాన్ని పెంచుకోమని తన చిన్న చిన్న కన్నుల ద్వారా గణపతి మనను ప్రబోధిస్తున్నాడు.

గజాననుడైన వినాయకుని కన్నులతో పాటు నోరు కూడ చిన్నదే. పరిమితంగా, పద్ధతిగా తినమని, మిత, హిత సంభాషణలు సాగించమని గణపతి మనకిస్తున్న సందేశం.

ఆయన పొట్ట చాల పెద్దది. విద్యాధి దేవత గణపతి కనుక, అక్షరసమామ్నాయం అంతా ఆ పొట్టలోనే ఉన్నదని, అందుకే, ఆయన పొట్ట అంత పెద్దదిగా ఉన్నదని విజ్ఞులు వివరిస్తున్నారు. అంతే కాదు, ప్రాణాయామంతో ప్రారంభమై కొనసాగే యోగవిద్యలో "కుంభకం" ఈ పెద్ద పొట్టకు సంకేతం అని కూడా తెలియచేస్తున్నారు. "తస్యోదరాత్ సముత్పన్నం నానా విశ్వం న సంశయః" అని గణేశోపనిషత్తు నిరూపిస్తోంది. ఆయన కుక్షి నుంచే అన్ని బ్రహ్మాండాలు, సకలజీవరాసులూ ఉత్పన్నమయ్యాయని, అందుకే, అంత పెద్దపొట్ట ఉన్నదని వారు పేర్కొంటున్నారు.

వినాయకుడు గజముఖుడు. "గజః" అంటే-

"యోగినో గచ్ఛంతి యత్ర ఇతి 'గః', యస్మాత్ బింబప్రతిబింబ వత్తయా

ప్రణవాత్మకం జగజ్జాయతే ఇతి 'జః', అని శాస్త్రప్రమాణం. యోగులు ధ్యాననిమగ్నులై తమ అంతరంగంలో దర్శించే పరమాత్మ 'గ' కారం. ఆ పరమాత్మకు ప్రతిబింబంగా వెలువడే సృష్టి 'జ' కారం. అంటే పరమాత్మ, అతని సృష్టి కలసి ఉన్న రూపం గజం. వినాయకుడు గజముఖుడు అంటే సృష్టి స్వరూపంగా ఉన్న పరమాత్మ అని అర్థం.

ఇప్పటికీ ఒక చిత్రం చూస్తూఉంటాం మనం. పసుపుతో నాలుగు వేళ్ళ నడిమిభాగంలో ఇమిడిపోయేటంతటి చిన్న వినాయకుణ్ణి తమలపాకుపై ప్రతిష్ఠించుకొని, అర్చన ప్రారంభిస్తాం. ఆ గణపతినే వినాయకచవితినాడు ఆరు అడుగులవిగ్రహరూపంలో ప్రతిష్ఠించుకొని ఆరాధిస్తాం. ఆ ప్రక్కవీధిలో పోటీపడి పన్నెండు అడుగుల విగ్రహం చేస్తే, ఆ పై వీధివారు పదహారు అడుగులవరకూ వెళ్తారు. మరొకరు ఇరవై అంటారు. నవరాత్రి పూజలు అయిపోయాక, గణేశనిమజ్జనానికి 'క్రేన్లు' ఉపయోగించడం దూరదర్శన్‌లో చూస్తూనే ఉన్నాం.ఆ ఊరేగింపులో ఎత్తైన ఈ విగ్రహాలు విద్యుత్తు తీగలకు తగిలి, ఏ ప్రమాదం వస్తుందోనని, ప్రభుత్వం వారు గణపతి పరిమాణానికి పరిమితులు విధించవలసిన పరిస్థితిని కల్పించుకున్నాం మనం. ఇంతకీ గణపతి కొలత ఎంత? "కొండొక గుజ్జురూపమే" కదా! అది పసుపు గణపతి రూపంలో తమలపాకు మీద కనిపిస్తూనే ఉంది. అక్కడి నుంచి ఇరవై నాలుగు, ముప్ఫయి అడుగుల వరకు అలా పెరిగిపోయాడు గణపతి, "ఇంతింతై వటుడింతై అన్నట్లుగా".

"అణోరణీయాన్ మహతో మహీయాన్" అని పరమాత్మ తత్త్వాన్ని 'కఠోపనిషత్తు' నిరూపించింది.

గణపతి సృష్టిస్వరూపంగా ఉన్న పరమాత్మ తత్త్వానికి ప్రతీక అనుకున్నాం కదా! పరమాత్మగా ఉన్నప్పుడు 'అణువు'. సృష్టిగా దిగివచ్చినప్పుడు 'మహత్తు'. అణుస్వరూపంగా ఉన్న స్వామి పసుపు గణపతి. మహత్తుగా వ్యక్తమైనప్పుడు ఎంతో ఎత్తైన 'బృహత్' గణపతి. వినాయక చవితినాడు ఆ స్వామిని ఆరాధిస్తాం మనం. ధ్యాన, ఆవాహనాలు చేసి, షోడశోపచారాలూ సమర్పించిన తరువాత, గణేశాయ నమః - పాదౌపూజయామి, ఏకదంతాయ నమః గుల్ఫౌ పూజయామి, శూర్ప కర్ణాయ నమః జానునీ పూజయామి, విఘ్నరాజాయనమః జంఘౌ పూజయామి, అఖువాహనాయ నమః ఊరూ పూజయామి, గణనాథాయనమః నాభిం పూజయామి, గణాధ్యక్షాయ నమః హృదయం పూజయామి, స్థూలకంఠాయ నమః కంఠం పూజయామి, స్కందాగ్రజాయ నమః స్కందౌ పూజయామి, పాశహస్తాయ నమః హస్తౌ పూజయామి, గజవక్త్రాయ నమః వక్త్రం పూజయామి, విఘ్నహంత్రే నమః నేత్రే పూజయామి, శూర్పకర్ణాయ నమః కర్ణౌపూజయామి, ఫాలచంద్రాయ నమః లలాటం పూజయామి, సర్వేశ్వరాయ నమః శిరః పూజయామి, విఘ్నరాజాయ నమః సర్వాణ్యంగాని పూజయామి అంటూ ఆ స్వామి అవయవాలన్నింటినీ పూజిస్తాం. ఇది చాల విడ్డూరంగా అనిపిస్తుంది. ఏదో, పాదాలను పూజించవచ్చు, పోనీ శిరస్సుపై కూడా పుష్పాలతో అర్చన చేయవచ్చు కాని, "స్వామీ! నీ పిక్కలకు పూజ, నీ మోకాళ్ళకు పూజ, నీ నడుముకు పూజ, నీ పొట్టకు పూజ" అంటూ ఇలా సర్వాంగాలనూ పూజించడం ఎందుకు? అనిపిస్తుంది. వినాయకుడు సృష్టి స్వరూపుడు కదా! సృష్టి అంతటినీ దైవ భావనతో సేవించడం మనకు నేర్పడానికే గణపతి సర్వాంగపూజలు స్వీకరిస్తున్నాడని గుర్తించాలి.

విశ్వమే తన రూపమైన విశ్వ రూపాన్ని ఆస్వామి ధరించినప్పుడు, సృష్టిలోని అణువణువూ ఆ 'బృహత్' రూపంలో భాగమే కదా! అక్కడ సర్వాంగపూజ చేస్తున్నాము- అంటే, ఇక్కడ సృష్టిలోని అణువణువునూ ఆదరించి, ప్రేమించాలని, ప్రాణులందరూ ఆ స్వామి శరీర భాగాలే కనుక, వారిపట్ల సక్రమమైన భావన మనం కలిగి ఉండాలని గణపతి మనకు ప్రబోధిస్తున్నాడు.

ఈ సత్యాన్నే "మీరంతా నా బిడ్డలే కాదు నాన్నా! నా అవయవాలు కూడా". అనే మాటల్లో వివరించింది అమ్మ.

సృష్టి స్వరూపుడైన గణపతి, "మూలాధారానికి అధిపతి" అని యోగశాస్త్రం వివరిస్తోంది. మూలాధారం పృథివీ తత్త్వానికి చెందినది. ఏమీలేనట్లున్న 'శూన్యం' 'గగనం' అయిన ఆకాశం అంచెలంచెలుగా అల్లంత దూరాన అన్నీ ఉన్న భూమిగా దిగివచ్చిందా అన్పిస్తుంది. ఈ సృష్టి పంచభూతాలతో (ఐదుశక్తులతో) ఏర్పడింది. అందులో మొదటిది 'ఆకాశం'. ఇది సూక్ష్మతమం. అక్కడి నుంచి క్రమంగా వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, నీటి నుండి భూమి ఏర్పడ్డాయి. ఇవి ఒక దానికన్న ఒకటి స్థూలమైనవి. వీటిలో స్థూలతమం భూమి. పంచభూతాలతో కూడిన ఈ సృష్టి "స్వామి" నుంచే దిగివచ్చిందని వేదవాఙ్మయం వివరిస్తోంది.

-"ఆత్మనః ఆకాశస్సంభూతః. ఆకాశద్వాయుః ..." ఈ విధంగా.

సృష్టిక్రమానికి సంకేతమే మన దేవాలయాలు అన్నీ. పైన ఉన్న విమానగోపురం ఆకాశం. అందుకే, దానికి 'విమానం' అనే పేరు పెట్టారు. విమానం విహరించేది ఆకాశంలోనే కదా! ఆకాశతత్త్వానికి ప్రతీకగా గోపురం సూక్ష్మంగానే ఉంటుంది. ఆలయ నిర్మాణరీతి ననుసరించి గోపురం నుంచి క్రమంగా స్థూలరూపం పెరిగి, క్రిందికి వచ్చేసరికి సువిశాలమైన ఆవరణ కనిపిస్తుంది భూమికి సంకేతంగా.

సృష్టిలో అవతరణ క్రమంలో మొదటిది పరమాత్మ. చివరిది భూమి. మరి, ఆరోహణ క్రమంలో - భూమియే మొట్టమొదటిది కదా! భూమిపై జీవయాత్ర సాగిస్తున్న మనం పరమాత్మ తత్త్వాన్ని అందుకోవాలంటే, మన ప్రయాణం పృథివీ తత్త్వంతో ప్రారంభంకావాలి. మన సాధనక్రమంలో ముందుగా మనం పృథివీ తత్త్వాన్ని ప్రసన్నం చేసుకోవాలి. పృథివీతత్త్వం మూలాధారం. మూలాధారానికి అధిపతి గణపతి. అందుకే, ఏ శుభకారాన్ని సంకల్పించినా, ఏ క్రతువును తలపెట్టినా ముందుగా గణపతిని ఆరాధించాలని సంప్రదాయజ్ఞులైన పెద్దలు వివరిస్తున్నారు.

వినాయకుడు బ్రహ్మచారి అని కొందరు వివరించగా, సిద్ధి, బుద్ధి అనే ఇద్దరు భార్యలున్నారని మరికొందరు చెప్తున్నారు. వినాయకునిది హస్తా నక్షత్రం. అది కన్యారాశిలోనిది. అంటే వినాయకుడు బ్రహ్మచారి అని గుర్తించాలి. పురాణ వాఙ్మయంలో సిద్ధి బుద్ధి అనే కన్యలను గణపతి వివాహం చేసుకున్న సన్నివేశాలు దర్శనమిస్తున్నాయి.

వినాయకుడు బ్రహ్మచారి అనే భావం ఆది శంకరుల రచనల్లో అక్షరాలా కన్పిస్తోంది. వినాయకునికి వివాహంకాలేదు సరికదా! అతడు అమ్మ దగ్గర చనుబాలు త్రాగే పసిబాలుడుగానే ఉండిపోయాడని ఆది శంకరులు వివరించారు. మాతృస్తన్యంలోని మాధుర్యాన్ని ఆస్వాదించే అపూర్వావకాశాన్ని జారవిడుచుకోవడానికి మనస్కరించక, వినాయకుడు పసివాడుగానే ఉన్నాడని, యౌవనంలో లభించే వధూ సంగసౌఖ్య రసికతను కూడా వదులుకున్నాడని, అసలు ఆ రసికత ఆ గణపతికి తెలియనే తెలియదని శంకరాచార్యులు "సౌందర్యలహరి"లో వివరించారు.

**"పిబంతౌ తౌ యస్మాద విదిత వధూ సంగ రసికౌ**
**కుమారావద్యాపి ద్విరద వదన క్రౌంచదళనౌ॥"** (శ్లో. 73)

అని, కుమారస్వామి, వినాయకుడు - ఇద్దరూ మాతృస్తన్యపాన మాధుర్యాలాలసలో మునకలు వేస్తూ, పసివాళ్ళుగానే ఉండిపోయారని ఆదిశంకరులు అభివర్ణించారు.

వినాయకుడు గణనాయకుడుగా పట్టాభిషిక్తుడైన భాద్రపద శుద్ధ చవితినాడు ఆకాశంలో ఒక సన్నివేశం చూస్తాం మనం. జ్యోతిష, ఖగోళ శాస్త్రాలను అనుసరించి, చాంద్రమానం ప్రకారం ప్రతి భాద్రపద శుద్ధచవితి నాడూ చంద్రుడు "హస్తా" నక్షత్రంలో ఉంటాడు. 'చంద్రుడు' అంటే మనస్సు. విరాట్పురుషుని మనస్సు నుంచి కదా! చంద్రుడు ఆవిర్భవించాడు. ఆ చంద్రుడు మన మనస్సులకు అధిపతి. చంద్రుడు 'హస్తా' నక్షత్రంలో ఉండడం అంటే మనస్సు చేతిలో ఉందన్న మాట. ఏపని నెరవేరాలన్నా సంకల్పించేది మనస్సు.

ఆచరించేది చేయి. సంకల్పించే మనస్సు - చేసే చేతిలోనే ఉన్నప్పుడు కార్యసిద్ధికి లోటు ఏముంది? అంటే, 'సిద్ధి' - వినాయకుని ఆధీనమై ఉన్నదన్న మాట.

హస్తానక్షత్రం బుధగ్రహానికి, బుద్ధికి చెందినది. అంటే బుద్ధి కూడా వినాయకుని అధీనంలో ఉన్నట్లే కదా!

'సిద్ధి', 'బుద్ధి' అనేవి రెండూ గణపతి అధీనంలో ఉండటాన్ని, సాహిత్య పరిభాషలో 'సిద్ధిపతి', 'బుద్ధిపతి' అన్నారు. 'పతి' అన్నారు కదా! అని, సిద్ధిని, బుద్ధిని స్త్రీమూర్తులుగా వర్ణించి, గణేశ్వర వివాహాన్ని వర్ణించారు సారస్వత వేత్తలు.

బుద్ధితో ఆలోచించి, ప్రణాళికాబద్ధంగా ముందుకు సాగితే, కార్యసిద్ధి జరిగితీరుతుందని గణపతి మనకు ప్రబోధిస్తున్నాడు.

వైష్ణవ సంప్రదాయంలో వినాయకుణ్ణి "విష్వక్సేనుడు" అన్నారు. ఆయనకూ ఇద్దరు భార్యలు. జయ, సూత్రవతి అని వారి పేర్లు.

ప్రణాళికా 'సూత్రం' ప్రకారం కృషిచేస్తే 'జయం' తథ్యమని చెప్పటమే ఆంతర్యం.

సిద్ధి - జయ, బుద్ధి - సూత్రవతి,
వినాయకుడు - విష్వక్సేనుడు.
పిలిచే పేరు వేరైనా, దైవం ఒక్కడే.
వివరించే తీరు వేరైనా, సత్యం ఒక్కటే.
ఆసత్య స్వరూపుడే గణపతి.

గణపతి సత్యస్వరూపుడని చెప్పడానికి 'బ్రహ్మాండపురాణం' లోని 'లలితోపాఖ్యానం'లో అద్భుతమైన ఒక సన్నివేశం కనిపిస్తుంది.

దేవతల కోరిక మేరకు చిదగ్ని కుండం నుంచి ఆవిర్భవించిన లలితాదేవి భండాసురునిపై యుద్ధం ప్రకటించింది. ఆ యుద్ధంలో భండాసురుని ప్రయత్నాలు క్రమంగా విఫలమైపోయాయి.

భండాసురుడు దేవిని యుద్ధంలో ఎదుర్కొనే సమయంలో ఆమె నుంచి వచ్చే శక్తులు తనకు, తన సైన్యానికి అడ్డు రాకుండా ఆ రాక్షసుడు విఘ్నయంత్రం ప్రయోగించాడు. అప్పుడు దేవి తన ప్రక్కన గల కామేశ్వరుని ముఖం వంక చూచి, గణపతిని సృష్టించింది. భండాసురుడు ప్రయోగించిన విఘ్నయంత్రాన్ని భగ్నం చేయగల శక్తి గణపతికే ఉంది. తల్లి ఆదేశానుసారం గణపతి విఘ్న యంత్రాన్ని నివారించాడు.

పవిత్ర కార్యక్రమాలు ప్రారంభించేటప్పుడు విఘ్నాలు సంభవించడం ప్రకృతి లక్షణం. వాటి నివారణకై గణపతిని ఆరాధించాలి. గణపతి అనుగ్రహం వల్ల విఘ్నాలు తొలగిపోతాయి. లలితాదేవి భండాసురుడిపై యుద్ధం

ప్రకటించి వచ్చింది కదా! యుద్ధం ప్రారంభమైనప్పటి నుండి భండాసురుడికి అన్నీ ఎదురుదెబ్బలే. తన సైన్యం, తన పుత్రులు, బాహువుల్లాగా తనకు రక్షణ కల్పిస్తారనుకున్న విశుక్ర, విషంగులు ఒక్కరొక్కరుగా నశిస్తున్న కొద్దీ భండాసురుడు బెంబేలెత్తసాగాడు.

సాగినంత కాలం నా అంత వాడు లేడనుకొని విర్రవీగే దుష్టులు, తమ పరిస్థితులు తారుమారు కాగానే తప్పించుకోవాలని, తలదాచుకోవాలని చూస్తారు. అమ్మవారు, ఆమె పరివారము తనపై ప్రయోగించే శస్త్రాస్త్రాల బారి నుండి తన్ను తాను రక్షించుకోవడం ఎలాగా అని తల్లడిల్లాడు భండాసురుడు. దిక్కుతోచక, ఒక విఘ్న యంత్రాన్ని ప్రయోగించాడు.

భండాసురుడు అలా విఘ్నయంత్రం ప్రయోగించగానే 'అయితే ఏం చేద్దాం? అన్నట్లుగా ప్రక్కనున్న పతిదేవుణ్ణి చూచింది లలితాదేవి. ఆ చూపులలో నుండి రూపు కట్టుకుని గణపతి ముందుకు వచ్చాడు. ఈ కథ వినగానే కావలసినన్ని సందేహాలు తలలెత్తుతాయి మనలో.

యుద్ధానికి వెళ్ళే లలితాదేవి, ఏదో 'వాహ్యాళి' కి వెళ్ళినట్లు భర్తతో కలసి వెళ్ళిందా? భార్య యుద్ధానికి వెళ్తుంటే వెంట వెళ్ళే భర్తలు, భర్త వెంట యుద్ధానికి వెళ్ళే భార్యలు మన వాఙ్మయంలో లేకపోలేదు. దేవాసుర సంగ్రామంలో దేవతలకు సహాయకారిగా యుద్ధానికి వెళ్ళిన దశరథుడు కైకను వెంటబెట్టుకునే వెళ్ళాడు. నరకాసురునిపై యుద్ధానికి బయలుదేరిన శ్రీకృష్ణుణ్ణి సత్యభామ అనుసరించింది.

కాబట్టి లలితాదేవి వెంట ఆమె భర్త కూడా యుద్ధ రంగానికి వచ్చాడని సరిపెట్టుకుందాం.

భండాసురుడు విఘ్నయంత్రం ప్రయోగించగానే, అమ్మవారు అయ్యవారి వంక చూడడం ఏమిటి? అలా చూడగానే, ఆ చూపుల్లో నుండి గణపతి ఆవిర్భవించడం ఏమిటి? ఇది నమ్మశక్యంగా ఉందా?

అసలు బాల గణపతి ఇదివరకే ఉన్నాడు కదా! కైలాస ప్రాంగణంలో ఆడుకుంటూ, హరనేత్రాగ్ని దగ్ధమైన మన్మథ శరీర భస్మరాశిని చిత్ర రూపంలో తీర్చిదిద్దింది అతడే కదా! ఆభస్మరాశిలో నుండి ఆనాడు పుట్టినవాడే కదా! భండాసురుడు. ఇంత కథ నడిచాక, మళ్ళీ ఇపుడు అమ్మవారు అయ్యవారిని చూస్తే, ఆ చూపుల్లో నుండి, కొత్తగా గణపతి వచ్చాడనడం సమంజసంగా ఉందా? అనిపిస్తుంది మనకు.

సమాధానం ఏమిటో ఆలోచిద్దాం. అమ్మవారి వెంట యుద్ధరంగానికి వచ్చిన ఆ అయ్యవారి పేరు "కామేశ్వరుడు". కామానికి లొంగిపోయిన వాడు కాడు అతడు. కామాన్ని అదుపుచేగలవాడు. అతడు మూడవ కన్ను (జ్ఞాననేత్రం) తెరిస్తే, 'మన్మథలీల' భస్మం అయిపోయింది. సృష్టిలోని సకల మాంగల్యాలకూ మూలమై శుభప్రతిపాదకమైన 'శివ' తత్త్వమే అతడు. సర్వమంగళకు ఈశ్వరుడైన కామేశ్వరుడు. అతడు సర్వ 'శివం' కరుడు.

ఇక, ఆ తల్లి 'సౌందర్యలహరి', 'మహా లావణ్య శేవధి', 'మహా త్రిపుర సుందరి'.

సత్యం, శివం, సుందరం అయిన ఈ సృష్టి తత్త్వంలో 'శివం' కామేశ్వరుడు, 'సుందరం' అమ్మవారు. 'సౌందర్యం' అంటే శరీర సౌందర్యమే కాదు, శివుణ్ణి ఆకర్షించే సంపదలు, భోగాలు, పదవులు, అధికారాలు అన్నీ. ఇవన్నీ కలిస్తే సౌందర్యం. సృష్టిలోని సౌందర్యం పట్ల మన దృష్టి పవిత్రమైనదిగా ఉండాలి. 'శివం' కరం కావాలి. అమ్మవారు అయ్యవారి వంక చూడడం అంటే అది. అలాంటి చూపు సాధకుడికి ఉంటే అతడి అంతరంగంలో 'సత్యం' ఆవిర్భవిస్తుంది. అలా ఆవిర్భవించిన సత్యస్వరూపుడే శ్రీగణేశ్వరుడు.

మనకు విఘ్నాలు ఎందుకు కలుగుతాయి? మనలో భ్రమలు పెరిగినపుడు సత్యాన్ని చూడలేము. అందువల్ల విఘ్నాలు ఏర్పడుతాయి. ఈసృష్టిలో ఏదీ శాశ్వతం కాదనీ, దేనిమీదా వ్యామోహం పెంచుకోవద్దని పెద్దలు చేసే ప్రబోధం మన తలకెక్కదు. ఆ ప్రబోధం యధార్థమని, అందుకు తానే సాక్ష్యమని, తొలిపూజ లందుకునే ఇలవేల్పు, మన ఆరాధ్య దైవం గణపతి ప్రబోధిస్తున్నాడు.

మరే పండుగనాడూ లేని ఒక వింత కార్యక్రమం వినాయక చవితినాడు చూస్తాం, చేస్తాం మనం. ఊరి చెరువులో నుండి తెచ్చిన పచ్చి మట్టితో వినాయక ప్రతిమను ఏర్పరచుకొని పూజిస్తాం. ఇలా చేసే ఆచారం మరే ఇతర దేవతామూర్తుల విషయంలోనూ కనిపించదు. అలా పూజించిన ఆ ప్రతిమను గణపతి నవరాత్రులు కాగానే మళ్ళీ ఆ చెరువులోనే నిమజ్జనం చేస్తాం. అతణ్ణి పూజించి, అతడిచ్చే వరాలన్నీ పుచ్చుకొని, ఆ వరసిద్ధి వినాయకుణ్ణి నీళ్ళల్లో నిలువునా ముంచేస్తాం. ఇంతటి దారుణాన్ని కూడా అతడు తనకు అనుకూలంగానే స్వీకరిస్తాడు. బాల గణపతి కదా! మన పూజలు అందుకొని, మనకు వరాలిచ్చి తరింపచేయడానికి అమ్మని, నాన్నని వదిలి కైలాసం నుండి వచ్చిన ఆ బాలుడికి - వచ్చిన పని కాగానే ఎంత వేగంగా తల్లిని, తండ్రిని చేరుకుందామా అనిపిస్తూ ఉంటుంది. నీటిలో నిమజ్జనం బాల గణపతికి అనుకూలమే. నీరు అంటే 'గంగ' కదా! శివుని తలపై ఉండేది గంగ. అందువల్ల అలా నీటిలో నిమజ్జనం అయిన గణపతి తక్షణమే తండ్రిని చేరుకునే అవకాశం కలుగుతున్నందుకు ఆనందిస్తాడు.

ఇంతకీ గణపతి మట్టిలో నుండి పుట్టి, మళ్ళీ ఆ మట్టిలోనే కలిసిపోతున్నాడు. 'మీరు ఆరాధించే నా పరిస్థితే ఇది కాగా, నన్ను ఆరాధించే మీరూ అంతే' నని అతడు చెప్పకనే చెప్తున్నాడు. ఈ సత్యాన్ని మనకు తెలియచేయడానికే అతడు మూలాధారానికి అధిపతిగా ఉన్నాడు. "మూలాధార క్షేత్ర స్థిత!" అని గణపతిని సంబోధించడం "వాతాపి గణపతిం భజే" అనే ప్రసిద్ధమైన కీర్తనలో అనునిత్యమూ మనము వింటూనే ఉన్నాం. 'మూలాధారం' పృధ్వీ తత్త్వానికి చెందినది.

మట్టిలో పుట్టి మట్టిలోనే కలిసిపోతున్నామనే పరమసత్యం సాధకునిలో వెలుగొందడమే గణపతి ఆవిర్భవించడం అంటే సత్యం, శివం, సుందరంలో సత్య స్వరూపుడు గణపతి. సుందర స్వరూపిణి అయిన లలితాదేవి, శివస్వరూపుడైన కామేశ్వరుణ్ణి చూడగా, ఆ చూపులలో సత్యస్వరూపుడైన శ్రీ గణేశ్వరుడు ఆవిర్భవించడం

అన్నది ఈ కథ చాటున దాగి ఉన్న పరమార్థం.

సత్య సందర్శన పొందిన సాధకునికి విఘ్నాలు లేవు. అవన్నీ సాధనలో సోపానాలే. చెడుపై యుద్ధం ప్రకటించి, మంచిని గెలిపించుకోవాలని సంకల్పించిన సాధకుడు ఒక్కొక్క అడుగు ముందుకు సాగుతూ ఉంటే, అతనిలో దాగిన దుష్టప్రవృత్తి, అతణ్ణి సాధన మార్గం నుండి విముఖుణ్ణి చేయడానికి అతడికి విఘ్నాలు కల్పిస్తుంది. భయాల రూపంలో, ప్రలోభాల రూపంలో అతణ్ణి మింగివేయజూచే ఆ విఘ్నాలను అతిక్రమించాలంటే, సాధకుడు సత్యాన్ని సందర్శించాలి. అందుకు అతడు చేయవలసింది సౌందర్యం (ప్రకృతి) పట్ల తన దృష్టిని 'శివం' కరం (మంగళప్రదం లేక పవిత్రం)గా మలచుకోవడమే.

అలాంటి స్థితిని పొందటానికే మనం చేసే సాధనలన్నీ. మన సాధనలకు ఫలంగా దైవం మనకు ఆ స్థితిని ప్రసాదిస్తాడు.

ఈ కథలో అమ్మవారు కామేశ్వరుని ముఖం వంక చూడగా - ఆ చూపులలో నుండి ఆవిర్భవించిన గణాధిపతి, అమ్మ అనుజ్ఞ మేరకు విఘ్న యంత్రాన్ని భేదించాడు.

భండాసురుడు ప్రయోగించిన 'జయవిఘ్న' మనే పేరు గల ఆ విఘ్న యంత్రం అలా గణపతి వల్ల తునాతునకలు కాగా, అమ్మవారికి అంతులేని ఆనందం కలిగింది.

మానవులు ఒక ఉత్తమ గమ్యం వైపు సాగాలంటే, మనసులో దాగిన అసుర సంపత్తి నుంచి విఘ్నాలు వచ్చి అడ్డు నిలుస్తూ ఉంటాయి. పరాశక్తిని ఆరాధించే వారికి విఘ్నాల నుంచి నివారణ లభిస్తుంది. ఆమె దృక్ప్రసారం నుంచి ఆవిర్భవించిన మహాగణేశుడు విఘ్నాలను నివారించి, తాపత్రయాన్ని (ఆధిభౌతిక, ఆధిదైవిక ఆధ్యాత్మిక తాపాలను) అణచి, సాధకులకు శాంతిని ప్రసాదిస్తాడు.

దేవీ ఉపాసన విఘ్న నివారకమని, సాధకుని మనస్సు నిశ్చలమైతే విఘ్నాలు తొలగి కార్యసిద్ధి కలుగుతుందని మనం గ్రహించవచ్చు.

తన 'లో' కలిగిన సత్య సందర్శనం వల్ల విఘ్నాలు పటాపంచలై అవి సాధనలో సోపానాలుగా అమరినప్పుడు సాధకునికి ఆత్మానందం కలుగుతుంది.

ఈ విశేషాన్ని వ్యాసమహర్షి "కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా", "మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా" అనే రెండు నామాల్లో వివరించారు. గణపతి సత్య స్వరూపుడు.

ప్రేమైకమూర్తి మన "అమ్మ" (జిల్లెళ్ళమూడి) మనకు సత్యసందర్శనాన్ని అనుగ్రహింపదలచి, వరసిద్ధి వినాయకుణ్ణి ప్రసాదిస్తోంది.

ఆ స్వామిని సేవించి, ఆ తల్లిని ఆరాధించి, మన జీవితాలు చరితార్థం చేసుకుందాం.

## THE GIFT THAT KEEPS ON GIVING

- Richard Schiffman

Mother remarked before taking Mahasamadhi that after her physical form was no longer with us she would be even more available to her children than before. All of us in our own way have felt Mother's continuing presence. For some it comes in dreams, intuitive guidance at critical junctures, gracious interventions in our lives, boons granted, illnesses cured, or more simply the ongoing experience of being embraced in our Mother's sweet and causeless love.



What we have received from Amma is not like the gifts which the world gives, the material objects and benefits which get gradually depleted and corrupted by the passage of time. Mother's gift of her own Spirit is everlasting. It is like a precious heirloom which appreciates in value over time. It grows within us like a seed. This is because what Mother

has given us is a living thing, it is Life Itself. And Life never remains static. It can only develop, it can only expand over time, become more whole, and more integrated, more all-embracing. This is what is happening in all of our hearts— the seed which Mother has planted is coming into its own. The tree is growing, the branches are spreading, and the roots are penetrating ever deeper into the soil of us.

This is the mystery of Mother[1]s Love. It is the gift that keeps on giving. It can never be exhausted, because it is alive within us. And being alive, we can never say for certain how it is going to manifest, where it is going to take us. If Mother had given us a diamond ring, for example, or a bar of gold, then we would know exactly what the gift was, and how much it was worth, and where we could go to redeem it. The value of the gift would remain the same today as it was yesterday, and it would be the same tomorrow as it is today. It would be a fixed and limited sum. But the thing about Mother[1]s gift of Life is that it is no longer the same gift as it was when we received it. The gift has transformed within us, it is even now transforming, revealing new facets, disclosing previously hidden treasures. It is not a fixed sum, but a living organism. And as with all other living organisms, there can be no predicting where this one will head next!

Mother has planted the seed of herself within all who have come into contact with her. But this seed is not the same thing as a memory. Mother is not merely a series of good memories, of sweet memories that we can return to in times of stress or trouble. Mother is not someone we once knew, but now has moved on irrevocably, has passed away into the Infinitude of Her own Selfhood. Mother is not a Goddess who we can worship, an idol of stone that we can burn incense to and do pooja before. She is the seed which became a sapling, the sapling which became a tree. Even now that tree is growing and which will never stop growing, because its nature is to spread out, its nature is to invade new territory— until it holds everything, contains everything, pervades every nook and cranny of ourselves.

The love which MOTHER knows only one thing. It knows only how to advance. It knows only how to press against all previous boundaries. Until the boundaries are shattered, until all dividing lines dissolve, the inner becomes the outer, the outer becomes the inner... root, trunk, branch merge and become one vast net of affection, Indra[1]s net, the limitless net of Life Itself, Life holding and embracing all that is in its Supreme Motherly Heart.

Jaya Ho Mata!



# AMMA

H.G. Parsa, Ph.D., FMP
The Ohio State University.

O*! Amma!!!!
You are always watching
My sister Chellemma**
As she never stops
Seeking your blessings

O! Amma!!!!
As you descend
To step into her house
You may step on the
Frozen blades of the green lawn

O! Amma!!!!
Let me be the melting morning dew
As I can't bear the pain of
The frozen blades hurting
Your tender feet

O! Amma!!!!
As you descend
To step into her life
You may become the walking stick
She holds through the life's hills and valleys

O! Amma!!!!
Let me be the
Cushion and cap of the stick
As I can't bear the thought –
You and your tender hands
Hurting through the rocks, thorns and streams
As you both roam among the hills and valleys

O! Amma!!!!
As you descend
To step into her house (really it is your house)
To soothe her swollen teary eyes

O! Amma!!!
Let me be the swaying evening breeze -
That wipes your dripping sweat
So you may stay a little longer
And soothe a crying soul a little longer

O! Amma!!!!
As you descend
To step into her life
You may be the
Only light in the
Darkest days of her life

O! Amma!!!!
As you show her the enlightened path
Let me be the oil
That keeps the (you) burning wick
Shining red and bright
Through the darkest nights and dreary days

O! Amma!!!!
As you descend
To step into her life,
In her joy of seeing your love
She may not even remember to eat –
As she lays lost at your feet

O! Amma!!!!!
Let me keep a ripened fruit in a painted bowl
On her small altar table
So I may feed two hungry souls –
Human and divine – seeking one communion

O! Amma!!!!!
As you descend
To step into her life
Try not to wait till eleventh hour
[as you did for Ganjendra and Draupadi]
She may not have the
Time to wait or energy to cry

O! Amma!!!!
Let me the cloud
That fetches you fast
Carrying your gentle feet
Planted so firmly in her heart and soul
Even in the eleventh hour

O! Amma!!!!!
As you descend
To step into her life
Can you be kind?
Can you be gentle?
Can you be nice?
Can you be sweet?
Can you be merciful?
Can you be tender?
Can you love?
Can you be caring?
I am asking you – ONLY because
She is my sister and
Now you can call her – Chellemma too

O! Amma!!!
You may walk on my back
If you have to -
To get there faster
To get there quicker
But be there for certain
Whenever she needs you
Because she is
Your CHELLEMMA too (now)

O! Amma!!!!
As you descend
To step into my sister's life
Why should I ask -
You are my **AMMA** - Aren't y**O**u?
All I ever ask for is
Your two holy feet
Planted firmly in my lonely soul.
With prayers I remain.

* = Letter 'O' is used to reflect the completeness and perfection of AMMA
** = We always referred our younger sister Chellemma as is common in many Telugu families.

[**Inspiration**: Recently, in December 2005, I had the opportunity to climb 12.9km in Himalayan base range for the Darshan of Vahnavi Devi. I was accompanied by my sister Chellemma, brother-in-law Dr. Vasudevan and niece Nivedita. Irrespective of the deity I visit, my chanting always remains the same "Jayaho Mata .........". This above poem was inspired by the scenes of my sister struggling to climb the stairs over the hills on a 5 hour long journey in search of blessings of Vaishnava Devi.]

I dedicate this poem to my parents who are kind enough to leave me at the Holy Feet AMMA.

**అమృత సింధువు**

శీతలసుధాకరుడు అగ్నిశిఖలు విరజిమ్మినా
హిమాలయం అగ్నిపర్వతంలా బ్రద్దలయినా
మలయానిలం అనలమై జడిపించినా
శాంతి మహాసముద్రంలో ప్రళయభీకర బడబాగ్ని ప్రజ్వరిల్లినా
విపంచీ మృదు స్వరంలో విలయనాదం వినిపించినా
నిశీధ గగనంలో అరుణారుణ మాతృత్వపు వెల్లువలో
నిర్వ్యాజ, నిస్స్వార్థ, నిరుపమాన, అనంతమైన కరుణ ముందు
అవన్నీ నిస్తేజమై, నిర్లిప్తమై, నిర్వీర్యమై, నిస్తరంగమై,
నిశ్చలమై, అమృత సింధువులై, ఆత్మబంధువులై
మనను పలకరిస్తుంటాయి. అన్నీ అమ్మ రూపాలే కదా!

\- శ్రీమతి కుసుమా చక్రవర్తి

## MUSINGS

by Rahi Racharla

Mother, I see people doing great Sadhana in order to reach you, obtain you. Some do great penance, and do some yoga, pranayama. The minute I sit for meditation, my mind and body drags me thru all unnecessary thoughts. Mother you just have to be big hearted and takes me into your lap as I am completely incapable of doing any Sadhana effectively for reaching you. You only said that there might be bad son, never a bad mother. So, I completely trust the sole responsibility lies with You and no one else. So, I might pretend to know things, or do things, but in hearts of hearts I know my limitations and I know you drive this body and mind the way you choose to.

Initially you attract us through miracles and create belief and devotion in us. Thus we are converted into devotee. Thus from the stage of ignorance the soul carries on the journey to the stage of a devotee. This journey is taking place due to the effort of You alone. Mother, I prefer "Marjala Kisora Nyaya" to "Markata Kisora Nyayam". In the case of "Marjala Kisora Nyaya", mother cat carrying on its off spring by catching it with her mouth. I know not how to approach you. Just like kitten, I am only a helpless child and keep waiting for you and call "Amma". When our effort exists, it is called as "Markata Kisora Nyaya", which means the off spring is holding on itself by catching the womb of its mother-monkey. Isn't Kid safer if his Father holding the kid's hand while crossing over a bridge than the kid holding his Father's hand? As kids, we have great tendency to get distracted during our journey and leave your hand, Mother. You only said, "there is no prescribing Sadhana, but just doing it". From that I understand, that you are only the doer.

ఓం యశ్ఛందసామృషభో విశ్వరూపః । ఛందోభ్యోధ్యమృతాత్సంబభూవ । స మేంద్రో మేధయా స్పృణోతు। అమృతస్య
దేవధారణో భూయాసమ్ । శరీరం మే విచర్షణమ్ । జిహ్వా మే మధు మత్తమా ।
కర్ణాభ్యాం భూరివిశ్రువమ్ । బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః । శ్రుతం మే గోపాయ ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఏ నాదం వేదాల అత్యంత శ్రేష్ఠమైన భాగమో, వినాశం లేని వేదాలనుండి ఉద్భవించినదో, ఆ ఓంకారం నాకు మేధస్సును ప్రసాదించుగాక! దేవా, నేను అమృతమయుడైన పరబ్రహ్మను గురించిన జ్ఞానాన్ని పొందుతాను గాక! నా శరీరం ఆరోగ్యవంతంగా ఉండుగాక! నా నాలుక మధురాతిమధురమైన మాటలనే పలుకుగాక! చెవులు అనేక మంచి విషయాలనే ఆలకించుగాక! ఓంకార పరబ్రహ్మ! లౌకిక వస్తువుల గురించిన జ్ఞానంచేత నువ్వు ఆవరింపబడి ఉన్నావు. భగవంతుని ప్రాప్తిస్థానం నువ్వు. నేర్చుకొన్నదానిని మరచిపోకుండా కాపాడు.

- శాంతి మంత్రం

# చిదంబరం

- కీ॥శే॥ రామరాజు కృష్ణమూర్తి

"ఎందుకు తాతగారూ బ్రహ్మాండం పక్కలో పెట్టుకొని ఏడుస్తారు. అని అడిగింది అమ్మ - తాతగారైన చిదంబరరావుగార్ని. పట్టలేని ఆనందంతో ఉక్కిరిబిక్కిరై చెక్కిళ్లనించి జారే కన్నీరు పక్కనుతడుపుతోంటే! యీ సందర్భంలో అడిగారు ఆయన - "అమ్మా నీవెందుకువచ్చావో, నీ అవతారమేమిటో చెప్పమ్మా" అని.

దానికి అమ్మ "నాది అవతారమని ఎవరుచెప్పారు? నేనేమీ పెట్టుకురాలేదు! నాకేమీ తెలియదు. ప్రత్యేకించి ఒకపని అంటూలేదు! సృష్టి ఏ ఉద్దేశంతో జరుగుతున్నదో...." అంటూ అమ్మ హఠాత్తుగా ఆపేసింది.

ప్రథమంలో స్పందన కలిగినపుడే యిదంతా అయికూర్చుంది అంటుంది అమ్మ. ఇదంతా ఇట్లా కావాలనుకుంది - అదే సృష్టి ఉద్దేశం - కావాలనుకోవడం అలాగే అమ్మ రావాలనుకుంది - వచ్చింది. అంతే కానీ వేరే ఏ ఉద్దేశమూ లేదని. (పోవాలనుకుంది - చెప్పింది - ఎప్పుడు అవసరమనుకుంటే అప్పుడు వస్తాననీ అన్నది!

అలాగే ఒకసారి అనేకమైన అనుభవాలు అమ్మ దైవమని తోపింపచేసినా ఆభావం స్థిరంగా నిలవడంలేదని వ్యధ వ్యక్తం చేస్తే, అమ్మ అది, ఆ చాంచల్యం మనస్సుకు సహజమంటుంది. కానీ తాతగారు వినమ్రులై "అమ్మా నీ నిజరూపంచూపించమని" వేడుకుంటారు.

అమ్మతో మాట్లాడుతూ ఆ వచోమాధుర్యానికి మత్తిల్లి ఓపుకోలేనిప్రేమతో అమ్మను దగ్గరగా తీసుకొని ముద్దుపెట్టుకోబోతే అకస్మాత్తుగా అమ్మ అదృశ్యమౌతుంది. చిన్ని పాపై మురిపించి ముద్దులమూటై ఒక్కసారి గుండెలకు అదుముకుందామనే ఆశ నిలువనీయకపోతే చేతులలోని అమ్మ మాయమైంది - ఐనా తాతగారికి కలవరపాటు కలగలా. 'ఏమిటమ్మా అదృశ్యమైనావు" అంటూ చల్లగా అడిగారు.

"అది మీకు సాదృశ్యం" అంటూ అమ్మ కంఠస్వరం వినిపించింది. రూపం లేకపోయినా!

ఇంకా వివరించింది అమ్మ - "రూపంలేనిది రూపం వచ్చింది. వచ్చినరూపంపోయింది. నా రూపం చూపించమని అడిగారు. ఉన్నది కనక లేకపోవడం అంటూ వచ్చింది. లేదు కనక యీరూపం ఉన్నదంటూ వచ్చింది. లేని రూపం నిర్గుణం. ఉన్న రూపం సగుణం. అదే నిర్వకారం - సాకారం - నిర్వికారానికీ అకారముంది. సాకారానికీ ఉన్నది. ఉన్నదేదో ఉన్నది. ఈ ఉన్నదే అది. అదే నేను" అంటూ మళ్లీ ఎదుట కనిపించిన అమ్మను చూస్తూ ఉండిపోయారు తాతగారు.

అసలు ఆధ్యాత్మికమైన అనుభవం అంటే ఏమిటి? ఓ రూపాన్ని చూడటమా? ఓ ఉన్నతమైన భావచైతన్యంలో శరీరస్పృహపోయి ఉండటమా? అసలేమిటి? పై సంఘటనలో అమ్మ రూపం లేదుకానీ మాటలు వినిపిస్తున్నాయి. అసలు అమ్మ చిన్నిపాప ఐనా తాతగారు అమ్మ సన్నిధిలో భక్తి ప్రపత్తులతో వినమ్రులై చేతులు కట్టుకొని, ఒక్కొక్కపుడు భయంతో చెమటలు పట్టి, ఒక్కొక్కపుడు నిలువలేక శరీరానికి కంపనపుట్టి, ఒక్కొక్కపుడు

ఆనందంతో ఏడుస్తూ, మరొకపుడు శరీరవిస్మృతిలో గంటలకొద్ది మ్రగ్గి, మరొకపుడు అనేక దేవీదైవతాలను దర్శించి - యీ రకమైన అనుభవాలు బలవత్తరమై (వాటంతట అవే చిన్ని శరీరాన్ని ఊపేస్తుంటే) - ఇంతకూ ఏమిటి? యీ కనిపించే తనచుట్టూ ఉన్నవన్నీ అమ్మ అనిపించడమా? ఇదీ ఆధ్యాత్మిక అనుభవమేనా? అసలేమిటి కలవాల్సింది? ఇదే ప్రశ్న పీటముడై తాతగార్నీ పట్టింది. ఎంతకూ తృప్తిలేదు. ఎపుడూ ఆ రూపమే చూస్తూ ఉండాలని, ఆ కంఠస్వరమే వినాలని, ఆ స్పర్శే కావాలని ఒకటే తపన. చూడటానికి చిన్నిపిల్లలా కనిపించినా ఒక్కొక్కపుడు చాలా పెద్దదానివలె అనిపిస్తావని అమ్మతో అంటారు. సరే, మరి ఏమిటి ఆధ్యాత్మిక అనుభవం. (ఆధ్యాత్మికం వేరు, లౌకికంవేరు అని అమ్మ అనదు. అదీ ఇదీ అంతా ఒకటేనంటుంది. అపుడు ప్రశ్న రీతే మారుతుంది.

ఒక సందర్భంలో అమ్మ తాతగారితో అంటుంది - మానవ జీవిత గమనం రెండే గ్రహాల మీద ఆధారపడి ఉందని. అవి రాగద్వేషాలని - యీ రెండూ కావాలనే దానిపై ఆధారపడి ఉన్నాయని అంటే, దానికి తాతగారు- ఎవరికి కావాలి? ఏమి కావాలి? వివరించమని అమ్మను అడుగుతారు.

దానికి అమ్మ ప్రతి వారికీ ప్రతిదీ కావాలి ప్రతివాళ్ళూ ప్రతిదీ వాడికి కావాలి. ఇది లేకపోతే వాడు లేడు. వాడున్నావాణ్ణి గుర్తించే వాళ్లుంటేనే వాడి ఆట. వాడి ఆటలో ఉన్న మనం మనదేదో ఉన్నదని బాధపడుతూ ఉంటాము. ఆ శక్తి తమాషా ఏమిటంటే శుద్ధంగా ఉంటే తనే ఔతుంది. తనకు లేకపోయినా మనకు మలినం పెట్టాడంటే వాడికి కావలసి వచ్చిందిగా. యీ కావలసి రావడం అంతా వాడి రూపమే. ఆ శక్తి రూపమే. ఒకే శక్తి వాడూ అదీ అయింది. అది వాడే. ఆ అది ఇదంతా కలిసి ఆ అనాదే కావాలి.

కనక మలినం పెట్టడం వల్ల కావలసి వచ్చింది. వెంటనే తాతగారు అడిగారు "మలినం అంటే ఏమిటి?" ఆధారపూర్వకంగా చెప్పమని.

"మలినం అంటే వస్తు రూపాంతరం - ఒక రూపం మరుగునపడి మరొక రూపం రావడం. స్వచ్ఛతకు అద్దం ఉపమానంగా తీసుకుంటాము. శుద్ధమైన అద్దంలో ముఖం కనబడదు. ఆ అద్దానికి రంగు పూస్తేకానీ ముఖం కనబడదు. ఆత్మకు ప్రతి జగత్తు - అందుకనే జగత్తు ఆత్మ కాకపోలేదు."

తాతగారు ఊర్కోలే "బ్రహ్మ సత్యం జగత్తు మిధ్య అంటారు కదా" అన్నారు.

దానికి అమ్మ "ఏది అనుభవిస్తుంటే అదిసత్యం. కడుపునొప్పి వచ్చినపుడు నొప్పి అసత్యం అనుకుంటాడా? బ్రహ్మ సత్యమైననాడు జగత్తు వేరు కాదూ? నిత్యమైన దానిని తెలుసుకొనడమే సత్యం."

కనక ఆధ్యాత్మిక అనుభవం 'నిత్యమైన సత్యాన్ని తెలుసుకోవడం'.

అలాగే "ఏమికావాలి" అనేది అమ్మ వాసుదాసుగారి సంభాషణలోనూ వస్తుంది. యీ ప్రశ్నకు అమ్మ సమాధానం చెప్పవలసి వస్తుంది - వాసుదాసుగారు "అమ్మా నీకేమి కావాలో చెప్పు" అని అడిగితే అమ్మ "ఏమన్నా కావాలనేది అక్కర లేకుండా కావాలి"! అన్నది. "ప్రతివారికీ ప్రతిదీ కావాలి...." దీనికీ పైదానికి మధ్య సమన్వయం?! అలాగే "ఉన్నరూపం సగుణం" - "గుణబేధమే లేని నాకు కులభేదమేమిటి"? వీటిరెంటి మధ్య సమన్వయమో!?

దీనికీ తాతగారి నించి అమ్మ సమాధానం రాబట్టింది.మరిడమ్మ తాతమ్మగారు చిదంబరరావుగారు పరస్పరం వారివారి అనుభవాలు కూడదీసుకొని ఆ దైవమే వారింట అవతరించడం తేల్చుకొని ఆ ఆనందంలో తాతగారు తాతమ్మతో - "మొత్తం మీద బ్రహ్మాండం మన ఆవరణలో నిండి ఉంది. అంటే నిండింది కనబడేది కాదు. పరిమితం కనబడేది. అది నిండి ఉంటే అందరికీ అర్థమయ్యేది కాదు. కనుక పరిమితంగా వచ్చింది. అర్థమయినట్లు ఉండి అయోమయమౌతుంది. అర్థం కాకుండా ఉండి వారి వారి సంస్కారాలను బట్టి అర్థమౌతుంది. ఆ రంగమ్మతల్లి పోతూపోతూ మన చేతుల్లో పెట్టినందుకు జాగ్రత్తగా ఆ బిడ్డను రచ్చకెక్కించకుండా చూచుకోవాలి" అన్నారు. కానీ అమ్మను ధ్రువుణ్ణి ప్రహ్లాదుణ్ణి కలిపి చూచిన వారు సీతాపతి తాతగారే - "తల్లిఛస్తే ఉండటంలేదూ? తల్లితోపాటు పోయిందా? ఇది పోయినా అది బ్రతికేదేమో"? అన్నారు. అయినా తాతగారూ, తాతమ్మగారూ ఇద్దరూ వారిలో ఏర్పడ్డ అభిప్రాయాన్ని - అమ్మదైవమనే అభిప్రాయాన్ని మారకుండా ఉంచమని వేడుకుంటారు. తాతగారు తనకు కల్గిన అనేక అనుభవాలకు తృప్తిపడి "నాకు ఇచ్చిన అనుభవాలు నాకు చాలు. ఐనా నాకేమి అర్హతున్నది? అపవిత్రుడికి పవిత్రత ప్రసాదించింది అమ్మ" అంటారు. వారి దృష్టిలో అమ్మ అర్హతానర్హతలు ఎంచదు. "అర్హత అనర్హతలే లేవు", అమ్మే అన్నది "ఆగ్రహానుగ్రహాలే లేవు, అంతా అనుగ్రహమే. కష్టసుఖలూ, శుభాశుభాలు అన్నీ అనుగ్రహం వల్లనే. ఇవ్వబడ్డ సర్వమూ అనుగ్రహమే. ఇక మ్రొక్కినవారూ మ్రొక్కనివారూ అని భేదమేమున్నది". అట్లా అమ్మను అర్థం చేసుకున్న తాతగారే అంటారు. "సర్వదేవతలకు ఆదివి నీవు! నీవు యావజ్జగతికి జననివి! నీవు అన్నింటికి ఆధారం, నీవు అందరికీ అమ్మవు! నీవు సర్వకార్యాలకూ కారణమై అకారణంగా సర్వకార్యాలూ నడుపుతున్న సగుణమూర్తివమ్మా!" అని.

"అకారణంగా సర్వకార్యాలూ నడుపుతున్న సగుణమూర్తివమ్మా"! ఇందులోనే ఉంది కావాలనుకున్న సమన్వయం. చిదంబరరావుగారీ, వాసుదాసుగారీ అమ్మతోటి సంభాషణలో తోచిన అగాధంపై వారధి. అమ్మే అంటుంది - "అంతకూ అనంతమేగా. అంతకూ ఏదో అనంతానికీ అదే. ఎంతెంతైనా అనంతమ్మలోనివారే. అంత అంటే పరిమితే, ఎంత అన్నా పరిమితే. అమ్మ అంటే మళ్లీ పరిమితే వచ్చింది. అంతా దయ అనుకొనండి. యీ పరిమితులు అన్నీ ఆ అపరిమితంలోనివి కనుక ఆ అపరిమితం పరిమితంగా వచ్చే - పరిమితులన్నీ కలుపుకోవాలి".

"ఎన్ని రకాలుగా చెప్పినా అన్నీ అందరూ ఒకటేనని అంతా అద్వైతమే ననీ, వస్తువులు మనుషులు మహాపురుషులు, అవతారవ్యక్తులు అన్నీ రకాలు కలిపి - గొడ్లను గోదనూ కూడా కలిపి ఒకటేమిటి? ప్రపంచంలో ప్రతిదానిని గురించి ఒకే దానికి సమన్వయంచేసి చెప్పావమ్మా" అంటూ ఉంటే తాతగారి చెక్కిళ్లు అశ్రువులతో తడిసిపోయాయి! మళ్లీ అన్నారు-

"సమన్వయం చేసేదేమిటి? ఆ సమన్వయమే నీవు కదా, లేకపోతే యిట్లా సాధ్యంకాదు. నీవు అసాధ్యం కనక నీకు అంతా సాధ్యమేనమ్మా. ఈ నా మాటలు కూడా నీవే"!

శుద్ధమైనదేదో అది అట్లాగే మమతతో చూపించింది - అక్కడ గుణాలున్నా నిర్గుణమే. రూపం ఆ నిత్యసత్యాన్ని గుర్తింపుకు తేవడానికే. అక్కడ ద్వంద్వాలకు స్థానంలేదు - తనకంటూ ప్రత్యేకించి ఏమీ అక్కరలే. తనే అంతా కనక అంతా కావాలి!

అమ్మ దృష్టిలో ద్వంద్వాలు లేవు. అందుకే అడిగింది తాతగారిని "భగవంతుడుగా పూజింపబడే వారిలో ఇంతకూ ఎవరైనా ఆ ద్వంద్వాలు లేనివారున్నారా? అని-

"ఇప్పటికి రాలేదు ఇకవస్తారేమో తెలియదు" అన్నారు తాతగారు తనకు తెలిసినా చెప్పకుండా!

ఆ వెంటనే వారి చర్చ పురాణాలనించి రామకృష్ణుల పైకి దిగింది. వారు మరి దుష్టశిక్షణ శిష్టరక్షణ ధ్యేయంగా పెట్టుకున్నారు కనక. అసలు దుష్టత్వం ఎక్కడిది? దుష్టుడు కూడా ఆ దైవసృష్టే కదా. వాడు ఇదికాకపోతే కదా! వాడిసృష్టిలో వాడికే కూడనిది తోచింది. ఐతే ఎట్లా ద్వంద్వాలకు అతీతుడు? వెంటనే దుర్మార్గుడు అంటే ఎవరనే ప్రశ్నవైపు సాగింది వారిచర్చ. ఎవరి చర్యలవల్ల అనేకమంది బాధపడతారో వాడేనని - ఆ వెంటనే వారింట పిచ్చికుక్క ప్రవేశించింది. దానివల్ల కూడా పదిమందికీ ప్రమాదం కనక దానిని చంపడానికి మనుషులూ ప్రవేశించారు. కనక పిచ్చికుక్క దుర్మార్గుడా? కంసుని వంటిదా - దానిని చంపేవారూ కృష్ణపరమాత్మవంటివారా? అసలు పిచ్చిది ఆత్మరక్షణ కూడా తెలీదు, దుర్మార్గుడు అట్లా కాదు. పదిమందిని బాధించినా, ఒక్కళ్లనే పరిమితం కాకుండా అకారణంగా బాధించినా దుర్మార్గుడంటారు. ఐతే వాడూ ఏదైనా కష్టం, లోటూ తోచిచేస్తాడా, ఏదీ లేకపోయినా చేస్తాడా? వాడికి కష్టం తోచినపుడే అంటే చివరకు వ్యక్తి యిష్టానిష్టాలమీద ఆధారపడి ఉన్నదన్నమాట. ఐతే మనకిష్టంలేని పనిచేసిన వాడల్లా దుర్మార్గుడా? మరి పదిమందికి యిష్టమై ఒకడికి యిష్టంలేకపోతే - అని అమ్మ ప్రశ్నిస్తే ఇది సమాజం నించి వ్యక్తికి మళ్లీ వ్యక్తినించి సమాజానికి మళ్లింది. తాతగారు అన్నారు-"వ్యక్తి సంఘంలోని కట్టుబాట్లకు బద్ధుడై సభ్యతతో వర్తించాలని"-వెంటనే అమ్మ - "సభ్యత అంటే ఏమిటంది?" తాతగారు దాటేసారు - అమ్మ మర్యాదా అని అందించింది. మరి సభ్యత వ్యక్తి నడవడికచర్యలు, సంబంధాలు సమిష్టిమీద ఆచరణీయమై అనుసరణకు నిర్దేశింపబడ్డ విధానం. ఎవరు ఎప్పుడు నిర్ణయించారు? ఏనాటివో! కానీ అవీ అన్నిచోట్లా అన్ని కాలాల్లో ఒకే రకంగా లేవు. దేశకాలాలనుబట్టి మరుతోంది. యీ మార్పు ఎట్లావస్తుంది? కాలం తెస్తున్నది అంటుంది అమ్మ. కాలమంటే? విధి, తప్పనిసరి - ఇక మనకందదు - ఇదే అమ్మమాటల్లో - విధే విదానం, విధి అంటే బ్రహ్మ, పరమాత్మ, చైతన్య స్వరూపం, చైతన్యం అదే స్పందనం, ఆ స్పందనం చేత కలిగే పరిణామం సృష్టి, అది అనుక్షణం జరుగుతూనే ఉంది - ఆ జరిగేది విధానం - విధేవిధానం అంటే ఇదే! ఆదే ధర్మం! అనంగానే ధర్మరక్షణ వొచ్చి పడుతుంది! మళ్లీ అమ్మే అంటుంది. అవసరం మనిషిని నడుపుతుందని, ధర్మం కాదని యీ చిక్కు వచ్చి పడుతుందనే తాతగారు తప్పుకున్నారు. కనక మళ్లీ వ్యక్తికే వచ్చాం - అవసరం ముఖ్యమైంది - యీ అవసరం అమ్మ అవతారాలకూ అతికించింది. ధర్మానికి బదులు "ఆ సమయంలో ఆ అవతారం అవసరమైంది... ఆ రాముడు పరిమితి గల రాముడుగా.... వారి ధర్మాన్ని పంచి పెట్టారు" అంటుంది అమ్మ! మళ్లీ ఇక్కడ ధర్మం అనే మాట అందిపుచ్చుకుంది. ఏ ధర్మం? ఎవరు నిర్ణయించారు? అవసరం - ఎవరికి అసరం? ఒకేసారి నిర్ణయమైంది అనే అమ్మ యీ చిక్కు తెచ్చి పెట్టింది. ఐతే యీ ధర్మమే రామునికీ కృష్ణునికీ తేడా చూపుతోంది. అలాగే కృష్ణునికీ అమ్మకూ తేడా - అమ్మ ఐతే - "నాన్నా ఆ ఐదువూళ్లూ నేనిస్తా ఎందుకొచ్చిన యుద్ధం మీరు నాదగ్గరే ఉండండి" అంటుంది. కొందరు మూర్ఖులు దారుణరణ మారణహోమాలు చేసినా, అనుగుబిడ్డల కుత్తుకలుకోసినా, రమణీయ శరీరం రక్తసిక్తం చేసినా, గుండెలను గొడ్డలితో వ్రయ్యలు

చేసినా - అమ్మ మాటలు చూస్తే - మళ్లీ వ్యక్తి - అవసరం దగ్గరే - మరొక ప్రక్క ధర్మం తప్పింది - ఐనా మారుతోంది - అది కాలమై, విధై, నిర్ణయమై - మనస్సు కందనిదై కూర్చొంది. ఏతావాతా ప్రతిదీ ఆ శక్తే నడుపుతోందని తేలుస్తున్నదమ్మ. ఏది కృష్ణునిగా రూపొందిందో అదే కంసునిగానూ రూపొందింది. ఆ శక్తే అనేకంగా రూపొందింది. వెలుగును గుర్తించాలంటే చీకటి కావాలి. మంచీ చెడూ అంతే. చివరకు పోగా పోగా ఇవి హెచ్చుతగ్గూ అంటుంది అమ్మ. యీ మలినం వాడు పులుముకున్నదే - ఆ ధర్మం కూడా వాడినించి వచ్చిందే, ఐతే మళ్లీ ధర్మరక్షణ వచ్చిపడుతుందా? కాదు ధర్మం, అధర్మం; మంచీ చెడూ; హింసా, అహింసా; దుష్టత్వం, శిష్టత్వం అన్నీ కలగాపులగం-ఏది చేసేవాడు అది చేస్తూ, చేయించేది అసలు కనక- ఇక ఇది తప్పదు - ఇదే సృష్టి - వైవిధ్యంతో కూడింది - యీ ద్వంద్వాలే సృష్టి కాధారం; ధర్మంగా నడిచేవాడు, అధర్మంగా నడిచేవాడూ పరస్పర విరుద్ధాల కాలప్రవాహంలో కోలాహలంగా - అంచేతే యీ వైవిధ్యాలన్నీ వాడి దయే - దయా నిర్దయా, కష్టమూ సుఖమూ; భాగ్యమూ దరిద్రమూ  అంతా అదే. అందుకే అమ్మ ఉన్న దయ పోదూ, లేని దయ రాదు" అంటుంది. ఇది పక్షపాతమా! కొందరు హాయిగా, కొందరు బాధల్లో మ్రగ్గటం - అందుకే రాజు అమ్మను - "తల్లీ చంచలవల్లీ" అంటాడు.

ఐనా అమ్మ కొన్నిచోట్ల నీ ధర్మం తప్పావని ప్రశ్నిస్తుంది. మెడలో గొలుసు తెంచుకోబోయే పోలీసు మస్తానుని... కొన్నిచోట్ల ధర్మాన్నే బోధిస్తుంది. మాజమ్మ గారికి దాంపత్య ధర్మాన్ని, సత్యన్నారాయణగారికి శిక్షణను, పూజారిగారికి అర్చక ధర్మాన్ని, ఆదర్శాలనూ బోధిస్తుంది. కొన్నిచోట్ల స్తబ్దత వస్తుంది! ఒకచోట బ్రాహ్మణీకాన్ని మంటకలిపావనే నిందనూ పడుతుంది! తనది మాతృధర్మ మంటుంది! ఐనా ఆ మహిమాన్వితమైన తత్వానికి జాతిబేధమే కాదు చేతనా చేతనాలనే తేడాయే తోచని స్థితికి - మతము, కులము, ఆచారాలు, ఆదర్శాలనే హద్దులు ఎక్కడ నిలుస్థాయి! పైగా దైవము - భక్తుడు; గురువు - శిష్యుడు అనేదే లేదు. అందుకనే భక్తిని వివరిస్తూ తాతగారితో అమ్మ అంటుంది - గోపికలు కృష్ణుని విషయంలో - భక్తి - మనోవాక్కాయకర్మల కతీతమని అంటే-భావనను వ్యక్తీకరించడానికి చర్యలకు అందని స్థిరమైన స్థితి వారిది. అదేవారిని నడుపుతోంది. అంటే అదీ అవాంగీమానస గోచరమన్నామాట.

వారి భక్తి వారి మనస్సులకే అందనిది. ఏ కాస్తప్రాపంచిక దృష్టిలోకి జారినా వెంటనే ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా ఆ స్థితిని అందుకునే వారు. ఒకరు ముఖాన్ని, ఒకరు పాదాల్ను, ఒకరు హస్తాలను, ఒకరు భుజాలను, ఒకరు చెవులను, ఒకరు నేత్రాలను, ఒకరు లలాటటాన్ని, ఒకరు లలాటమందలి తిలకాన్ని, ఒకరు కంఠాన్ని, ఒకరు కంఠస్వరాన్ని, ఒకరు శక్తిని, ఒకరు జ్ఞానాన్ని ఒక్కొక్కరు ఒక్కొక్కవిధంగా తిరిగి ఆ స్థితిని చేరుకోవడం. కానీ రాధ అలాకాక కృష్ణునిలోని శక్తిఐ, తనసర్వస్వమూ కృష్ణుడేయై ఆరాధిస్తూ....

అలాగే ఎంతగానో అమ్మతో చర్చించినా, ఎంత విన్నా చివరకు తాతగారు "ఎంతసేపూ నిన్ను చూస్తూ ఉందామనిపిస్తున్నది, నీ కంఠస్వరమే విందామనిపిస్తున్నది" అంటారు, అలాగే వారింట పనిచేసే నల్లి కూడా - ఆ రూపానికే మోహిత ఐయింది. (కానీ ఎందరు చూస్తున్నారు, కొందరికే యీస్థితి - చూస్తే కనిపించను కనిపిస్తే చూస్తారు అని అమ్మ అన్నా కొందరికే ఎందుకో, మళ్లీ పక్షపాతమా! యీ కొందరిలో ఏముంది? అసలు మోహనత

అంటే? కావాలి అనిపించడం, ఏం కావాలి? ఇంతకన్నా ఇంకేమీవద్దనేంతగా కావాలి, ఇంతకూ ఏమిటి అసలు? నల్లికి దైవంగా తోచడమంటే? అమ్మే చెబుతుంది ఇట్లా "చిన్నపిల్లలా ఉన్నా నాలో ఏదో దైవత్వం, సామాన్యం కంటే ఏదో విశేషం నీకు కనిపించడమే దూరదృష్టి." ఇంత కన్నా వివరించడానికి బాష లేదు కనక - యిష్టం, భక్తి, ప్రేమ, కావాలనిపించడం వెనక కారణం అంతు చిక్కనిది! నల్లికి అమ్మంటే - అమ్మను వీపున పడుకోబెట్టుకొని చిమ్ముతూ ఆనందిస్తూ అమ్మ జారిపోగానే తన సర్వస్వమూ పోయినట్టు, తను అంతు తోచని అగాధాల్లోకి జారిపోయినట్టు, తన ప్రాణాలే పోయినట్టనిపిస్తుంది - అందుకే అమ్మంటే చెప్పుకో లేనంత ప్రేమ, అక్కడ ఏదో ఉన్నతి తోచడం వల్ల ఆదే భక్తి అయింది. అందుకే వినమ్రతతో నమస్కరించుకుంటూ - కొద్దికాలానికే ఏదో కలిగింది - అంతే అమ్మను ఎక్కడ నించైనా చూడవచ్చని, అమ్మంటే అంతటా నిండి ఉందని అనుభవంలోకి వచ్చింది - వెళ్లింది దూరంగా ఐనా తృప్తిగా!

మరి లక్ష్మణాచార్యులవారికీ అంతే. వారు నృసింహోపాసకులు. ఐనా బాలాత్రిపురసుందరిలా దర్శనమౌతుంది. మళ్లీ నృసింహస్వామిగా కనిపిస్తుంది - వారి యిష్టదైవంమరి - అపుడే మరిడమ్మతాతమ్మకు తమకు గురువుగారైన మల్లెల రత్తమ్మగారిలా - వారికి ఆమెపై ఎనలేని భక్తిమరి. మళ్లీ అంతటానిండి ఉన్నట్టు లక్ష్మణాచార్యులవారికి - తన యిష్టదైవమైన నృసింహస్వామేనంటారు. అది వారి తృప్తి - ఐనా అడుగుతారు. నీ వెవరమ్మా అని - నీ పలుకే నేను నాయనా అంటుంది. అంటే నీలోని శక్తి నేనే నని - దానికి వారు నేనే అమ్మ, అమ్మే నేను అంటూ పైగా నా అనుభవాలు అందరికీ చెప్పనా అంటూ ప్రశ్నిస్తారు. నీవు చెప్పినా వారికి అర్థం కావు అంటుంది అమ్మ. ఇంతకూ ఎవరెవరు ఏఏ రీతిగా భావిస్తే ఆయా రూపాల్లో వారికి దర్శనమిస్తూ - రాముడుగా కొందరికి, కృష్ణుడిగా కొందరికి - బాలగా కొందరికి - వారువారు కోరేది అంతే కనుక - తృప్తి శాంతి వారికి - ఆత్మవిచారణాసక్తులైన చిదంబరరావుగారికి వారి యీప్సితం నిండుగా తీర్చింది - వారిని అడ్డం పెట్టుకొని జగతికి ఆ విజ్ఞానాన్ని వొలికింది. యిలా విచిత్రాలు జరుగుతున్నపుడే అమ్మను తాచుపాము చుట్టుకుంటుంది - దానికి అమ్మ అది నాగేంద్రుడని - నాగేశ్వరుడైవస్తాడని - వాడే తన కాధారమని చెప్తుంది. నాన్నగారు ఆరు దశాబ్దాల పైగా అనేక అనుభవాలున్నా దైవమని తోచక చివరలో దైవమని, తల్లి అంటే తొలి అని తోచి, పసితనం ప్రాప్తించి సమిష్టి భోజనానికి తన కంచం తనే తెచ్చుకొని పంక్తిలో అన్నం తిని ఎంగిలి కంచం తీసుకొనిపోతున్న నాన్నగారిని చూచి మురిసిపోయే అమ్మను - నీవు లేకండా నేనుండ లేను నన్ను ముందుగా పంపమని వేడుకున్నారు - వరం పొందారు - వారికి కావలసింది అదే - వారి కోర్కె అమ్మ తీర్చింది - వ్యక్తుల కోర్కెలలోనే వైవిధ్యం. ఇంకేమి కలిగింది అనే ప్రశ్నకు తావెక్కడ! మరి సత్యనారాయణ గారికి ముందు యమధర్మరాజులా తర్వాత బాలాత్రిపురసుందరిలా - దాంతో వారి శిక్షణా ఐంది - యిష్టదైవసాక్షాత్కారం ఐంది. తాతగారికి అసలు శక్తి

**సర్వమూ పరమే**

నా దృష్టిలో ఆగ్రహానుగ్రహాల్లేవు. అంతా అనుగ్రహమే. కష్టసుఖాలు శుభాశుభాలు అన్నీ అనుగ్రహంవల్లనే, ఇవ్వబడిన సర్వమూ పరమే. ఇక మ్రొక్కినవారు, మ్రొక్కనివారు - అని బేధమేమున్నది.

**- అమ్మ**

సాకారంగా మాతృమూర్తిఅయి అవతరించినట్లు, ద్వంద్వాలకతీతమైన పూర్ణావతారమనే ధృడవిశ్వాసం నిండుకున్నది. యిలా అనేకంగా అనుభవాలు అందిస్తూ ఆనందంలో ముంచినా చివరకు తాతగారు తేల్చారు - "ఎంతసేపూ నిన్నేచూడబుద్ధి అవుతున్నది, మాట్లాడాలనిపించడంలేదు" అని ఆగిపోయిన తాతగార్ని గురించి అమ్మ పూర్తి చేసింది యిట్లా - "వారు ఏకోశానా చలనం, ఆలోచన లేకుండా అయిపోయారు" అని!

దైవం వేరుగా ఉన్నాడనుకునే అనుభవాల్లో ఎన్నో రకరకాల వైవిధ్యంతో ఎవరి అనుభవాలు వారికి సత్యమై ఉంటూ - ఈ సృష్టి నించి దైవం వైపు జరిగే మానసిక అన్వేషణకు అంతు దొరకుదు - సృష్టే వైవిద్యం కనక సాకారం సగుణం ఎంతకూ ఓ కొలిక్కి చేరనీదు - అనుభవాల పరంపరలో ఉంటూ అసలు తేలదు - ఆనందానికీ అంతూ ఉండదు. అందుకే యీ సృష్టిని గూర్చి ఆ దైవాన్ని గూర్చి మహానుభావులు, చివరకు ఆ దైవమే సాకారంగా చూపించుతున్నా యీవనరులే పూర్తిగా వుపయోగించి చేసే అంతులేని ఆధ్యాత్మిక ప్రసంగాలు ఎంతో ఆనందం, శాంతిని కూర్చుతాయి. అలాగే వారి రూపం, కంఠస్వరం, స్పర్శ, చివరకు సన్నిధి నూతనోత్సాహాన్ని, ఉత్తేజాన్ని కల్గిస్తాయి - సంవత్సరాల తరబడి సాగుతుంది, అలాకాదు యుగాలైనా! అందుకే తాతగారు - "ఆ వాగ్ఝరీ, అందులోని అర్థగాంభీర్యమూ, ఆ ఆలోచనాపటిమ, ఆ ఆశేముషీవైభవమూ అచ్చెరువు కల్గిస్తూనే ఉన్నాయి, ఆ ఆనందోద్వేగంతో మేనుపులకరిస్తూనే ఉంది" అని అంటారు. కానీ, అసలు అనుభవానికి యీ రగడ అనవసరం - అది అనుభవంతో తేలాలి - అదీ అవాఙ్మానస గోచరం కనుక దానినీ అమ్మ "తరుణం వచ్చినపుడు అశక్తే శక్తిగా వ్యక్తమౌతుంది." అంటుంది. ఎవరు అందుకు పాత్రులో ఎవరికీ తెలీదు. సృష్టి వైవిధ్యపు రీతైన పక్షపాత వైఖరి ఎవరి మీద వుందో! - శక్తి శక్తిగా వారినించి.

ఐనా ఆధ్యాత్మిక సంస్కృతి వేదాలు, ఉపనిషద్వాణి ఏమహత్తరసత్యాన్ని ప్రవచించాయో అవే తిరిగి తాతగారి యింట చర్చలతోనే కాక అనుభవాలుఅయి ఆ యింటికి పవిత్రతను చేకూర్చాయి - జగజ్జనని అయిన అమ్మ తనకు తానై చెప్పుకోవడంవల్ల - చిన్నిపిల్లగా అమ్మ అక్కడ తిరిగింది, తన దైవత్వం ప్రకటించింది, అక్కడే అమ్మ వివాహం - ఆనాడు పెండ్లికుమార్తెగా అందరినీ, దారినిపోయే వారు సైతం సమ్మోహితులై నిలచిపోగా "భోజనం చేసి వెళ్లండి నాన్నా" అనే అమ్మ పలుకు, ప్రసాదం అందుకున్నతావది!

**అదే యిది**

దైవం సృష్టి చేయటం కాదు, దైవమే సృష్టిగా మారాడు. అదే యిన్ని రూపాలుగా వచ్చింది. ఇదంతా 'అదే'. ఇహ పరాలు రెండు కావు. లౌకికమనీ, పారమార్థికమనీ రెండు లేవు.

**- అమ్మ**

# గగనానికి కాయం వస్తే

- ప్రాచార్య శలాక రఘునాథశర్మ

పరమేశ్వరుడు ఒకమారు పైకి చూచాడు. అతని మదిలో ఒక ఆలోచన మెదిలింది. పంచభూతాలలో వాయువునకు స్పర్శరూపమైన మూర్తి ఉన్నది. అగ్ని విస్పష్టంగా కనులకు కానవస్తున్నది. ఇంక నీటికీ, నేలకూ స్వరూపం ఉన్నదని చెప్పనక్కరలేదు. ఈ ఒక్క నింగికి మాత్రం రూపం ఎందుకు ఉండకూడదు? అనే భావన ఆయనలో కదలాడింది. ఆ భావనతో ప్రక్కకు చూచిన వెంటనే పత్ని పార్వతి కానవచ్చింది. వెంటనే ఒక మహాదివ్యసుందర విగ్రహం ప్రాణవంతమై ఎదురుగా నిలిచింది. ఆ సౌందర్యం ఎంత మహిమోపేతం అంటే అమ్మవారు అత్యంతవాత్సల్యంతో పరవశించిపోయి చూస్తుంటే దానికి తుండాన్ని, తోరపుబొజ్జనూ, ఇంకా ఇటువంటి చిత్ర స్వరూపాలను ఏర్పరచినంతటిది. అలా పరమసుందరుడై అవతరించి పరమేశ్వరుని నిర్ణయం మేరకు లంబోదరుడుగా, గజాస్యుడుగా, వక్రతుండుడుగా మారిన దైవస్వరూపుడే వినాయకుడు. ఆయన విఘ్నాలకు అధిపతి. అంటే కలిగిస్తాడని కాదు. పూజించిన వారికి తొలగిస్తాడు. అంతే కాదు. ఏ శుభాశుభ కర్మలకైనా అగ్రపూజ అందుకొనే మహాదేవుడు ఆ గణనాయకుడు.

వరాహపురాణంలోని యీకథను బట్టి మనకు తెలియవస్తున్నవిషయం వినాయకుడు ఆకాశం మూర్తి పొందగా ఏర్పడిన దేవర అనేది. ఇది ఆధారంగా మనం మన భావనా తరంగాలను పరిశీలించుకుంటే కొన్ని వేదాంత రహస్యాలు తెలుస్తాయి.

ఆకాశం అనేది పరమాత్మనుండి తొట్టతొలుతగా ఏర్పడిన సృష్టిలక్షణం. "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః" ఇత్యాది తైత్తిరీయ మంత్ర వాక్యాలను పరిశీలిస్తే పరమాత్మయే పరమేశ్వరుడు. పార్వతియే ప్రకృతి. వారిద్దరు ప్రపంచసృష్టికి సంకల్పించిన వెంటనే ఏర్పడిన ప్రథమ స్వరూపం ఆకాశం. హేతువాదుల మని చెప్పుకొనే కొందరు ఆకాశం లేనేలేదు. ఎందుకంటే దాని అస్తిత్వాన్ని నిరూపించే లక్షణం ఏమీలేదు - అంటారు. ఉంది. ఉన్నదని వారు గుర్తించ లేకపోతున్నారు. అదేమి టంటే శబ్దం. శబ్దం వాయుధర్మం కాదు, అగ్నిధర్మం కాదు, జలధర్మం కాదు, స్థలధర్మం కాదు. అది ఆకాశ గుణం. దీనిని నిరూపించటానికి ఇది సముచిత స్థలం కాదు కానీ "శబ్దగుణక మాకాశం" అని తర్కశాస్త్రం చెప్పేమాట ప్రత్యక్షర సత్యం.

కాగా వినాయకు డంటే శబ్దబ్రహ్మం అని తాత్పర్యం. తత్త్వవేత్తలు "శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరం బ్రహ్మాధిగచ్ఛతి" అంటారు. శబ్దబ్రహ్మమునందు ఆరితేరినవాడు పరబ్రహ్మమును పొందుతాడు. శబ్దబ్రహ్మం అంటే నాదాత్మకంగా విశ్వమంతా నిండి ఉన్న పరమాత్మ స్వరూపమే. అందుకనే త్యాగరాజులవారు పరమశివుని నాదతనువుగా అభివర్ణించారు. నాదతనువైన శివునినుండి ఆవిర్భవించిన ఆకాశమూల ప్రకృతి అయిన వినాయకుడు శబ్దబ్రహ్మ స్వరూపు డనుకోవటం వింత కాదు కదా! "ఆత్మా వై పుత్ర నామాసి" అనే న్యాయా న్ననుసరించి పరమేశ్వరు డన్నా పార్వతీతనయు డన్నా రెండు వ్యవహారాలు గల ఏకదైవమే. అంతే కాదు. ముఖ్యంగా

తత్త్వమర్థస్వరూపిణి - 66

శబ్దబ్రహ్మస్వరూపానికే ఒక రూపకల్పన చేసి ఒక ఆరాధ్యస్వరూపంగా తీర్చిదిద్ది వేదమాత మానవసమాజానికి అందించింది. కాబట్టి వినాయకోపాసన శబ్దబ్రహ్మోపాసనమే. అది పరబ్రహ్మను పొందటానికి తొలిమెట్టు.

దీనిని నిరూపించే అంశాలు మనకు చాలా కనిపిస్తాయి.

**తొండము నేకదంతమును తోరపుబొజ్జయు వామహస్తమున్**
**మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్**
**కొండుక గుజ్జురూపమున కోరిన విద్యల కెల్ల నొజ్జయై**
**యుండెడు పార్వతీతనయ ఓయి గణాధిప! నీకు మ్రొక్కెదన్**

అనే సుప్రసిద్ధమైన ప్రార్థనాపద్యంలోని మ్రోయుగజ్జెలు, కోరిన విద్యల కెల్ల నొజ్జయై యుండెడు అనే పదబంధాలు వినాయకుని నాదాత్మక స్థితికీ, బ్రహ్మతత్త్వానికీ నిదర్శకాలు. ఏకదంతం అద్వైతతత్త్వ ప్రతిపాదకం. ఎందు కంటే రెండుదంతాలు రెండు అగ్రాలు కలిగి ద్వైత దర్శనం చేయిస్తాయి. ఒకదంతాన్ని సాధనతో తొలగించుకొని "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" అనే ఉపనిషద్వాక్యానికి వ్యాఖ్యానరూపంగా నిలుస్తున్నాడు వినాయకుడు. మెల్లని చూపులు మౌనవ్యాఖ్యానానికీ, మందహాసం ఆనందైక అనుభవాభివ్యక్తికీ ప్రతీకలు. గుజ్జురూపం "అణో రణీయాన్" అనే వాక్యానికి అర్థం గా నిలుస్తున్నది. వామహస్తం ఆదాన ప్రక్రియకు ఇష్టం లేనితనాన్ని ప్రకటిస్తూ 'ఆప్తకామత' అనే పరమాత్మ లక్షణాన్ని తెలియజేస్తుంది. ఈ విధంగా ఈ పరమప్రసన్నమైన పద్యం పరమగంభీరమైన పరమాత్మలక్షణాలకు స్ఫోరకమై శబ్దబ్రహ్మతత్త్వజ్ఞాపన చేస్తున్నది.

సుప్రసిద్ధమైన ముత్తుస్వామి దీక్షిత కృతి "వాతాపి గణపతిం భజే" అనేదానిలో కూడా మనకు ఈ స్ఫూర్తియే నిలుస్తున్నది. ముఖ్యంగా ఆ కీర్తనలో ఆ 'ఋషి' రెండు గొప్పవిషయాలను ప్రకటించాడు. ఒకటి "ప్రణవ స్వరూప వక్రతుండమ్". వంపుతిరిగిన ఆయన తొండం ప్రణవ సంకేతంగా ఉందట. ప్రణవాన్ని - ఓంకారాన్ని - పరమాత్మవాచకంగా వేదాలు అభివర్ణిస్తున్నాయి. అంటే ప్రణవం శబ్దబ్రహ్మము, పరమాత్మ పరబ్రహ్మము. రెండవది - "పరాది చత్వారి వాగాత్మకమ్" అన్నా డామహాకవి. పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ నామములతో నాలుగు విధాలుగా భాసించే వాక్స్వరూపం గణపతి. ఇది కూడా ఆయన శబ్దబ్రహ్మాత్మకత్వాన్ని నిరూపిస్తున్నది.

తాత్పర్యం ఏమంటే వినాయకుడు మానవజాతికి అందుబాటులో ఉన్న శబ్దబ్రహ్మాత్మక పరమాత్మ స్వరూపం. తొలిపుట్టువు కాబట్టి తొలిపూజలు అందుకొనే దైవంగా మనకు తెలియవస్తున్నాడు. ఆతనిమూర్తి అనంతమైన ఆకాశం కనుక 'ఇందు గల డందు లే డని సందేహము వలదు' అన్న భావనకు వ్యాఖ్యానరూపమైనవాడు. అతనిని ఆరాధించటమంటే పరమాత్మారాధనయే. పరమాత్మను శబ్దబ్రహ్మరూపంలో ఆరాధించట మని దాని ర్థం. ఇది మనకు పరమాత్మ కల్పించిన సువర్ణఅవకాశం.

జిల్లెళ్లమూడిలో క్రొత్తగా ఇల్లు కట్టుకొని అమ్మ భక్తులను అలరించటానికి గృహప్రవేశం చేస్తున్న విఘ్నేశ్వరునకు ప్రణమాంజలి.

# వినాయకుని ఆరాధన

**- శ్రీ జయేంద్ర సరస్వతీస్వామి**

మనమేదైన కార్యక్రమాన్ని ప్రారంభించేముందు వినాయకుని ఆరాధించి ఆయన అనుగ్రహాన్ని పొందుతాం. శివరాత్రి గాని, నవరాత్రి గాని, మరి ఏ పర్వదినం గాని, మనం ప్రథమంగా వినాయకుని ఆరాధిస్తాం. వినాయకునే విఘ్నేశ్వరుడని కూడ అంటారు. విఘ్నేశ్వరుడనే పదానికి 'విఘ్నాలకు అధిపతి' అని అర్థం. అంటే విఘ్నాలన్నీ ఆయన నియంత్రణలో వుంటాయని, మనమార్గంలో తటస్థించే విఘ్నాలను సమగ్రంగా ఆయన తొలగించగలడని భావం. విష్ణు సహస్రనామాల్లో 'భయకృత, భయనాశనః' అనే ప్రయోగాలున్నాయి. భయానికి కారకుడాయనే, భయాన్ని నివృత్తి చేయగలవాడూ ఆయనే అని దాని అర్థం. అలాగే విఘ్నేశ్వరుడు కూడ :

శ్లో॥ "విఘ్నానాం ఈశ్వరః ఏవ విఘ్నానాం నివర్తకః ।
అతః సః విఘ్నకృత్ విఘ్ననాశనః ॥"

అన్ని విఘ్నాలు ఆయన ఆధీనంలో వుంటాయి. కనుక ఆయన్ని ఆరాధించి మనకు ఎదురయ్యే విఘ్నాలకు నివృత్తి చేసికోగలం. ఫలితంగా విఘ్నాల్ని మననుండి దూరంచేసి మన కార్యాలు ఏ రకమైన ఆటంకాలకు గురికాకుండా ఫలప్రదమయ్యేటట్లు ఆయన చూస్తాడు.

ఒక పురాణంలో గణేశుడు సర్వశ్రేష్ఠుడైన భగవానునిగ కీర్తింపబడ్డాడు. అష్టాదశ పురాణాల్లోని ఒక్కొక్క పురాణంలో ఒక దేవతను అధిష్ఠాన దేవతగా ప్రతిష్ఠించి మిగతా దేవతలను ఆయనకు లోకువైన వారినిగా చిత్రీకరిస్తారు. ఒక్కొక్కచోట ఒక తత్వానికి ప్రాధాన్యత నివ్వటమే అచ్చట ఉద్దేశింపబడిన లక్ష్యం. అంతేకాని దేవతల్లో వారు గొప్ప, వీరు తక్కువ అని వారిలో తారతమ్యాలు నిర్దేశించుటకు కాదు. ఒక తత్వాన్ని గురించి ప్రముఖంగా ప్రస్తావించిన సందర్భంలో ఒక ప్రత్యేకమైన మూర్తికి ప్రాధాన్యత ఈయబడుతుంది. ఉదాహరణకు శివపురాణంలో శివునకు, స్కాందపురాణంలో సుబ్రహ్మణ్యేశ్వరుడు లేక కార్తికేయునకు ఉన్నతస్థానం ఈయబడుతుంది.

పురాణాల్లో శివుడు తనకుమారుడైన గణేశుని ఆరాధించి నట్లు గమనిస్తాం. అది అలా ఎందుకు జరగాలని మనం ప్రశ్నించరాదు. అది నిజమైన అంతిమ తత్వం కానేరదు. అంతిమతత్వమైన పరమాత్మయే ప్రజలకొరకు, వారిపై కరుణతో, గణేశుడుగాను, శివుడుగాను, విష్ణువుగాను, సుబ్రహ్మణ్యేశ్వరుని గాను, ఇంకా రామావతారం, క్రిష్ణావతారాలుగాను రూపాలు స్వీకరించాడు. కాబట్టి గణేశుడుకూడ పరమాత్మ స్వరూపుడే. అట్లే మిగతా దేవతలుకూడ. కనుక మనం ఏ దేవతను ఆరాధించినా యథార్థంగా అంతిమ తత్వమైన పరమాత్మునే అనిశం ఆరాధించినట్లు. ఒక్కొక్క సందర్భంలో పరమాత్మయొక్క ఒక ప్రత్యేక అంశం కీర్తింపబడుతుంది.

గణేశుడు స్వీకరించిన రూపం చాలా ఆసక్తి దాయకంగా వుంటుంది. ఆయన గజాననుడు. తొండం కల్గివుంటాడు. ఏకదంతుడు. అంతేగాదు కుండ బొజ్జ కలవాడు. మూషిక వాహనుడు.

బాహ్యలక్షణాల్ని బట్టి గణేశుని రూపం మనోహరంగా లేదని నిరసించకూడదు. అందులోని అంతర్యాన్ని గ్రహించి, దాని ప్రాముఖ్యాన్ని అంచనావేసి ఆ రూపంలో కూడ పరమాత్మ స్వరూపాన్ని చూడాలి.

అసలు గణేశుడు ఏనుగుయొక్క ముఖాన్ని ఎందుకు ధరించాల్సి వచ్చిందో తెలుసుకుంటే మనకు విషయం తేటతెల్లమౌతుంది. గజముఖాన్ని కల్గిన గజముఖాసురుడనే రాక్షసుని చంపటం కొరకు వినాయకుడు జన్మించాడు. తన రూపంవంటి రూపమే కల్గిన వానిచేతిలో తప్ప మిగతా వారెవ్వరి చేతను చంపబడనట్లుగా రాక్షసుడు ఈశ్వరుని యొక్క వరాన్ని పొందియున్నాడు. కనుక వినాయకుడు గజాననరూపుడై వరప్రసాదియైన గజముఖాసురుణ్ణి సంహరించాడు. ఆ ఇతివృత్తాన్ని మనం సంస్మరణలో వుంచుటకై ఆయన ఇప్పటికి ఏనుగు ముఖంతో వుండి మన ప్రార్థనలను, ఆరాధనలను స్వీకరిస్తున్నాడు.

ఏనుగు ముఖానికి మరియొక విశేషం కూడ వుంది. మానవుని సంతృప్తి పరచలేనివి ప్రపంచంలో మూడు విషయాలున్నాయి. ఒకటి చంద్రుడు, రెండు సముద్రం, మూడు ఏనుగు. మనిషి చంద్రుని అనిశం చూస్తూనే వుండాలని వాంఛిస్తాడు. అలాగే పైకిలేస్తూ క్రిందకు పడుతూ నయనా నందకరంగా వుండే సముద్రంలోని అలల కదలికను చూస్తూనే వుండాలని కూడ తలుస్తాడు. సముద్రతీరం నుంచి కదలటానికి ఇష్టపడడు. అదే విధంగా పెద్ద చిన్న అందరూ ఏనుగును, ఎంతసేపైనా చూస్తూనే వుండాలనే ఉత్సుకతను చూపిస్తారు. ఆ ఆనందాన్ని తనివితీర అనుభవిస్తారు. వినాయకుడు మనకీ ఆనందానుభూతిని ప్రసాదించుటకే గజాననుడుగా వుంటున్నాడు.

గణేశునిపై వున్న ప్రార్థనాశ్లోకంలో ఇలావుంది.

**శ్లో॥ "అగజానన పద్మార్కం గజాననం అహర్నిశం ।**
**అనేకదంతం భక్తానాం ఏకదంతముపాస్మహే ॥"**

'అగ' అనగా పర్వతం; 'అగజా' అంటే పార్వతి (హిమవంతుని కూతురు) గణేశుడు పార్వతి యొక్క ముఖపద్మానికి సూర్యుని వంటివాడు. అంటే ఆమె ముఖాంబుజాన్ని అతడు వికసింపజేసి ప్రకాశింప చేస్తాడు. ఆ విధంగా గణేశుడు పార్వతిని సహితం ఉల్లాసపరచగలవాడు కాగా, మామూలు మానవుల విషయం చెప్పవలెనా? గణేశుని రాత్రింబవళ్ళు స్మరిస్తే, మనకు సుఖసంతోషాలు విరివిగా లభిస్తాయి. ప్రతి వీధిసందులోను ఒక వినాయకుని ఆలయమున్న మనదేశంలో ఆయన్ని రాత్రింబవళ్లు స్మరించటం అసాధ్యంకాదు.

గణేశుని భౌతిక ఆకృతిని పరిశీలిస్తే మనకొక విషయం స్ఫురిస్తుంది. ఆయన శిరస్సు, ముడిచిన తొండముతో, తొండముచివర 'ఓం' ను అనగా ప్రణవ చిహ్నాన్ని స్ఫురింపచేస్తుంది.

గణేశుడు ప్రణవస్వరూపుడని, మరొక విధంగా చెప్పారంటే ఆయన పరమాత్మయని, మనకీ విషయం స్మరణకు తెస్తుంది.

ప్రణవ చిహ్నాన్ని కల్గిన ఈ రూపంలోని వినాయకుని ధ్యానించవలసిన వివరణ తమిళ కవయిత్రి అవ్వయ్యారు తన 'వినాయక అకవల్' అనే ప్రసిద్ధ తమిళ కావ్యంలో యిచ్చింది.

ఏనుగునకు మాములుగ రెండు దంతాలుంటాయి. కాని వినాయకుని ముఖం ఒకే దంతాన్ని కల్గి వుంటుంది. ఏనుగు ఒక దంతంతో సుందరంగా కన్పించదు. కాని ఒక దంతం విషయంలో కూడ ఒక ఇతిహాసం వుంది. పంచమ వేదంగా భాసిస్తున్న మహాభారతంలో వేదవ్యాసుడు దీన్ని గురించి ప్రస్తావించాడు. వేదవ్యాసుడు మహాభారతకథను చెప్తుంటే వినాయకుడు లేఖకుడుగా వ్రాశాడు. ఆ వ్రాయటానికి ఉపయోగించింది తన దంతాన్నే. తనకున్న రెండు దంతాల్లో ఒక దంతాన్ని విరుగగొట్టి దానితో భారతాన్ని వ్రాశాడు. ఇక్కడ మనకు స్ఫురించే ధర్మమొకటి వుంది. విజ్ఞానం కొరకు మానవుడు తనశరీరానికి అందాన్నిచ్చే అవయవాన్ని కూడ త్యాగం చేయటానికి సిద్ధపడాలి. దంతం గజానికి అందాన్ని ఇచ్చే అవయవమేగదా. నిజానికి ఏనుగు తన దంతాల్ని చాల జాగ్రత్తగ సంరక్షించుకుంటుంది. అలాంటి అందచందాలకు చిహ్నామైన రెండు దంతాల్లో ఒకదాన్ని త్యాగంచేసి మహాభారతం లిఖించటమనే ఒక ఘనకార్యాన్ని నిర్వహించాడు. మహాభారతం ఒక విజ్ఞాననిధి. భౌతిక సౌందర్యం కంటే విజ్ఞానం అధిక ప్రాముఖ్యం కలది. భౌతిక సౌందర్యం కొంతకాలానికి నశిస్తుంది. కాని విజ్ఞానం శాశ్వతమైనది. కనుక ప్రతివాడు సర్వశ్రేష్ఠమైన విజ్ఞానం కొరకు భౌతిక సౌందర్యాన్నైనా త్యాగం చేయగల్గాలి. ఈ సంఘటన మరొక సత్యాన్ని కూడ ప్రకటిస్తుంది. భగవంతుడు తాను నిర్వర్తించదలచిన కార్యాన్ని సాధించటానికి ఏ వస్తువునైనా ఎన్నుకో గలడు.

వినాయకుని కుండబొజ్జ చూసినప్పుడు మనకొకసత్యం గుర్తుకొస్తుంది. వినాయకుణ్ణి అందరు తరచుగా 'లంబోదర' అని ప్రస్తావిస్తారు. లంబోదర అనగా పెద్ద కడుపు గలవాడు అని అర్థం. ఆయన శిరస్సు ఏనుగునకు చెందినది. ఆయనకు కుండబొజ్జ కూడ వున్నది. అలా ఆయన పెద్దశరీరం కలవాడు. ఐనా ఆయన్ని ఒక పిల్లవానిగా మనం భావిస్తాం. ఆయన పార్వతీపరమేశ్వరులకు ముద్దుబిడ్డ గనుక, పార్వతీపరమేశ్వరులు విశ్వానికంతటికి తల్లిదండ్రులు కనుక, వినాయకుడు విశ్వానికే బిడ్డగా పరిగణింపబడతాడు. తమిళంలో ఆయన్ని 'పిళ్లైయార్' అని అంటాం. 'పిళ్లైయార్' అంటే కుమారుడు అని తమిళంలో అర్థం. పిల్లవానిగా వినాయకుని యొక్క భౌతికరూపం తల్లులందరూ తమ పిల్లల్ని పోషించే విషయంలో అనుసరించాల్సి ఒక ధర్మసూత్రాన్ని గుర్తుచేస్తుంది. పిల్లవానికి బలవర్థకమైన ఆహారాన్ని ఇచ్చి పెంచాలి. అలా పెంచితే అతడు వినాయకునివలె దృఢకాయుడై శౌర్యవంతుడౌతాడు.

కుండ బొజ్జగల్గి దృఢమైన బరువైన శరీరంతో వినాయకుడు యీ ఎలుక వాహనంపై ఎలా స్వారీచేయగల్గుతున్నాడా యని మనకు ఆశ్చర్యం కల్గకపోదు. దానికీ సమాధానం లేకపోలేదు. ఒక రాక్షసుడు ఎలుకరూపం దాల్చి వినాయకునితో యుద్ధానికి దిగి వానికి తెలిసిన మాయలన్నీ ప్రయోగించాడు. రాక్షసుని యుక్తుల్ని వినాయకుడు తెలిసికొని, వానిని అణచి పట్టుకొని తన క్రిందవుంచుకొని వాహనంగా వినియోగించుకుంటూ వానిని తన ఆధీనంలో వుంచాడు. ఎవరైనా భగవంతుని మాయతో వంచించాలని సాహసిస్తే వానికి ఎలుక రూపంలో వచ్చిన అసురునకు పట్టినగతే పడుతుందని ఈ సంఘటన వ్యక్తీకరిస్తుంది.

మనం గణేశుని ఎలా ఆరాధించాలి. ఏ పూజా విధానాన్ని అనుసరించాలి, ఏవి ఆయనకు నివేదించాలి అనే విషయాలు మన సంప్రదాయాలు మనకు విశదీకరిస్తాయి. మన వాంఛితార్థాల్ని మనం యీడేర్చుకోవాలంటే ముఖ్యంగా ఒక కొబ్బరికాయను ఆయన ముందుకొట్టి నాకోర్కెను సఫలీకృతం చేయమని గణేశుని ప్రార్థనలు సల్పుతాం.

కొబ్బరికాయనే కొట్టడంలోని ముఖ్యోద్దేశమేమి? దీనికొక పురాణగాథ వుంది. త్రినేత్రుడైన పరమేశ్వరుడు ముగ్గురు రాక్షసులను సంహరించవలసి వచ్చింది. వారు తామ్ర, లోహ, సువర్ణ నగరాల్లో నివసిస్తూ ప్రజలను పీడిస్తున్నారు. పరమేశ్వరుడు వారిని సంహరించటానికి వెళ్లినపుడు ఆయనకు బహువిఘ్నాలు ఎదురైనాయి. ఆయన విఘ్నాధిపతి యైన తన కుమారుని ఆటంక నివృత్తి కొరకు ఉపాయం అడిగాడు. శివుని శిరస్సు నివేదనగా తనకు సమర్పిస్తే ఆటంకాలు తొలగిపోతాయని వినాయకుడు సూచించాడు. అప్పుడు త్రినేత్రుడైన ఈశ్వరునికి బదులు మూడుకళ్ళు కల్గిన నారికేళాన్ని శివుని చిహ్నంగా వినాయకునకు సమర్పించాడు. పరమేశ్వరుడు తర్వాత అసురులపై యుద్ధచేసి వారిని సంహరించాడు. ఆ సమయం నుండి నారికేళ ఫలానికి పూజ్యత లభించింది. మనం ఏ శుభకార్యాన్నైనా ప్రారంభించే ముందు వినాయకునకు కొబ్బరికాయ కొట్టటం పరిపాటైంది. ప్రస్తుత కాలంలో కూడ పెండ్లికుమారుడు వివాహార్థం పెండ్లి కుమార్తె గృహానికి తరలివెళ్లే సమయంలో దారిలో ప్రథమంగా తటస్థపడే గణేశ దేవాలయంలో గణేశుని దర్శించి ఒక నారికేళాన్ని ఆయన ముందు కొట్టే ఆచారం వుంది.

తమిళ దేశంలో వినాయకునికి కొబ్బరికాయను కొట్టే సదాచారం చాలా ఎక్కువగా వుంది. ఈ ఆచారాన్ని ప్రజలు అరవంలో 'చిదార్ తెంగై' (పగల కొట్టిన కొబ్బరికాయ ముక్కల విస్తరణ) అంటారు. కొబ్బరికాయ కొట్టినపుడు అది మూడు, అంతకంటె అధికమైన ముక్కలుగ పగలాలి. పగిలిన ముక్కలు అన్నివైపుల విస్తరిస్తాయి. ఈ విస్తరణ మనం నిర్వహించే కార్యాలకు ఎదురయ్యే విఘ్నాలు పటాపంచలై కొబ్బరిముక్కల వలె నలుదిశల చెల్లాచెదురై పోవుటను సూచిస్తుంది. మనం ఏదైనా గొప్ప కార్యాన్ని సాధించటానికి పెద్ద త్యాగాలకు కూడ సిద్ధపడాలి. తుదకు మన తలను సైతం త్యాగం చేయటానికి వెనుదీయరాదు. నారికేళాన్ని పగులగొట్టి భగవంతునకు లోపలి స్వచ్ఛమైన తెల్లని గుజ్జును సమర్పించటంద్వారా మనకు నిర్మలమైన మనస్సును ప్రసాదించమని భగవానుని ప్రార్థిస్తున్నట్లు భావించాలి.

ప్రసేనుడు వద్దనుండి దొంగిలింపబడిన శమంతకమణిని సింహం వద్దనుండి తిరిగి సంపాదించే ప్రయత్నంలో శ్రీకృష్ణుడు వినాయకుని ఆరాధించినట్లు 'వ్రత చూడామణి'లో ప్రస్తావించబడింది. వినాయకచతుర్థి రోజున పై కథను స్మరణకు తెచ్చే ఈ క్రింది శ్లోకాన్ని పఠిస్తాం :

శ్లో॥ సింహః ప్రసేనం ప్రవధీః సింహో జాంబవతా హతారో ।
సుకుమారక మా రోధీః తవ హి ఏవ స్యమంతకః ॥

ప్రసేనుని మృగరాజు సంహరించి శమంతకమణిని గ్రహిస్తుంది. కాని జాంబవంతు డాసింహాన్ని సంహరించి మణిని తీసుకుంటాడు. శ్రీకృష్ణుడు జాంబవంతుని వద్దనుండి మణిని తెచ్చుకుంటాడు. ఆ సందర్భంలో శ్రీకృష్ణుడు తన ప్రయత్నానికి విఘ్నాలను అధిగమించుటకై వినాయకుని ఆరాధించాడు.

లలితా సహస్రనామాల్లో దేవిని గురించి ఈ క్రింది పేర్లు వున్నాయి.

శ్లో॥ "కామేశ్వరముఖాలోకకల్పితశ్రీగణేశ్వరా ।
మహాగణేశనిర్భిన్నవిఘ్నయంత్రప్రహర్షితా" ॥

రాక్షసులచే కల్పింపబడిన విచిత్ర యంత్రం వలన సృష్టింపబడిన జయవిఘ్నాన్ని అధిగమించటానికి లలితాదేవి తన భర్తవంక చూచుట ద్వారానే గణేశుని సృష్టించింది. గణేశుని సహాయంతో అసురుల యంత్రలయొక్క ఆటంక ప్రభావాన్ని దేవి తునాతునకలు గావించి జయాన్ని సాధించింది. కనుక మనం విఘ్నాల్ని పారద్రోలి మన ప్రయత్నాల్ని జయప్రదం చేసుకోవటానికి వినాయకుని ఆరాధించటం ఎంత ముఖ్యమో అందరం గ్రహించాలి.

ప్రణవస్వరూపునిగా వినాయకుని ఆరాధిస్తే అత్యధికంగా సత్ఫలితాల్ని సాధించుకోవచ్చు. నేను చెప్పబోయే కథ పై విషయాన్ని ప్రస్ఫుటం చేస్తుంది. ఒకానొకప్పుడు తమిళ కవయిత్రి అవ్వయ్యార్ వినాయకపూజ చేస్తున్నది. ఆ సమయంలో సుందరమూర్తినయనార్, చేరమన్‌పెరుమాల్ అనే ఇద్దరు మహాత్ములు, మొదటి ఆయన గజంపైన, రెండవ ఆయన తురగం మీద స్వామీ చేస్తూ కైలాసయాత్రకు పోతూ అవ్వయ్యార్‌ను కూడ తమతో రమ్మన్నారు. కాని ఆమె తాను వినాయకుని పూజను వదలుట కిష్టపడక వారి ఆహ్వానాన్ని నిరాకరించింది. పూజను యథావిధిగా నిర్వర్తించి ముగించిన తర్వాత కైలాసం ఎలా చేరగలనా యని మథన పడసాగింది. వినాయకుడు తన భక్తురాలిని తన తొండంపై ఎత్తికొని ఇతర యాత్రికులు ఎవరూ చేరకమునుపే ఆమెను కైలాసం చేర్చాడు. కనుక వినాయకుని ఆరాధించి ఆయన కృపకు పాత్రులమైతే మనం సాధించలేనిది ఏదీ వుండదు.

మనం ఏదైనా కష్టాన్ని ఎదుర్కొన్నప్పుడు దుఃఖంతో బాధపడితే ప్రయోజనం వుండదు. మన బుద్ధిబలాన్ని వినియోగించి ఆటంకాల్ని తొలగించినప్పుడే మన శక్తిసామర్థ్యాలు ఋజువౌతాయి. నిజంగా విఘ్నాలే జీవితాన్ని రసవత్తరం చేస్తాయి. మనలో నిబిడీకృతమైయున్న సామర్థ్యాన్ని వెలికి దీయుటకు అవి ఒక సవాలును మనముందుంచుతాయి. మనకు దేవుడు వివేకాన్ని లేక బుద్ధిని ప్రసాదించాడు. వాటిని ఉపయోగించి విఘ్నాల్ని అధిగమించాలి. ఏ పనిని ప్రారంభించినా వినాయకుని ఆరాధిస్తాం. ఆయన మనకు ప్రాప్తించే విఘ్నాల్ని తొలగించుకోటానికి కావలసిన బలాన్ని సమకూరుస్తాడు. ఆయన కృపతో మనం ఆటంకాల్ని త్రోసిరాజని మనకార్యాలనూ సఫలీకృతం చేసుకుంటాం. వినాయకుని ఆలయంలో ప్రజలు 'దోర్భికర్ణం' అనే ప్రక్రియను చేయటం చూస్తాం. దోర్భి అనగా నాల్గు చేతులు, కర్ణం అంటే చెవులు. దోర్భికర్ణం అంటే చేతులతో చెవులను పట్టుకొనుట అని అర్థం. కుడిచేత్తో ఎడమ చెవిని, ఎడమచేత్తో కుడి చెవిని పట్టుకొని కూర్చొని, లేచి గుంజీలు మాదిరిగా వినాయకుని ఆలయంలో ప్రజలు చేస్తారు. ఇలా చేయటాన్ని గురించిన ఒక ఆసక్తికరమైన వృత్తాంతముంది.

విష్ణుమూర్తి యొక్క సుదర్శన చక్రాన్ని వినాయకుడొకసారి తీసికొని వెళ్లి మింగేసినట్లు చెప్తారు. ఆ చక్రాన్ని తిరిగి పొందటానికి విష్ణుమూర్తికి సులభసాధ్యం కాలేదు. వినాయకుడు ఒక చిన్న బిడ్డమాత్రమే కనుక చక్రాన్ని తిరిగి ఇమ్మని అతన్ని నిర్బంధించటం కష్టం. అప్పుడు విష్ణుమూర్తి ఒక ఉపాయాన్ని పన్నాడు. ఆయన తననాల్గు హస్తాలతో తన చెవులను పట్టుకొని పలుమార్లు కూర్చోటం, నుంచోటం, నృత్యం చేయటం ఆరంభించాడు. వినాయకున కాదృశ్యం వింతగా తోచి నవ్వుఆపుకోలేక విపరీతంగా నవ్వటం ప్రారంభించాడు. అప్పుడా చక్రం ఆయన నోటినుండి బయటపడగా విష్ణువు సంతోషంతో తీసుకున్నాడు.

కనుక వినాయకుణ్ణి సంతుష్టుణ్ణి చేస్తే మనం సాధించలేనిది ఏదీ వుండదు. పోయిన వస్తువుల్ని కూడ ఆయన కృపతో తిరిగిపొందుతాం.

ఆ విధంగా అనాదినుండి భగవానుడు వినాయకుని రూపంలో తన కృపాకటాక్షాల్ని మనకు ప్రసాదిస్తున్నాడు. మనం ఏ పని ఆరంభించినా ముందు వినాయకుని పూజించిన తర్వాతే మిగతా దేవతల్ని ఆరాధిస్తాం. వైష్ణవాలయంలో కూడ గజముఖము, తొండము కల్గిన విష్వక్సేనుని విగ్రహం వుంటుంది. దానికే ముందు మన పూజల్ని సమర్పిస్తాం. వినాయకుడే పరమాత్మస్వరూపుడు గనుక ఆయన్ను ఆరాధించి ఆయన్ని ప్రసన్నుని చేసికుంటే మిగతా దేవతల నారాధించే ఆవశ్యకత లేదు. ఆ విధంగా గాణపత్యారాధన విధానం గణేశుని మాత్రమే ఆరాధించి మోక్షప్రాప్తి పొందవచ్చని ప్రతిపాదిస్తుంది. మహారాష్ట్రలో గణేశ ఆరాధన చాల ప్రాముఖ్యమైంది. మహారాష్ట్రలో మోర్‌గాన్ అనే ప్రదేశంలో గణేశుడు నెమలి వాహనుడై మనక దర్శనమిస్తాడు. భగవంతునకు అసలు ఏ వాహనంతోనూ పనిలేదు. ఐనా ఒక ప్రాణికి గౌరవాన్ని ప్రసాదించటం కోసం దాన్ని తన వాహనంగా స్వీకరిస్తాడు.

కనుక మనమందరం విఘ్నేశ్వరుని ప్రార్థించి ఆయన కరుణా వీక్షణాలతో మనకు తటస్థించే విఘ్నాల్ని బాపుకొని మన మొనరించే సత్కర్మల్లో విజయాన్ని సాధిద్దాం.

- "శ్రీ జయేంద్రవాణి" - సాధన గ్రంథమండలి, తెనాలి వారి సౌజన్యంతో



యస్య ద్విరద వక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతం ।
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥

# భాద్రపద శుద్ధ చవితి

## (గణేశ చతుర్థి)

- కీ॥శే॥ ఆంద్ర శేషగిరిరావు

ఒకప్పుడు గజాసురుడు లోకపీడాకరుడయ్యెను. అతడు తన్ను ఏనుగు ముఖం స్వామి తప్ప ఎవరూ చంపలేరని మారులేక మసులుతూ వుండెను.

అందు మీద దేవతలు భయకంపితులై శంకరుని వద్దకు పోయి గజాసురుణ్ణి సంహరించ వలసిందిగా కోరారు.

అప్పుడు శివుడు కొద్ది రోజుల్లో విష్ణువు వారి కోరిక తీర్చడానికి పార్వతీదేవి గర్భమున గజాననుడుగా పుట్టగలడని వాగ్దానం చేశాడు.

యథాకాలమున పార్వతి గజాననుణ్ణి ప్రసవించింది. ఏనుగు ముఖం, ఏకదంతం, విశాలమైన నుదురు, నాలుగు చేతులు, పెద్దపొట్ట.

నాలుగు చేతుల్లోనూ పై కుడిచేతిలో ఏనుగును నడిపే అంకుశం, పై ఎడమచేతిలో చిన్న గొడ్డలి, దిగువ ఎడమ చేతిలో తామరపువ్వు అతడు ధరించాడు. దిగువ కుడిచేయి మాత్రం ఆశీర్వదిస్తున్న స్థితిలో చాచబడివుంటుంది.

ఉపనయనం అయిన తరువాత గజాననుడు బ్రహ్మదేవుని కూతుళ్లయిన అష్టసిద్ధుల్ని పెళ్లాడుతాడు.

పిమ్మట గజాననుడు గజాసుర సంహారానికి తయారవుతాడు. షడాననుడు సేనాని. ఎలుక వాహనం. గజాననుడు గజాసురుణ్ణి సంహరిస్తాడు. అందుకు మెచ్చి దేవతలు గజాననుని పూజిస్తారు. ఈ యుద్ధం భాద్రపద శుద్ధ చవితినాడు జరిగింది. కాబట్టి ఆనాటి నుంచి ఈనాడు గజాననపూజ ఆచారమైంది.

మహాభారత యుద్ధ ప్రారంభంలో ధర్మరాజు గజాననపూజ చేశాడు.

ఆనాడు మహారాష్ట్రులు తలంటిపోసుకుంటారు. స్త్రీలు, పిల్లలు, కొత్తబట్టలు, నగలు పెట్టుకుంటారు. కుటుంబ యజమాని గజాననునికి షోడశోపచార పూజ చేస్తాడు. ఈ పూజ కనీసపక్షం రెండు గంటలైనా పట్టుతుంది. పూజ ఐన తరువాత పురోహితుడికి దక్షిణ, దేవునికి పెట్టిన నైవేద్యంలో నుంచి పదిమోదకాలు ఇస్తారు.

దేవుడికి అసలు ఇరవై ఒక్క మోదకాలు నైవేద్యం పెడతారు. అందులో ఒకటి దేవుడి దగ్గరవుంచి, మిగతా ఇరవైలో పది పురోహితుడికి ఇచ్చి, మిగిలిన పదీ ఇంటివారు తింటారు.

ఆనాడు ఆ దేవునికి పూజ చేసే ఆకుల్లో, పువ్వుల్లో అతి పవిత్రమైంది.దూర్వా పత్రాలు. అంటే గరికపోచలు.

ఈ పూజను ప్రస్తుతం మహారాష్ట్రులు పదకొండు రోజులు ఆచరిస్తున్నారు. ఆఖరు రోజున ఉత్తర పూజ చేస్తారు. కుటుంబ వ్యక్తులందరూ తమ క్షేమాన్ని కోరి ఆనాడు గజాననుని ఆశీర్వాదాన్ని అర్థిస్తారు.

తాహతునుబట్టి, సంకల్పాన్నిబట్టి, అవకాశాన్ని పట్టి గజాననుణ్ణి కొందరు రెండు రోజులు, కొందరు ఐదు, కొందరు ఏడు, మరికొందరు పది, మరికొందరు పదకొండు రోజులు పూజిస్తారు.

అన్ని రోజులు ఆరతి, మంత్రపుష్పాంజలి ఇస్తారు. బంధుమిత్రుల్ని ఆహ్వానిస్తారు. ధనవంతులు హరిదాసులచేత గజాననస్తుతి కీర్తనలు పాడిస్తారు. కథలు చెప్పిస్తారు. పురాణాల్లో గజానన విగ్రహాన్ని బంగారంతోకాని, మట్టితోకాని చేయాలని చెప్పబడివుంది. బొంబాయిలో రేపు చతుర్థి అనగానే మట్టి విగ్రహాలు అమ్మకానికి వస్తాయి. ఆనాడు అవి అమ్మే చోటు సమ్మర్ద దారుణమ్మై ఉంటుంది.

గజాననుడు మంగళప్రవతము. కాబట్టి ప్రతి కార్యానికి ముందు గజాననపూజ చేయడం ఆచారమైంది. అతడు తన్ను కొలిచిన వారి శత్రువుల్ని సంహరిస్తాడు. విఘ్నాలు తొలగిస్తాడు; యుద్ధాలు, కరువులు మొదలైన బాధలు లేకుండా చేస్తాడు. సంతానాన్ని ప్రసాదిస్తాడు. సకల సంపదలూ సమకూరుస్తాడు. భార్యాభర్తల నడుమ ఆనుకూల్యాన్ని సాధిస్తాడు. వర్తకులకు, వ్యవసాయదారులకు సాయం చేస్తాడు.

మహారాష్ట్ర దేశంలో గణపతి మేళాలు మహోత్సహంతో చేస్తారు. (కొఠారి హిందూ హాలిడేస్)

## తెలుగునాట

చ. తొలుదినమే వినాయక చతుర్థికి ముందర రాల్ పలేరుగా
యలు గడియించి పండుగ మహాగణనాథుని మంచి మంచి పూ
వుల బలు పత్రులం గఱికిఁబూజలుజేసుక ప్రొద్దుగ్రుంకఁగా
నల పొరుగిండ్లఁజల్లుకొను చాడిక జెందుదు రర్భకావళుల్ (తెలుగునాడు, దాసు శ్రీరాములు)

మొత్తం మీద నాలుగు చతుర్థులు గణేశపరంగా కనిపిస్తున్నాయి-సంకష్ట చతుర్థి-దూర్వస గణేశం-కపర్ది వినాయకం-సిద్ధి వినాయకం. అని

సంకష్ట చతుర్థి - పార్వతికి వియోగం - గణేశుని ఉపదేశం. ఆనాడు చంద్రోదయం అయాక చంద్రుణ్ణి పూజించాలి. ధర్మజుడు ఈ వ్రతంచేసి శత్రుంజయుడు ఐనాడు.

దూర్వా గణపతి-శ్రావణంలో కాని కార్తికంలో కాని శుద్ధ చతుర్థి కార్తికంలో ఈ వ్రతం చేయడం ఉత్తమం. శ్రావణశుక్ల చతుర్థి భాద్రపద కృష్ణ దశమిలోగా ఉండే రోజుల్లో ఇరవై ఒక్క దినాలు ఈ వ్రతం చేయాలి.

శివుడు పార్వతి పాచికలాడుతూ గరికతో ఒక బొమ్మనుచేసి సాక్షిగా పెట్టుకున్నారు. ఆ బొమ్మ ఏకపక్షం వహించి ఎంతసేపూ శివుని పక్షమే పలికేది. అందుమీద పార్వతికి కోపం వచ్చింది. అతన్ని కుంటివాడిగా శపించింది. నా కుర్రతనానికి ఇట్లా కోపిస్తే ఎట్లా అని ఆమెను ప్రార్థించాడు. ఆమె శాపావధి చెప్పింది. నాగ కన్యలు వచ్చి గణేశపూజ చేస్తూన్నప్పుడు నీవు వారిచే ఆ గణేశపూజను ఉపదేశం పొంది ఆ పూజచేసి కుంటితనాన్ని పోగొట్టుకొని నా వద్దకు వస్తావన్నది. అతడట్లే చేశాడు. ఆ సందర్భమైనదే దూర్వా గణపతి.

సిద్ధి వినాయక వ్రతం భాద్రపద శుక్ల చతుర్థి. ఇది హేమాద్రిలో వర్ణింపబడింది.

చంద్రదర్శన నిషేధం. వినాయక వ్రత కథ విని అక్షతలు వేసుకుని చంద్రదర్శనం చేస్తే నిందలు రావు.

కపర్ది వినాయక వ్రతం.

శ్రావణ శుక్ల చతుర్థి మొదలు భాద్రపదశుక్ల చతుర్థి వరకు నెల్లాళ్లు ఒంటిపూట భోజనంచేస్తూ కపర్ది గణేశుణ్ణి పూజించాలి.

ఒకనాడు పార్వతీ పరమేశ్వరులు చతురంగం ఆడుతున్నారు. పార్వతి శివుడి సేనని ఓడించి పణంగా అతని ఆయుధాల్ని చర్మాన్ని లాక్కుంది. ఆయుధాల సంగతికేమి గాని కట్టుకునే చర్మాన్నైనా ఇమ్మని శివుడు అడిగాడు. ఇవ్వనన్నది. అందుమీద శివుడికి కోపం వచ్చి వెళ్ళి పోయాడు. అందు మీద పార్వతి వియోగ విహ్వలయై శివుడిని వెతుక్కుంటూ వెళ్ళింది. ఒక చోట కొందరు స్త్రీలు ఏదో వ్రతం చేయడం చూసింది.

ఆ వ్రతం కపర్ది గణేశ వ్రతం. ఆపుడు పార్వతి ఆ వ్రతంచేసి శివుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకుంది.

వంగదేశంలో గణేశ చతుర్థి లేదు. దక్షిణదేశంలో ఈ పండుగ అతి విస్తారం. దీనిని కొన్ని కొన్ని చోట్ల రాళ్ళపండుగ అంటారు. రాజపుటానాలో వివాహ నిశ్చయాలకు ఇది మంచి రోజుగా భావిస్తారు.

ఆమాదేర్ జ్యోతిషీ దీనిని సౌభాగ్య చతుర్థీ అంటారు. విద్యను కోరే వారు రాత్రి వ్యాపిని అయిన చవితి తిథిలో సరస్వతీ పూజ చేయాలని గదాధర పద్ధతి.

ఇది శివ చతుర్థిగా పేర్కొనబడి ఈనాడు ఒక వ్రతం చేయాలని అందు గూడ లవణ దానం ముఖ్యమనీ కొన్ని వ్రత గ్రంథాలు, గోష్పద త్రిరాత్రి వ్రతం చేస్తారని చతుర్వర్గ చింతామణి.

## వామహస్తము

తొండము నేకదంతమును తోరపుబొజ్జయు వామహస్తమున్
మెండుగ మ్రోయు గజ్జెలును మెల్లని చూపులు మందహాసమున్

ఇత్యాది ప్రసిద్ధమగు వినాయక ప్రార్థనా పద్యమునందలి ప్రథమపాదాంతమున నుండు "వామహస్తమున్" అను మాటల కేమి యర్థమో దెలుప విజ్ఞుల ప్రార్థించెద.

ఈ వామహస్తమున కేమయిన పూర్వ గాథ కలదా ?

వినాయకుని దేహవర్ణము తెలుపా? నలుపా ? ఒక చిత్రకారుడు వినాయక ప్రతిమను వ్రాయుచు శిరోభాగము మాత్రము నల్లరంగున కనపరిచి మిగిలిన దేహభాగమంతయు తెల్లగ జూపినాడు. తల మాత్రము నల్లగ యుండుటకు కారణమడుగగా కంఠోర్ధ్వభాగమునకు బదులుగనే గదా ఏనుగు తల అతికించబడినది. అని ప్రత్యుత్తరమిచ్చినాడు. ఈ యంశమును దెలియగోరెద. (జిజ్ఞాసువు)

తూర్పు గోదావరి జిల్లా అమలాపురం తాలూకా అయినవల్లి గ్రామంలో క్షణముక్తేశ్వర క్షేత్ర సమీపంలో గోదావరి తీరాన విఘ్నేశ్వర విగ్రహం సహజ సౌందర్య సంశోభితమైఉంది.

## గణపతి-పత్రపూజ

వినాయక చవితినాడు ముఖ్యంగా ఇరవై ఒక్క రకాల పత్రులతో వినాయకుడిని పూజిస్తారు. వినాయక చవితి పూజలో పూలకంటే పత్రాలకే ప్రాముఖ్యం ఎక్కువ. ఈ పత్రాలన్నీ మంచి ఓషధీ గుణాలు కలవి.

అందుకనే మన పూర్వీకులు ఆలోచించి, అందరి ఆరోగ్యాన్ని కాపాడటానికిగాను వీటిని పూజా ద్రవ్యాలుగా నిర్ణయించారు. జీవితంలో వేగం పెరగడంతో పండుగలు కూడా తూతూ మంత్రంగా సాగిపోతున్నాయి. పచ్చగా కనబడే ప్రతీ గడ్డిని పత్రిగా విక్రయిస్తున్నారు ఈనాడు. వినాయకచవితినాడు ఈ 21 రకాల పత్రాలను అంటే ఆకులను పూజా ద్రవ్యాల్లో ఉపయోగిస్తాం. వాటి పేర్లు, ఉపయోగాలు, వాటిల్లో ఉండే ఔషధ విలువలను పరిశీలిద్దాం.

(1) **మాచీపత్రం** : దీనిని మాచిపత్రి అంటారు. దీని కషాయం దద్దుర్లు తగ్గించడానికి, వ్రణాలకు వాడతారు. ఇది కుష్టువ్యాధికి మంచి మందుగా పనిచేస్తుంది. నరాలకు టానిక్కు. తలనొప్పులను, వాతం నొప్పులను తగ్గిస్తుంది. కళ్ళకు చలువ చేస్తుంది. పొట్టకు బలం చేకూరుస్తుంది. మానసిక వికాసానికి తోడ్పడుతుంది.

(2) **బృహతీపత్రం** : దీనిని వాకుడాకు అంటారు. ఇది ఒక రకమైన ముళ్ళచెట్టు, ఉబ్బు, శ్వాసకాసలు, శ్లేష్మము, క్షయ, ఉబ్బసపు దగ్గు, తాపములను తగ్గిస్తుంది. ఇది హృద్రోగాలకు మందు, వీర్యవృద్ధిని కలిగిస్తుంది.

(3) **బిల్వపత్రం** : దీనిని మారేడు లేక బిలిబిత్తిరి అనే పేర్లతో పిలుస్తారు. బిల్వపత్రం త్రిదళం. ఇది శివునకు మిక్కిలి ప్రీతి పాత్రమైంది. బిల్వాష్టకం దీని విలువలకు తార్కాణం. దీని పండ్ల గుజ్జు బంకలా పనిచేస్తుంది. దీన్ని చాటలకు పూస్తారు. పుచ్చు రానీయదు. బంక విరోచనాలను తగ్గిస్తుంది. ప్రతి శివాలయంలో ఈ చెట్లను పెంచుతారు.

(4) **గఱిక** : ఇది ఎత్తుగా పెరిగే గడ్డి. దీనికి ఎన్నో ఓషధీ విలువలున్నాయి. పశువులకు శ్రేష్ఠమైన ఆహారం. కొద్ది గఱికెకు ఒక ఉప్పురాయి, చిటెకెడు పసుపువేసి నూరి కట్టు కడితే ఎదురు దెబ్బల గాయాలు మానుతాయి.

(5) **దుత్తూర పత్రం** : దీనిని ఉమ్మెత్త ఆకు అంటారు. ఇందులో నల్ల ఉమ్మెత్త చాలా శ్రేష్ఠమైనది. వీటి ఆకులను ఆముదం రాసి దీపపు సెగ చూపి వెచ్చదనంతో గడ్డలపైన, వ్రణాలపైన వాడటం ద్వారా గడ్డలు, వ్రణాలు పగిలి, చీము, కారిపోవడానికి ఉపకరిస్తాయి. ఇది లైంగికపరమైన వ్యాధులకు రామబాణంవలె పని చేస్తుంది.

(6) **బదరీ పత్రం** : దీనిని రేగి ఆకు అంటారు. ఇది జీర్ణకోశ వ్యాధులలో ఉపయోగపడుతుంది. రుచిని పుట్టిస్తుంది. రక్త దోషాలను హరిస్తుంది. బలాన్నిస్తుంది. లేతాకుల్ని మిరియపు

గింజలతో తింటే వీర్య నష్టాన్ని అరికడుతుంది. ఆకుల నురుగురాస్తే అరికాళ్ళమంటలు, అరిచేతులు మంటలు తగ్గుతాయి.

**(7) అపామార్గ పత్రం:** ఉత్తరేణి ఆకు, ఇది పంటి జబ్బులకు మందు. ఉత్తరేణి వేరు దంతధావనకు పెట్టింది పేరు కదా !

**(8) తులసీ పత్రం :** వీటిలో విష్ణు తులసి, కృష్ణ తులసి మొదలగు రకాలున్నాయి. తులసి ఆకులు అజీర్ణవ్యాధులకు, కడుపునొప్పికి, పసిపిల్లల గర్భశూలలకు వాడుతారు. ఇది చర్మ రోగాలను అరికడుతుంది. తేలు విషాన్ని విరిచేస్తుంది. యాంటీసెప్టిక్‌గా ఉపయోగపడుతుంది. స్త్రీ సౌభాగ్య చిహ్నం తులసి. పసిబిడ్డల పాలిటి సంజీవని దీని రసం.

**(9) చూతపత్రం :** గృహాలంకరణ మొదలు, సర్వమంగళ కార్యాలలో తోరణంగా ఉపయోగపడే మామిడాకు ఇది. దీని ఆకులతో విస్తరి కుట్టి దానిలో భోజనంచేస్తే రుచి పుట్టిస్తుంది. మేహకారక మంటలను, రక్త అతిసారములను తొలగిస్తుంది.

**(10) కరవీరపత్రం :** దీనిని గన్నేరు ఆకు అంటారు. ఇది కంతులను కరిగిస్తుంది. గడ్డలను రానీయదు. జంతు విషాలను విరగ్గొడుతుంది. దురదలను తగ్గిస్తుంది. దద్దుర్లను, కుష్టును పోగొడుతుంది. పేలుగల వాళ్ళు కరవీపత్ర రసంతో తల రుద్దుకుంటే పేలు పోతాయి.

**(11) విష్ణుక్రాంత :** గడ్డి నేలలపైకి పాకుతూ విస్తారంగా పెరిగేది. ఒకటి, చిన్న మొక్కగా పెరిగేది ఒకటి. దీని కషాయం పైత్యజ్వరాలకు, కఫ జ్వరాలకు ఉబ్బులకు వాడతారు. వీటి ఆకులు ఎండబెట్టి, ఆకుల పొగ పీలిస్తే రొమ్ము పడిశెం, దగ్గు, ఉబ్బసపు దగ్గు తగ్గుతాయి.

**(12) దాడిమీపత్రం :** దీనిని దానిమ్మ పత్రం అంటారు. ఇది వగరుగా ఉండే మంచి ఔషధం. జీర్ణకోశ, మలాశయ వ్యాధుల్లో ఉపయోగిస్తారు. నీళ్ళ విరోచనాలను తగ్గిస్తుంది. దీని కషాయం ఏలిక పాములను, నాడా పాములను చంపుతుంది. రక్తగ్రహణి (డీసెంట్రీని) తగ్గిస్తుంది. నోరుపూత కలవారు దానిమ్మ చిగుళ్లు నమిలితే తగ్గుతుంది.

**(13) దేవదారు పత్రం :** దీని లేత చిగుళ్లు మేహశాంతిని కలిగిస్తాయి. దీని ఆకులతో కాచిన తైలం కళ్ళకు చలువజేస్తుంది. దీని ఆకులు, పువ్వులుకూడా మంచి ఓషధులే.

**(14) మరువకపత్రం :** దీనిని మరువం అనికూడా అంటారు. స్త్రీలు తలలో ముడుచుకుంటారు. పూలతో కలిపి మాల కట్టుకుంటారు. ఇది జీర్ణశక్తిని పెంపొందించి, ఆకలిని పుట్టిస్తుంది.

ఇంద్రియపుష్టిని కలిగిస్తుంది. దీని తైలం మెదడుకు చలువ జేస్తుంది. కేశాలను రాలనీయదు.

**(15) సింధూర పత్రం :** దీనిని వావిలాకు అంటారు. దీని కషాయం జ్వరాలను, జ్వర దోషాలను తొలగిస్తుంది. ఉబ్బులను, మేహవాతపు నొప్పులను, ఇరుకు నొప్పులను, కీళ్ళవాపులను, కీళ్ళ నొప్పులను హరిస్తుంది.

**(16) జాజి ఆకులు :** ఇవి వాతానికి, పైత్యానికి మందుగా ఉపయోగపడుతాయి. జీర్ణాశయ, మలాశయ రోగాలకు ఇది చక్కటి మందు. నోటిపూతను, నోటి దుర్వాసనను పోగొడుతుంది. బుద్ధికి బలాన్ని ఇస్తుంది. కామెర్లను పోగొడుతుంది. చర్మరోగాలకు, మచ్చలకు ఇది చక్కటి మందు. లివరుకు బలాన్ని ఇస్తుంది. పక్షవాతాన్ని, తలనొప్పిని నివారిస్తుంది. గవద బిళ్ళలకు మందుగా ఉపయోగపడుతుంది. ఇది జాజికాయ, జాపత్రికి చెందింది. జాజిమల్లె కాదు.

**(17) వినాయక పత్రం:** అని కూడా అంటారు. ఇది అందరికీ తేలికగా లభించేది కాదు. కొన్ని ప్రత్యేక ప్రదేశాలలో మాత్రమే పండుతుందని ఆయుర్వేద శాస్త్రం చెబుతోంది.

**(18) శమీపత్రం :** దీనినే జమ్మి ఆకు అంటారు. ఇది కఫాన్ని హరిస్తుంది. మూలవ్యాధి, కుష్టువ్యాధి నివారణకు ఉపయోగపడుతుంది. పాండవులు అజ్ఞాతవాస సమయంలో వారి ఆయుధాలను ఈ చెట్టుపైనే ఒక సంవత్సర కాలం దాచిపెట్టారు. ఆ ఆయుధాలు తుప్పు పట్టకుండా ఉండడానికి కారణం శమీపత్రంలోని ఔషధీగుణం.

**(19) అశ్వత్థ పత్రం :** దీనిని రావి ఆకు అంటారు. ఇది జ్వరాలకు, నోటి పూతకు మందుగా ఉపయోగపడుతుంది. రావి పండ్లను ఎండబెట్టి, చూర్ణం చేసి రోజుకు రెండు సార్లు, రెండు చెంచాలు తినిపిస్తే 'ఆస్తమా' నివారణ అవుతుంది.

**(20) అర్జున పత్రం :** దీనిని మద్దియాకు అని అంటారు. దీనిలో తెల్ల మద్ది, నల్లమద్ది అని రెండు రకాలున్నాయి. తెల్లమద్దిని మేహశాంతికి, వ్రణాలకు వాడతారు. ఇది విదాహము, చెవినొప్పులను తగ్గిస్తుంది. దీని ఆకుల రసం 'రుమాటిజానికి' మంచి మందు. గాయాలను, వ్రణాలను త్వరగా మాన్పుతుంది. నల్ల మద్ది మలాశయ దోషాలకు మందుగా ఉపకరిస్తుంది. క్రిములను హరిస్తుంది.

**(21) అర్కపత్రం :** దీనిని జిల్లేడు అని అంటారు. దీని ఆకులతో కుట్టిన విస్తరిలో భోజనం చేస్తే విషాన్ని హరిస్తుందని ఆయుర్వేద గ్రంథం చెబుతోంది. తగిన వైద్యుని సలహా

లేకుండా జిల్లేడు ఆకులను అజాగ్రత్తగా వాడరాదు. అలా వాడితే మేలు కన్నా కీడు జరిగే ప్రమాదం ఎక్కువని మరువరాదు. ఇది పాము కరచిన, తేలు కరచిన విషాలను హరిస్తుంది. మూర్ఛలను, పక్షవాతాన్ని పోగొడుతుంది. జిల్లేడు మంచి ఓషధి అని ఆయుర్వేద గ్రంథాలు చెబుతున్నాయి.

పూజలో ఉపయోగించే ఈ 21 పత్రాలు మంచి ఓషధులే అనడంలో ఎలాంటి సందేహం లేదు. అయితే ఇక్కడ మనం ఒక విషయాన్ని గుర్తుంచుకోవాలి. ఆనాటి మన సామాజిక స్థితిగతులను జ్ఞప్తికి తెచ్చుకుంటే ఈ పత్రాల ప్రాధాన్యం అవగతమవుతుంది. పూర్వపు రోజుల్లో చెరువులు, బావులు, నదులు, వర్షాధార నీటి వనరులు తప్ప నేటి అధునాతన జల సౌకర్యాలు లేవు. నీళ్ళు తాగాలన్నా, స్నానాలు చేయాలన్నా, కాలకృత్యాలు తీర్చుకోవాలన్నా అందరికీ అందుబాటులో ఉండేవి ముఖ్యంగా బావులు, చెరువులే. అక్కడక్కడ నదులే కదా ! ఈ జలాశయాల్లోని నీళ్ళు శుభ్రపడటానికి ఉపయోగపడే విధంగా వినాయక పూజకు ఈ 21 ఓషధీ పత్రాలను నిర్ణయించి, వాటిని జలాశయాల్లో నిమజ్జనం జరిగే విధంగా పూజా విధానాలను రూపొందించారు.

ఈ 21 ఓషధీ పత్రాలలో గఱిక మరింత ప్రత్యేకతను సమకూర్చుకొని ఉంది. దాని వివరాలు.

## గఱికపోచలు : గణపతి పూజ

'పుష్పజాతులు దెచ్చి పూజింపలేకున్న
గరికిపూజకు మెచ్చు ఘనుదెవండు ?'

అని కంచర్ల సూర్యనారాయణకవి గణపతిని గురించి ప్రస్తావిస్తున్నాడు. సిద్ధి వినాయక వ్రతకల్పంలో 'దూర్వాయుగ్మమ్ పూజయామి' అంటూ గణపతిని జంటగరిక పోచలతో ఇరవై ఒక్కమారు పూజ చేయాలని ఉంది.

## గఱికతో బొమ్మ

వాసనా వాసితములైన అనేక పుష్పాలు ఉండగా ఏ వాసనాలేని గరికను గణపతి పూజకు ఉపయోగించడంలోని అంతర్యమేమిటని ఆలోచించే సందర్భంలో మహారాష్ట్రుల్లోనూ, తమిళుల్లోనూ ప్రసిద్ధమైవున్న రెండు కథలు తడవతగి ఉంటాయి.

మహారాష్ట్రుల్లో వాడుకలో ఉన్న కథను కొథారి అనువారు 'హిందూ హాలిడేస్' అనే తన గ్రంథంలో ఇట్లా చెబుతున్నారు.

"శివుడు, పార్వతి పాచికలాడుతున్నప్పుడు సాక్షిగా ఉన్న గఱికపోచల బొమ్మ వలపక్షం వహించి ఎంతసేపూ శివుని పక్షమే పలికేది. అందుమీద పార్వతికి కోపం వచ్చింది. అతణ్ణి కుంటివాడుగా శపించింది. అతడు పార్వతిని ప్రార్థించాడు. 'రానున్న భాద్రపద శుద్ధ చవితికి నాగకన్యలు వచ్చి ఇక్కడే గణేశపూజ చేస్తారు. అప్పుడు

నీవు వారివల్ల గణేశపూజను ఉపదేశంపొంది ఆ విధంగా చేయి. నీకు కుంటితనం పోతుంది. ఈ మీద నీవు నా వద్దకు రా.

కుంటితనం పోయింది. అతడు పార్వతి చెప్పినట్లు చేసాడు. తన నిర్మాణంలో ఉపయోగబడ్డ దూర్వాను అతడు విశేషంగా గణపతి పూజకు వాడి ఆత్మార్పణం చేసినట్లు భావించాడు. గరికపోచల పూజకు ఆనందించి గణపతి అతని కుంటితనాన్ని పోగొట్టాడు. పూజా వస్తువులుగా అప్పటినుండి గరికిపోచలు గణనకు వచ్చాయి.

ఇక తమిళుల్లో వాడుకలో ఉన్న కథ వినండి.

"యమధర్మరాజుకు అగ్నిరూపం గల పుత్రుడు. అతని పేరు అనలాసురుడు. అతని రాక్షస ప్రకృతి మితిమీరింది. భూలోకాన్ని బూడిద బుగ్గిచేసి అతడు స్వర్గలోకం మీదకి వెళ్ళాడు. అప్పుడు దేవేంద్రుడు రక్షింపమని వినాయకుణ్ణి ప్రార్థించాడు.

తండ్రి శివుడు హాలాహలాన్ని భక్షించినట్లు కొడుకు గణపతి అనలాసురుణ్ణి నలిపి ఉండగాచేసి మింగివేశాడు. ఆ అగ్ని గణేశుని గర్భంలో ప్రవేశించి అతనికి అమిత తాపం పుట్టించింది. దేవతలు అతనిని తామర పువ్వులతో కప్పారు. అయినా ఆ తాపం చల్లర లేదు. అమృతంతో అభిషేకం చేశారు. అయినా తాపం తగ్గలేదు. ఎన్ని శీతలోపచారాలు చేసినా ఉపయోగం లేకపోయింది.

## అంగతాపానికి మందు

అప్పుడు వారందరూ దీనికి చికిత్స ఏమిటని గంగాధరుని ప్రార్థించారు. ఒక్కొక్కరు ఇరవై ఒక్క గరికపోచలు జంటగా తెచ్చి గణపతిని కప్పమన్నాడు శివుడు. దేవతలందరూ అట్లాగే చేశారు. పాదాలు మొదలు తల వరకు గణపతి గరికిపోచలలో మునిగిపోయాడు. గరికి పోచల స్పర్శతో వాటి ఔషధగుణం వల్ల గణపతి తాపం చల్లారిపోయింది.

అప్పటి నుంచి గరికిపోచలు, గణపతికి ప్రియకరమైన పూజా ద్రవ్యాలు అయ్యాయి. ఈ గాథ గరికపోచల ఔషధగుణాన్ని వివరించేదిగా ఉంది.

చిడుము, సర్పి మున్నగు వాటి మంత్రం వేసేవాళ్ళు గరికపోచలు వాడడం సర్వే సర్వత్రా తెలిసిన విషయమే.

## గరిక వేళ్లతో పచ్చడి

చిరకాలంగా మనదేశంలో గణపతి పూజాద్రవ్యంగా, ఔషధీ ద్రవ్యంగా ఉంటూవున్న గరిక ఆధునిక యుగంలో విదేశీ వైద్యవరుల, శాస్త్రజ్ఞుల విశేష పరిశోధకు గురి అయింది.

మానవునికి ఆహార సమస్యను కూడా ఇది సాధించుపాటి సమర్థత కలదని పరిశోధకులు నేడు అంటున్నారు.

వేటకు వచ్చి దారితప్పి, వేళతప్పి తన ఇంటికి అతిధిగా వచ్చిన విజయనగర జమీందారుకు గరికవేళ్ళతో పచ్చడిచేసి పెట్టి అతని ఆకలిపోకార్చిన ఒక బ్రాహ్మణ గృహిణి అతనిచే గరికవలస అనే గ్రామాన్ని అగ్రహారంగా పడసిందనే గాధ పలువురు ఎరిగిందే.

వెనక గరికవేళ్ళతో మనదేశంలో పచ్చడి మాత్రమే చేసేవారు.

## గరికతో రొట్టె

ఇప్పుడు విదేశాల్లో గరికతో రొట్టెలు కూడా చేస్తున్నారు. ఇజ్రాయల్ దేశంలో శాస్త్రవేత్తలు ఆహార పదార్థంగా గరిక ప్రాశస్త్యాన్ని ఇట్లు చెబుతున్నారు. "ఆహారంగా గోధుమ, వరి, జొన్నలకంటె గరిక ప్రశస్తమైంది. పై ధాన్యాలు సాధారణంగా ఏడాదికి ఒక పంటే పండుతాయి. మా ఇజ్రాయెల్‌లో గరిక ఏడాదికి ఏడుసార్లు కోతకు వస్తుంది. శీతల దేశాల్లో ఏడాదికి రెండు మూడుసార్లున్నూ, ఉష్ణ దేశాల్లో ఆరు ఏడు సారులున్నూ, ఇది కోతకు వస్తుంది. మా దేశములో ఇప్పుడు గరికతో విరివిగా రొట్టెలు చేస్తున్నాము. కొన్ని కుటుంబాలవారు ఆ రొట్టెలనే ప్రధానాహారంగా తీసుకుంటూ, తుష్టి, పుష్టి కలిగి మనుచున్నారు"

అచిర కాలంలోనే ఈ గరిక రొట్టె ప్రపంచవ్యాప్తం కావచ్చునని ప్రొఫెసర్ జిమ్మర్‌మాస్ అంటున్నాడు. నేటి మామూలు బ్రెడ్‌యొక్క సగం ముక్కలో ఎంత పోషక పదార్థం ఉందో ఒక గరికరొట్టె చిన్న పెచ్చులో అంత పోషక పదార్థం ఉందట !

గరిక సంబంధమైన ఆహారం తుష్టిని, పుష్టిని ఇస్తుంది.

## విఘ్నేశ్వరుని విశిష్టతత్వం

త్రిగుణాత్మక స్వరూపుడై, త్రైమూర్త్యభావనతో సదా విరాజిల్లుతున్న విఘ్నేశ్వరుడు వైదిక కాలం నుండి ఆర్యావర్తమైన భారతావనిలో ఆది దైవతా స్వరూపంగా ఉపాసించబడుతున్నాడు. ప్రకృతిలోని సత్త్వ రజస్తమో గుణాది స్వరూపుడైన ఈయనను గుణేశుడని అభివర్ధించారు. కాలక్రమేణా అది గణేశ నామంగా పరిఢవిల్లిందని పండితాభిప్రాయం.

గాణాపత్య సంప్రదాయానుసారం గణము అనగా సత్త్వ రజ స్తమోగుణ సమ్మిశ్రం. ఈ త్రిగుణాధిపతి విఘ్నేశ్వరుడు పురాణేతిహాసాలను బట్టి సకల దేవతా గణాలకు అధిపతి గనుక ఆ విధంగా కూడా గణపతి నామం సార్థకం. ఈయన ఆవిర్భావాన్ని గురించి లింగ పురాణంలో ఇలా ఉంది. బలగర్వితులైన రక్కసులు స్వర్గలోకాన్నాక్రమించుకుని దేవతల్ని అష్టకష్టాలకు గురిచేస్తుంటారు. వారు పరమశివుని ప్రార్థింపగా ఆయన రాక్షస సంహారానికి తన శక్తి చాలక గణపతిని సృష్టించి రాక్షసుల నిర్జించమంటాడు. అందులో తన ప్రమేయం లేనందున పార్వతి ఆగ్రహించి పరమశివునిపై కోపాన్ని గణపతిపై చూపించి ఏనుగు తలతో, బాన కడుపుతో, వికార రూపంతో ఉండమని శపిస్తుంది. చింతాక్రాంతుడైన గణపతిని శివుడూరడించి, సకల దేవతా గణాధిపతిగా, సకల విఘ్న నివారక దైవతంగా అనుగ్రహించాడు.

తత్త్వమర్థస్వరూపిణి - 82

మరో కథనం గజాసురుని సంహరించి పరమేశ్వరుని అనుగ్రహంతో పార్వతిచేత పిండిబొమ్మగా చేయబడి ప్రాణాలు కోల్పోయిన గణపతి గజాసురుని తలతో పునర్జీవితుడైనట్లు బహుళ ప్రచారంలో ఉన్నది. పార్వతీ పరమేశ్వరులు విహరిస్తూ ఉండగా కొలనులో ఉన్న గజ దంపతుల శృంగారాన్ని చూచి మైమరచి తామూ ఆ రూపంతో క్రీడించగా గజముఖుడైన గణపతి ఆవిర్భవించాడని మరో ఐతిహ్యం.

గణపతి పరమేశ్వర తనయుడే కాడు. విష్ణురూపుడు కూడా 'శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం' అన్న ప్రస్తుతి ఇందుకు తార్కాణం. బ్రహ్మవైవర్త పురాణానుసారం సత్త్వాధిపతి శ్రీ విష్ణువు. పార్వతీదేవి పుణ్యక వ్రతానుష్టాన ఫలంగా ఆమెకు విష్ణు సత్త్వ రూపం గణేశునిగా ఆవిర్భావమైందట.

శివధర్మ గ్రంథంలో గణేశుడు పార్వతీదేవికి మాఘ కృష్ణ చతుర్దశినాడుద్భవించాడని ఈ దిగువ శ్లోకం.

"సర్వదేవమయ స్సాక్షాత్ సర్వమంగళదాయకః
మాఘకృష్ణ చతుర్థ్యాం తు ప్రాదుర్భూతో గణాధిపః"

పృథివీ తత్త్వం ప్రధానంగా గలవారు పరమేశ్వరుని, జలతత్త్వం ప్రధానంగా గలవారు గణపతిని, తేజస్తత్వం ప్రధానంగా గలవారు దుర్గాదేవిని, వాయుతత్త్వం ప్రధానంగా గలవారు సూర్యుని, ఆకాశతత్త్వం ప్రధానంగా గలవారు విష్ణుని ప్రార్థిస్తారు. కేవలం ఒక దేవతామూర్తికి పూజ చేయటం కన్న సకల దేవతామూర్తి అయిన విఘ్నేశ్వరునికి ఏ శుభకార్యారంభంలోనైనా తొలి పూజ గావించడం పాంచభౌతిక శరీరులైన ప్రాణులకు అవశ్య కర్తవ్యం. కనుకనే సకలతత్త్వ ప్రదీప్తకుడైన గణపతినిలా అర్చిస్తారు.

"ఆదిత్యం గణనాథంచ దేవీరుద్రంచ కేశవమ్
పంచదైవ మిత్యుక్తమ్ సర్వకర్మ సు వినాయక పూజయేత్"

గణపతి దేవుని కృప వలన సకల భక్తకోటికి ఐహికాధ్యాత్మిక సంపత్తులందుతాయి. ఆ భావాన్ని దిగువ ప్రస్తుతిలో దీప్తిమంతంగా చెప్పబడింది.

"సిద్ధ్యంతి సర్వకార్యాణి మనసాచింతితాన్యపి
తేన ఖ్యాతిమ్ గతోలోకే నామ్నా సిద్ధి వినాయకః"

భారతీయులు వివిధ నామాలతో ప్రసిద్ధికెక్కిన గణపతుల్లో హేరంబ గణపతిని ప్రత్యేక శక్తి సంపన్నుడిగా కొలుస్తారు. హేరంబ గణపతి బహువిపత్కర పరిస్థితుల నుంచి భద్రతా, రక్షణ ఇచ్చి కాపాడే దైవం. అపమృత్యుదోష నివారణకై ప్రార్థనలందుకుని పలికే రూపం హేరంబ గణపతి. విఘ్నాలు తొలగించి, సంపదలిచ్చి కరుణించడంలో అపార కృపానిధి హేరంబ గణపతి. అయిదు శిరస్సులతో ప్రపంచపు పంచభూత తత్వాన్ని సూచించే ఈ దేవత సింహవాహనాసీనుడై శౌర్య ధైర్య పరాక్రమాలకు సంకేతంగానూ అలాగే నృసింహతత్వం మరియు గణపతి తత్వాల మేళవింపుగానూ, హేరంబ గణపతి అద్భుత రూపం భాసిల్లుతూ, అనాది కాలం నుంచీ భక్తజనుల పూజలు అందుకుంటున్నది.

"అత్యంత ప్రీతిపాత్రమైన గణేశుడి వివిధ రూపాలలో లంబోదర గణపతి కూడా ఒకటి. కోపావేశాలను తగ్గించి, ఆందోళనను తొలగించడంలో ఈ దేవతా రూపం ముఖ్యపాత్ర వహిస్తుంది. కోపం, అధికావేశం మనిషిని ఆందోళనకు గురిచేసి - ఒక్కోసారి మెదడు అదుపు తప్పిపోయేలా చేస్తుంది. ఇలాంటి విపత్కర పరిస్థితులు ఏర్పడకుండా నివారణ అత్యవసరం. ఈ నివారణ లంబోదర గణపతి ఆరాధనవల్ల సాధ్యపడుతుంది. ప్రాపంచిక సమస్యలకు పరిష్కార మార్గం చూపడంలో కూడా లంబోదర గణపతి విశిష్ట దేవతారూపం". ఈ గణపతి రూపాన్ని లం, రం, మరియు గం అనే బీజాక్షరాలు ప్రతిపాదికగా ప్రార్థిస్తాము. "లం" పృధ్వీబీజం - మన దైనందిన సమస్యలు తీర్చడంలో ఉపకరిస్తుంది. "రం" అగ్ని బీజం. "గం" ప్రధానమైన ప్రథమ బీజాక్షరం. విఘ్నాలను తొలగిస్తుంది. అతిభక్తి శ్రద్ధలతో గణపతి పూజలు నిర్వహించడంలో, గురువును సైతం అంతే భక్తి శ్రద్ధలతో పూజించడంలో మహారాష్ట్ర ప్రజలు మొట్టమొదటగా లెక్కించతగినవారు. అష్ట వినాయకులుగా ప్రసిద్ధి పొందిన దేవతా రూపాలు మహారాష్ట్రలోనే నెలకొని వున్నాయి. (వికటరాజ రూపంలో మోరేగావ్‌లోని మయూరేశ్వరుడి, పాలిగణపతి రూపంలో భల్లాలేశ్వర్‌లో లంబోదరుడిగా, మాధ్‌లో వరద వినాయకుడిగా, మహోదర పూపంలో ఓజార్‌లో, విఘ్నేశ్వరుడిగా విఘ్నరాజ రూపంలో లేన్యాద్రిలో గిరిజాత్మజ రూపంలో ధూమ్రవర్ణుడిగా, తేవూర్‌లో చింతామణి రూపంలో వక్రతుండుడిగా, సిద్ధిటేక్‌లో సిద్ధి వినాయక రూపంలో సిద్ధేశ్వరుడిగా, రంజన్‌గావ్‌లో మహాగణపతి రూపంలో గజాననుడిగా మహారాష్ట్ర యావత్తూ గణపతుల ఆరాధనాభూమిగా ఖ్యాతి పొందిన దేశం.) లంబోదర రూపంలోని గణపతి - ఉదర సంబంధమయిన వ్యాధులను నయం చేయడంలో ధన్వంతరి పాత్రకూడా పోషిస్తాడు.

జాతి, మత, ప్రాంత వివక్ష లేకుండా తరతరాలుగా కొనసాగుతున్న సంస్కృతీ ప్రతీక వినాయకచవితి. ఈ పర్వదినాన్ని ఒక జాతీయ సమైక్య పర్వదినంగా లోకమాన్య బాలగంగాధర తిలక్ వంటి మహానాయకులు నిర్వహించారు. ఆ మహానుభావుని అడుగుజాడల్లో వినాయక చవితిని వాడవాడలా వైభవోపేతంగా జరపడం నేటి మన అభ్యున్నతికి అవశ్య కర్తవ్యం అని చెప్పవచ్చు.

**విఘ్నేశ్వరాయ వరదాయ సుప్రియాయ**<br>
**లంబోదరాయ సకలాయ జగద్ధితాయ**<br>
**నాగాసనాయ శ్రుతియజ్ఞ విభూషితాయ**<br>
**గౌరీసుతాయ గణనాథ నమో నమస్తే**



# అమ్మలో విఘ్నేశ్వర తత్త్వం !

- డా॥ బి.యల్. సుగుణ

అమ్మ దగ్గరకు వచ్చేవారిలో అనేకులు అమ్మను అనేక రూపాల్లో దర్శించి ఆరాధిస్తూ ఉంటారు. "ఎట్లా చూసే వారికి అట్లా కనబడతా"ను అని అమ్మ చెప్పినట్లుగా ఎందరో తమ ఇష్టదైవాలను అమ్మలో దర్శిస్తే, అమ్మ మాత్రం 'మీ ఇష్టదైవమే నా రూపంలో కనిపించాడేమో' అంటుంది. అన్ని తత్త్వాలకూ మూలం అమ్మే కదా ! ఆ భావనతోనే అమ్మలో విఘ్నేశ్వర తత్త్వాన్ని దర్శించే ప్రయత్నమే ఈ వ్యాసం.

మనం ఎన్నో పండుగలు జరుపుకుంటూ ఉన్నాం. కానీ ఏ పండుగకూ లేని ప్రత్యేకత వినాయక చవితికి ఉంది. పచ్చి మట్టి తీసుకువచ్చి ఆ మట్టితోనే వినాయకుని చేసి పూజిస్తున్నాం. ఆరాధిస్తున్నాం. మూడు రోజులో, అయిదు రోజులో, తొమ్మిది రోజులో ఇలా శక్త్యనుసారం ఎంతో ఘనంగా ఉత్సవాలు నిర్వహించి గడువు పూర్తికాగానే అంతే వైభవంతో ఊరేగిస్తూ తీసుకువెళ్ళి ఆ ఊరి చెరువులో, నదిలో నిమజ్జనం చేస్తున్నాం. ఈ కార్యక్రమాన్ని గురించి ఒక్కసారి ఆలోచిస్తే దీనిద్వారా గణపతి మనకు ఒక సత్యాన్ని బోధిస్తున్నట్లుగా అన్పిస్తుంది. మీ అందరికీ ఆరాధ్యమూర్తిని అయిన నేనే మట్టిలోనుంచి వచ్చి మట్టిలో కలిసిపోక తప్పటం లేదు. ఏ ప్రాణికయినా పుట్టటం, పోవటం సహజం. మరి అనివార్యంగా సంభవించే ఈ జనన మరణ చక్రంలో మూన్నాళ్ళ ముచ్చటగా ముగిసిపోయే ఈ మానవ జీవితంలో అర్థంలేని కోరికలతో అనవసరమైన ఆవేశాలతో, అంతుచిక్కని రాగద్వేషాలతో మీరు మీ జీవితాలను నాశనం చేసుకోవడమేగాక, ఇతరుల జీవితాలకు కూడ మనశ్శాంతి లేకుండా చేస్తున్నారు. అరిషడ్వర్గాలకు లోనయి అందని ద్రాక్షపండ్లకై అర్రులు చాస్తూ అవి అందకపోయేటప్పటికి తమ పనులకు విఘ్నం కల్గుతోందనీ, ఏ పని ప్రారంభించినా అన్నీ ఆటంకాలేననీ వాపోతూ అశాంతికి గురి అవుతూ ఉన్నారేకాని యథార్థస్థితిని తెలుసుకోవటం లేదు. ఏనాటికయినా మనిషి వచ్చిన చోటుకు పోక తప్పదు. కనుక ఈ ఉన్న కొద్ది కాలంలోనయినా ఫలాపేక్ష లేకుండా మీ కర్తవ్యాన్ని మీరు సక్రమంగా నిర్వర్తించండి. ఏది ఎట్లా జరగాలో అది అట్లాగే జరుగుతుంది. ఏం జరిగినా భగవన్నిర్ణయమే అనే జీవిత సత్యాన్ని తెలుసుకుని మసలుకుంటే అన్ని పనులు సక్రమంగా నెరవేరుతాయి. ఏ పనికీ ఆటంకం ఉండదనే సత్యాన్ని బోధిస్తున్నాడు. మానవుని అజ్ఞానాన్ని పోగొట్టి జ్ఞానాన్ని ప్రసాదించి వాస్తవ దృష్టిని కల్గించి తద్వారా మానవుని కర్తవ్యోన్ముఖుణ్ణి చేయడమే సత్యస్వరూపుడైన విఘ్నేశ్వర తత్త్వం.

ఏది సత్యమైందో అది శుభప్రదమైంది. అదే సుందరమైంది. సత్యం-శివం-సుందరం-లో శివం సుందరంల నుండి ఏర్పడ్డదే సత్యం. ఆ సత్యమే గణపతి. కాబట్టి జీవిత సత్యాలను తెలియజేయడం విఘ్నేశ్వర తత్త్వంగా మనం భావించవచ్చు.

ఈ తత్త్వమే అమ్మలో ఏ రూపంగా గోచరిస్తుందో దర్శిద్దాం.

అమ్మ జీవిత సంఘటనలలోని అనుభవమే అమ్మ వాక్యాలుగా రూపుదిద్దుకుంది. ఇవి శాశ్వత సత్యాలు. జీవితం గురించి అమ్మ స్పృశించని కోణమే లేదు. జీవిత సత్యాలను నిర్వచిస్తూ త్రికాలాబాధ్యమయిన సత్యాలను

బోధిస్తున్న అమ్మ మాటలు అజ్ఞానాంధకారంలో చిక్కుకున్న ఎందరి జీవితాలలోనో అక్షర దీపాలయి వెలుగులు నింపాయి. అనుభవంలోంచి వచ్చిన అమ్మ మాటలు మనకు ఎంతో మానసిక ప్రశాంతినీ, ధైర్యాన్ని, హాయినీ కల్గిస్తాయి.

బాధల్లో ఉన్నవారికి 'బాధ కూడా తన ప్రసాదమే'ననీ, దుఃఖం అనుగ్రహం కాకపోలేదనీ, ఒడిదుడుకులుకూడ ఆశీర్వచనమేననీ చెప్పి ఊరట కల్గిస్తుంది. అంతేకాక 'బాధల్లేని బ్రతుకు వ్యర్థమనీ, 'శిల్పానికి అందం రావాలంటే ఉలి దెబ్బలవసరమనీ' చెప్పింది. అసలు బాధ వల్లనే వ్యక్తిలో చైతన్యం ఉద్దీప్తమవుతుంది. సమగ్ర వ్యక్తిత్వానికిగానీ, చుట్టూ వున్న సమాజాన్ని, సాటి మనిషిని అర్థం చేసుకోవటానికిగానీ, వారి కష్టాన్నిచూసి స్పందించటానికి గాని బాధలే అవసరం. అందుకే 'బాధల్లేని బ్రతుకు అనవసరం' అన్న అమ్మ వాక్యం ఉన్నత జీవిత సత్యం. బాధలు పడటంలోనే ఔన్నత్యం పెరుగుతుందనీ, సహనంలోనే జీవన పరమావధి ఉందనీ, బాధలే లేనపుడు ఆ జీవితం నిరర్థకమనీ స్ఫురింపచేస్తుంది అమ్మ ప్రవచనం.

'నవ్వుతూ అనుభవించే వాడి దగ్గరకు ఏడుస్తూ అనుభవించేవాడు సలహాకు వస్తాడు' అని అమ్మ మరో వాక్యం. ఇది శాశ్వతమైన జీవిత సత్యం. మనిషికి జీవితంలో సుఖదుఃఖాలు, జయాపజయాలు తప్పవు. ఏదైనా కష్టం కల్గినపుడు దీనికంతటికీ కర్తను నేను అనుకునేవాడు కృంగిపోతాడు. తన ప్రాప్తం ఇంతే అనుకునేవాడు అనుభవిస్తూనే నిమిత్తమాత్రంగా ఉండగల్గుతాడు. 'కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన' అని ఫలాపేక్ష లేకుండా కర్మాచరణ జరగాలి. ఫలాపేక్ష దుఃఖాన్ని కల్గిస్తుంది. ఇష్టమో, కష్టమో, బాధో, ఆనందమో, నేను కర్తను కాదు అనుకునేవాడు నవ్వుతూ అనుభవిస్తాడు. అనుభవించడం అందరికీ ఒకటే. మానవ మనస్తత్వాన్ని విశ్లేషిస్తూ చెప్పిన జీవన సత్యం ఇది. ఎంత చెట్టుకు అంతగాలి అన్నట్లుగా ఏ మనిషికయినా వాళ్ల స్థాయిని బట్టి బాధలు తప్పవు. కాని ఆ సన్నివేశానికి అతని స్పందన ఎలా ఉన్నదనే దాని మీద అతని వ్యక్తిత్వం ఉంటుంది. 'జీవితంలో ఏదీ తప్పదు నాన్నా ! నవ్వుతూ అనుభవించు' అని అమ్మ ప్రబోధం. వేదాంతం, మనస్తత్వ విశ్లేషణ అన్నీ ఇమిడి ఉన్న వాక్యమిది.

అమ్మ దగ్గరకు మద్రాసునుంచి వచ్చే సోదరులలో సెల్వరాజన్ ఒకరు. ఒక ప్రైవేటు కంపెనీలో ఉన్నతోద్యోగి అయిన ఆయనకు అమ్మపట్ల అచంచల విశ్వాసం. జిల్లెళ్ళమూడివస్తే అమ్మ తనంతట తానుగా బొట్టుపెట్టి వెళ్లమంటేగాని తిరిగి వెళ్లే వారుకాదు. అలాగే ఒకసారి వచ్చినపుడు ఏదో అత్యవసరమయిన మీటింగుకు వెళ్లాలని సర్కార్ ఎక్స్‌ప్రెస్‌కు రిజర్వేషన్ చేయించుకుని అనుమతి కోసం అమ్మ దగ్గరకు వెళ్లారు. కాని అమ్మ ఏ కారణం చెప్పకుండా 'వద్దు నాన్నా ! ఎందుకో నీవు ఉండాలనిపిస్తోంది' అన్నది. అమ్మ అనుమతి ఇవ్వని కారణంగా ఆయన వెళ్లలేదు కాని ఆ రాత్రంతా మీటింగుకు వెళ్లలేకపోయానని మధనపడుతూనే ఉన్నారు. తెల్లవారేటప్పటికి పేపర్లో వార్త. సర్కార్ ఎక్స్‌ప్రెస్‌కు ప్రమాదం జరిగి 250 మందిదాకా చనిపోయారని. అది విన్న ఆ సోదరుడు అమ్మకు నా మీద ఎంత దయ. ప్రమాదం నుంచి కాపాడడానికే తనను వెళ్లడానికి అనుమతి ఇవ్వలేదని భావించి వెంటనే అమ్మ దగ్గరకు పరిగెత్తుకు వచ్చి విషయంచెప్పి 'నీ బిడ్డను కాపాడావమ్మా' అంటూ అమ్మ

పాదాలపై వ్రాలాడు. వెంటనే అమ్మ 'పోయిన 250 మంది నా బిడ్డలు కారా' అని ప్రశ్నించి రక్షింపబడడానికీ, రక్షింపబడకపోవటానికీ, కారణం ఒకటేననీ, పడడానికీ పడకుండా ఉండడానికీ, పడ్డా దెబ్బలు తగలకుండా ఉండడానికీ అన్నిటికే ఒకే కారణమనీ, అదే భగవన్నిర్ణయమనీ 'నిర్ణయానికి నిర్ణయించినవాడు కూడ బద్ధుడేననీ' చెప్పి సృష్టియొక్క యదార్థస్థితిని తెలియజేసింది.

నేనుండడం వలన ఏం ప్రయోజనం లేదమ్మా అంటే 'ఉండడమే ఉపయోగం నాన్నా !' అనీ, 'రిక్తహస్తాలతో వచ్చానమ్మాఅంటే' 'ఫరవాలేదులే నాన్నా ! రక్తహస్తాలతో వచ్చావనీ, కొబ్బరికాయ కుళ్లిపోయిందని బాధ పడ్తుంటే, కుళ్ళిపోవడం కాదు, కుళ్లు పోయిందనీ మనలను ఊరడిస్తుంది.

కష్టసుఖాలు పరిస్థితులనుబట్టి కాక మన స్థితినిబట్టే ఉంటాయనీ, సుఖదుఃఖాలు రెండూ భగవంతుడిచ్చినవేననీ, ఏదైనా తన గీతను బట్టే జరుగుతుందనీ, అనుకున్నది జరగదు, తనకున్నది తప్పదని, తిథులు విధిని మార్చలేవనీ వాస్తవాలను నిశ్చలంగా ఎరుకపరుస్తుంది.

మరొక కోణంలో యోగదృష్టితో పరిశీలిస్తే అమ్మ తత్త్వానికీ గణపతి తత్త్వానికీ చక్కటి సమన్వయం గోచరమవుతుంది. మూలాధారంలో ఉన్న కుండలిని సహస్రారం చేరడం కుండలినీ యోగం. మూలాధారైక నిలయా, కుళకుండాలయా, కుళేశ్వరీ మొదలైన నామాలలో అమ్మవారు కుండలినీ స్వరూపిణిగా వర్ణించబడింది. మూలాధార చక్రాధిష్ఠాన దేవత గణపతి. మూలాధారంలో కదలిక లేకపోతే కుండలినీ ప్రచోదనం జరగదు. జీవాత్మ పరమాత్మలో ఐక్యమై ఆత్మ సాయుజ్యాన్ని పొందడమే కుండలినీ యోగం. ఈ యోగ సాధనలో మూలాధారమైనవాడు గణపతి. మూలాధారం పృథివీ తత్త్వానికి సంబంధించింది. ఆ పృథ్వీ తత్త్వమే తనది అంటూ అమ్మ 'అవనియే ఆరాధ్యదైవం' అని ప్రకటించింది. ఇక్కడ అమ్మకు అవనికి భేదం లేదు. అమ్మే అవని, అవనియే అమ్మ. ఈ విధంగా చూస్తే గణపతి తత్త్వానికీ, అమ్మ తత్త్వానికీ ఏ మాత్రం భేదం కన్పించదు.

భౌతిక దృష్టితో చూస్తే గజాననుడు అంటేనే ఆయన భౌతిక సౌందర్యం మనకు అవగతమవుతుంది. దానికి తోడు పొట్టిగా, పెద్ద బొజ్జతో కన్పిస్తాడు. అయినప్పటికీ ముద్దులొలికే విఘ్నేశ్వరుణ్ణి చూడగానే మనందరం ఎంత బాగున్నాడు అనుకుంటూ ఆయననే చూస్తూ ఎంతో సంబరపడిపోతూ ఉంటాం. మళ్లీ మళ్లీ చూడాలని కోరుకుంటాం. ఏ వ్యక్తి అయినా ఏ వస్తువయినా మళ్లీ మళ్లీ కావాలన్పించే ఉత్సుకతను కల్గిస్తే అది సౌందర్యమే. మరి ఇదెట్లా సాధ్యం ? అంటే భౌతికమైన రూపానికి అతీతంగా జగన్మోహన సౌందర్యం కల్గి ఉండడమే దివ్యత్వం. ఆ దివ్య సౌందర్యం వల్లనే గణపతి రూపం మనలను ఆకర్షిస్తుంది.

అమ్మ రూపం కూడా భౌతికంగా చూస్తే మామూలుగా మనం లోకంలో అనుకునే సౌందర్యానికి భిన్నంగా కన్పించవచ్చు. కాని అమ్మ రూపంలో ఒక అలౌకికత అందరినీ ఆకట్టుకుంటుంది. అమ్మ రూపం పాదం నుండి ఫాలం వరకు దివ్య తేజస్సుతో ప్రకాశిస్తూ ఉంటుంది. అమ్మను చూడగానే ఒక పవిత్రమైన ఆకర్షణకు లొంగిపోతాం. అమ్మను చూసినకొద్దీ చూడాలన్పిస్తుంది. అమ్మ సన్నిధిలోనే ఉండాలనిపిస్తుంది. అదే దివ్యతత్త్వం.

దైనందిన జీవితంలో ఎవరి కర్తవ్యాన్ని వారు సక్రమంగా నిర్వహించడమే నిజమైన ఆధ్యాత్మికత. మనిషికి ఎన్నో ధర్మాలు ఉంటాయి. వాటిని సక్రమంగా పాటిస్తే అంతకంటే దైవ సేవ మరెక్కడుంటుంది? మన దినచర్యలో తల్లిదండ్రుల సేవ ఒక భాగం. తల్లిదండ్రులనే దైవానికి ప్రతీకలుగా భావించి సేవిస్తే ఆ బిడ్డకు అన్ని ఐశ్వర్యాలూ హస్తగతమవుతాయి. భూప్రదక్షిణం మూడు సార్లు ఎవరు చేసి వస్తారో వారే సర్వగణాలకూ అధిపతి అని పరమేశ్వరుడు నిర్ణయించాడు. తల్లిదండ్రులకంటే మించిన దైవం మరెక్కడో లేదని తలచి విఘ్నేశ్వరుడు తన తల్లిదండ్రులయిన పార్వతీ పరమేశ్వరులకు తలవంచి నమస్కరించి సర్వదేవతాగణాలకూ అధిపతి అయ్యాడు. ఈ విధంగా తల్లిదండ్రుల పట్ల బిడ్డల ప్రవర్తన ఎలా ఉండాలో ఆచరణాత్మకమైన ప్రబోధాన్ని అందించాడు గణపతి. ఈనాటి కాలానికి ఇది ఎంత అవసరమో అన్పిస్తోంది.

అమ్మ తన జీవితంలో భర్త, గృహం, బంధుజనులు వారి సౌఖ్యం కోసం, వారి ఆనందం కోసం తనయగా, భార్యగా, తల్లిగా, కోడలిగా వివిధ భూమికల్లో తక కర్తవ్యాన్ని ఎంతో సహనంతో నిర్వర్తించి ఆచరణాత్మకమైన ప్రబోధాన్ని అందించింది. "కర్తవ్యమే భగవంతుడు" అని నిర్వచనం చెప్పింది.

గణపతి తత్త్వాన్ని గురించి సత్యసాయిబాబా ఈ విధంగా చెప్పారు.

లోకంలో బాగా ఈత వచ్చిన వాళ్లను గజ ఈతగాళ్లు అంటారు. ఎందుకంటే ఏనుగు శరీరం అతి భారీగా ఉన్నప్పటికీ దేహాన్ని అతి తేలికగా చేసుకుని నీటిలో ఈదుతుంది. అందువల్లే గజ ఈత అనే పేరు వచ్చింది. సంసారాన్ని ఒక మహా సాగరంగా చెప్తారు. సంసారమనే ఈ సాగరాన్ని గజ తత్త్వం అయిన గణపతి తత్త్వం అతి తేలికగా దాటిస్తుందని బాబా చెప్పారు.

సామాన్య లోకంలో సంసార సాగరాన్ని దాటడం సాధ్యం కాదనీ, సన్యాసులే దానిని తరించగలరనే అభిప్రాయం బలపడిపోయింది. కాని, 'చేసేదంతా భగవత్సేవే అనుకుంటే సంసారం ఆధ్యాత్మికసాధనకు ప్రతిబంధకం కాదనీ, సంసారంలో ఉండి సాధన చేయడం కోటలో ఉండి యుద్ధం చేయడమనీ ప్రబోధించడమేకాక 'తాను సంసారంలో ఉండవచ్చుకాని తనలో సంసారం ఉండకూడద'ని చెప్పింది. తాను సంసారంలో ఉంటూ దానికతీతంగా ఉండటం ఎట్లా సాధ్యం ? నీళ్లలో దిగిన గజ ఈతగాడయినా నీటి తడి అంటకుండా బయటకు రాగలడా ! కాని అమ్మ తనదంటూ సంసారం ఉండి తనకంటూ పిల్లలుండి తాను సంసారంలో ఉంటూ దానికతీతంగా ఎలా ఉండాలో ఆచరించి చూపింది.

అమ్మ స్థితిని గుర్తెరిగినవారు 'నీకీ పెండ్లి ఎందుకమ్మా' అంటే - లోకంలో ఉన్న కష్టాలన్నిటినీ సహిస్తూ సంసారం జీవనం ఎలా సాగించాలో నేర్పడానికేననీ, సర్వాన్నీ అనుభవిస్తూ మనసుకు ఏదీ అంటకుండా ఉండటం సాధ్యమేనని నిరూపించడానికే వివాహం చేసుకుంటున్నాననీ' చెప్పి ఆచరించి చూపింది.

ఈ విధంగా పర్యాలోచిస్తే రూపాలు వేరయినా తత్త్వం ఒకటే అన్న సత్యం బోధపడుతుంది.

# మూడు ముఖాల ముచ్చటైన హైమ

- రాచర్ల లక్ష్మీనారాయణ

"హైమలో మూడు అంశలు వున్నాయి". అని అమ్మ అన్నది. కారణం ఏమిటి? అని ఆలోచిస్తే, అవి మనలోనూ వున్నాయని, హైమ వాటిని తెలుసుకుని ఆ స్థితిని పొందిందని, మనము తెలుసుకోలేకపోయామని అర్థమవుతుంది. అందుకే అస్థితిని పొందటానికి వారిని మనం ఆరాధిస్తాము. అయస్కాంతం సన్నిధిలో యినుప ముక్కలో దాగివున్న అయాస్కాంత ధర్మం మేలుకొంటుంది. ఇనుప ముక్క అయస్కాంతం అవుతుంది.

వినాయకుడు "ఓం"కార (ప్రణవ) స్వరూపుడని, కుమారస్వామి అన్న అని మనం చెప్పుకుంటాము. మనము గాలిపీల్చి వదిలేటప్పుడు జరిగే క్రియ, వచ్చే శబ్దమే ప్రణవ నాదము. సర్వకాల సర్వావస్థలలోను మనకు తెలుస్తున్నపుడు తెలియకుండా (నిద్రలోను) ఆక్రియ జరుగుతూనేవుంటుంది. ఆ ఉచ్ఛ్వాస నిశ్వాసాల మీద మనస్సుపెట్టి గమనిస్తూ చేసేదాన్నే 'ధ్యానం' అంటాము. "శ్వాసమీద నిఘా వెయ్యి నాన్నా" అని అమ్మ చెప్పింది.

ఆంజనేయస్వామి వాయుపుత్రుడు. ఆవాయువుమీదనే ఆధారపడి జీవిస్తున్నాము కనుక మనమూ వాయుపుత్రులమే. మనలో ఆ వాయువులేనినాడు శవమే. ఆ వాయువు ఆధారంతో మూలాధారంలో వుండే (ఆ స్థానం వినాయకస్థానం) కుండలినీ శక్తిని ప్రచోదనం చేస్తే సుషుమ్నా నాడి ద్వారా ఊర్ధ్వదిశగా ప్రయాణిస్తుంది. శ్రీరాముడు 'వాయు'పుత్రుడైన ఆంజనేయస్వామి ఆధారంతో సీతమ్మ జాడ తెలుసుకున్నాడు. అలాగే మనము ఆ వాయువు ఆధారంతోనే మనసహస్రారంలో వున్న శక్తిని మేలుకొలపాలి. మనయోగసాధ నకు ఏ అడ్డంకులు లేకుండా అక్కడవున్న శక్తి సహకరిస్తుంది. ఆశక్తినే విఘ్నేశ్వరుడు అంటారు. అందుకే లలితలో 'కామేశ్వర ముఖాలోకకల్పిత శ్రీగణేశ్వరాం' అని, 'మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్రప్రహర్షితా" అని అంటారు. ఆ శక్తి ఆరు చక్రాలను దాటి సహస్రారానికి చేరటమే కుమారస్వామి తత్త్వము. అందుకే ఆయనను ఆరుతలలు కలవాడు అన్నారు. ఆ శక్తి పాము మెలికలు లాగా ఆరు చక్రాలమీదుగా ప్రయాణంచేస్తుంది కనుక ఆ శక్తిని "సుబ్రహ్మణ్యము" అని కూడ అంటారు. బ్రహ్మతత్వాన్ని తెలుసుకోవటం. ఆ ప్రక్రియలు హైమలో జరిగినవి. అందుకే ఆజ్ఞాచక్రం (రుద్రస్థానాన్ని) చేరిన ఆశక్తి అమ్మని తెలుసుకొని అమ్మ అనుజ్ఞకోసం ఎదురుచూస్తుంది.

> అతప్యత స్మ అఖిలలోక తాపనం
>
> తపస్తపీయాంస్తపతాం సమాహితః ।
>
> 'తపోవ్రతులలో అగ్రగణ్యుడైన ఆతడు ఏకాగ్రతతో ఎంతటి గాఢ తపమాచరించాడంటే అతడికి అఖిల బ్రహ్మాండాన్ని సృజించే సామర్థ్యం, జ్ఞానం కలిగాయి.'
>
> - కఠోపనిషత్తు

హైమలో వున్న వాయువు. బయటకు వెళ్ళగా కట్టె అయిన ఆ శరీరాన్ని సంస్కరించి మరల ఆ వాయుపుత్రుడిని ప్రవేశింపచేసి, ఆంజనేయుని అంశగా రక్తప్రసరణ గావించి, ఆ శక్తిని ఆరు చక్రాలమీదుగా ప్రవహింపచేసి ఆరు తలల కుమారస్వామిగా చేసి, శిరస్సుని చిట్లింపచేసి (కపాలమోక్షం గావించి) పాత తలలో కొత్త శక్తిని నింపింది. ఈశ్వరుడు వినాయకుని తలను భేదించి ఆ తరువాత గజశిరస్సును తెచ్చి అతికించినట్లుగా అమ్మ హైమను వినాయకుడిని చేసింది. అందుకే హైమలో ఆంజనేయ, కుమారస్వామి, వినాయకుని తత్త్వాలు దాగివున్నాయి.

అమ్మ మన యొక్క సాధనకు విఘ్నాలు లేకుండా చేయగలందులకే తన స్నానాల 'దడి'లో సంకల్పం చేసి ఆస్థానంలో విఘ్నేశ్వర విగ్రహ ప్రతిష్ఠ చేయిస్తున్నది అమ్మ. అందుకే మనను యోగ సాధన నిమిత్తం వినాయక నవనాగేశ్వరాలయాలను ఏర్పాటు చేసింది అమ్మ. అలాగే ఎప్పటికైనా ఆంజనేయస్వామి ఆలయం వస్తుంది. కారణం కొంతకాలం ఒక వానరం రోజూ అమ్మ దగ్గరకు వస్తూవుండేది. ఎంతో ప్రేమగా అమ్మ తన దగ్గరకు తీసి ఆదరిస్తూ వుండేది. అది కొంతకాలానికి అమ్మలో ఐక్యమైంది. దీని శరీరాన్ని ఊరేగింపుగా తీసుకొళ్ళి అమ్మ సంస్థకు దక్షిణంగా వున్న తోట స్థలంలో ఖననం చేశారు. ఈ ఖననం అమ్మ ఆదేశానుసారం జరిగింది. ఆనాడే ఆంజనేయస్వామి గుడి వస్తుంది అని అమ్మ చెప్పింది. అమ్మది "తోలు నోరు కాదు కదా తాలు మాట రావటానికి". ఈ ఆలయాలు మన యోగ సాధనలకు ఉపయోగపడటానికే.



సర్వభూతేషు యేనైకం భావమవ్యయ మీక్షతే ।
అవిభక్తం విభక్తేషు తత్ జ్ఞానం విద్ధి సాత్త్వికం ॥

'సర్వ జీవులలో ఒకటిగా ఉండే అవ్యయతత్త్వం దేనిచే చూడబడుతుందో, విభజింపబడినట్లు అగపడేవాటిలో అఖండాన్ని చూస్తుందో ఆ జ్ఞానం సాత్త్వికము...'

\- భగవద్గీత

# వినాయకుని కథల పరమార్థం

- దేవరకొండ శేషగిరిరావు

అన్ని కథలలోనూ దాగిన పరమార్థాన్ని మనం గుర్తించాలి. ఆ రహస్యం తెలియనంత మాత్రంచేత వెఱ్ఱిమొఱ్ఱి కథలని అనడం సబబు కాదు.

**శివ గణేశ సంగ్రామం :**

ద్వారం దగ్గర గణపతి శివుణ్ణి ఎదుర్కొన్నప్పుడు మరణించాడు కదా! ఇట్లు కొడుకును శివుడు చంపుతాడా? శివ సంబంధం లేకుండా శక్తి ఇతణ్ణి తయారు చేసింది. కనుక మరణించాడు. శివుడు పశ్చాత్తాపం చెందాడు. శక్తి లేకుండా శివుడు లేదు. శివుడు లేకుండా శక్తి లేదని సర్వసమ్మతమైన సిద్ధాంతం. శివశక్తుల సమ్మేళనం వల్లనే సృష్టి జరుగుతుంది. దీనికి ప్రమాణాలను తిలకించండి :

"నశివేన వినాశక్తిః న శక్తిరహితః శివః" - మత్స్యేంద్రనాథులు - కాలజ్ఞాన నిర్ణయం

"శివో పి శవతాం యాతి కుండలిన్యా వివర్జితః" - దేవీ భాగవత పురాణం

"శివోపిశక్తి రహితః కర్తుం శక్తో న కించన" - సర్వసిద్ధాంత సంగ్రహం

**వినాయకచవితి :**

భాద్రపద శుద్ధ చవితినాడు సూర్యోదయానికి ముందుగా తూర్పువైపున ఎలుక రూపం, దాని మీద ఏనుగు ఆకారంతో ఉన్న నక్షత్రాలు ఉదయించడాన్ని బట్టి ఈ చవితికి వినాయకచవితియని పేరు వచ్చిందని ఖగోళ శాస్త్రజ్ఞులంటున్నారు. ఈనాడు చంద్రుడు పస్తా నక్షత్రంలో ఉంటాడు. హస్తకు అధిపతి సూర్యుడే. సూర్యుడు తన రాశియైన సింహంలో ఉంటాడు. సూర్యుని కాంతి వల్ల ఏనుగు ఆకారం వంటిది ఖగోళంలో ఏర్పడింది. దీనినే గణపతిగా పూజిస్తున్నారని అంటారు.

శ్రీరాణీ వేంకటాచలపతి విద్వచ్ఛయనులు గారు తమ 'వినాయకచవితి-నాగులచవితి' అనే గ్రంథంలో మూషిక వాహనంలోని పరమార్థాన్ని వివరించారు.

**మూషిక వాహనం :**

"అగ్నిర్దేవేభ్యో ఉ నిలాయత, అఖో రూపంకృత్వా ప్రధివీం ప్రాశిశత్" (తైత్తిరీయశాఖ 1-8.6.1) అనే మంత్రంలో అగ్ని అఖురూపుడై (మూషికరూపుడై) భూమిని త్రవ్వినట్లుంది. గణపతిని బ్రహ్మగా భావిస్తే అది (ఎలుక) అగ్ని రూపంలో సృష్టిలో వ్యాపించినట్లర్థమౌతుంది. భూమిని త్రవ్వాడు కదా ! భూతత్త్వమైన మూలాధారానికి గణపతి అధిపతి కాబట్టిఅతనికి వాహనమై అంతటా వ్యాపించాడు అగ్ని. శూర్పకర్ణుడు అనే నామానికి 'అగ్నిని

వెలుగొందచేసినవాడు' అనే అర్థాన్ని బ్రహ్మాండ పురాణం అందించింది కనుక గణపతి తన విశాలమైన చెవులచే దానిని రాజుకొన్నట్లుగా చేశాడని అర్థం చెప్పవచ్చు.

### తదియతో కూడిన చవితినాడే ఎందుకు పూజ చేయాలి ?

వారే ఇట్లా వివరించారు. సింహరాశిలో రవి ఉండగా రెండు పక్షాలలోను వచ్చే చవితినాడు చంద్రుణ్ణి చూడకూడదని తిథి తత్త్వంలో ఉంది. అట్లా చూస్తే అపవాదు కల్గుతుందని మార్కండేయు డన్నాడు. ఆనాడు చంద్రుడు నవ్వాడని అతనికి శాపం కల్గిందని పురాణాలంటున్నాయి. తదియ గడియలలో కూడిన చవితి పనికి వస్తుందని శాస్త్రాలంటున్నాయి. సౌర ధర్మాన్నిబట్టి గౌరీ ప్రధానమైన తిథి తదియ కావడం వల్ల, ఆశక్తి గణపతికి తల్లి కావడంవల్ల ఆ తదియ కలిసిన తిథియే గణపతికి తల్లి కావడంవల్ల ఆ తదియ కలిసిన తిథియే గణపతి పూజకు తగిన సమయం. మరునాడు వచ్చే పంచమితో కూడిన చవితి పనికిరాదన్నారు. గణపతిని సృష్టికర్తగా భావించినపుడు అతడి మొదటి సృష్టిలో సర్పాలు పుట్టాయి కనుక నాగులతో కూడిన పంచమి (నాగపంచమి) కంటే జననీ ప్రధానమైన తదియ నాడు కలిసిన చవితినే ఎన్నుకున్నారు.

### చవితినాడు చంద్రుణ్ణి ఎందుకు చూడకూడదు ?

గణపతి ఆత్మ. మనస్సుకి చంద్రుడు దేవత. చంద్రుణ్ణి చూడకూడదంటే మనస్సుని సంకల్పాలు కలదానిగా చేయరాదన్నమాట. సంకల్పంలేని స్థితిలో బ్రహ్మను భావించాలి. అట్లా చేయకపోతే లోకనింద కలుగుతుంది. అనగా సంసార బంధాలలో చిక్కుకొని జీవుడు బాధలు పడుతూ ఉంటాడని అర్థం. వ్రతకథలో సింహం ప్రసేనుణ్ణి చంపిందని ఆ సింహాన్ని జాంబవంతుడు చంపాడని, ఏడువకు కుర్రవాడ అనే అర్థమిచ్చే శ్లోకాన్ని చదవాలని చెప్పాం కదా ! ఏమిటి దీని పరమార్థం ? "సింహమును బోధించు సింహ శబ్దము అంతరార్థమున సింహరాశిని తెలుపును. అది సూర్యునిరాశి (గ్రహము). అది జాంబవంతునిచే హతమైనది. అనగా జాంబవంతుడు ఋక్షపతి. ఋక్షములనగా నక్షత్రములు. వానికిపతి చంద్రుడు, ఆనాడు చంద్రుడు సింహరాశిని అతిక్రమించాడు భావము. జాంబవంతుడు 'కన్యను' కృష్ణునకిచ్చాడనటంలోగూడ 'కన్య' కన్యారాశినే తెల్పుతుంది. ప్రస్తుతము చంద్రుడు సింహరాశిని దాటి కన్యలో ప్రవేశించాడు. కాన ఓ సుకుమార ! ఓ జీవ ! (అజ్ఞాని) మారోధీః : ఈ సంసార బంధమున చిక్కుకొని దుఃఖింపకుము. ఈ సూర్యమణి నీదే. ఈ జ్ఞానమణి నీదే, అనగా ఆ జ్ఞాన స్వరూపుడవే నీవు అని గుర్తించుము. ఇట్లు ఆత్మనిష్ఠ కలిగిననాడు నీకు రోదనముతో (సంసారదుఃఖముతో) పని లేదు" అని అర్థం ఇస్తోందని వివరించారు.

### గణపతికి గరికకు ఉన్న సంబంధం :

మనలో పిత్తం ఉద్రేకిస్తే స్వప్నాలు కంటూ ఉంటాం. దూర్వామూల (గరికపోచల) కషాయం పిత్తశాంతికరమని, స్వప్నాలు రాకుండా చేస్తుందని వైద్యశాస్త్రం అంటోంది "దూర్వా దుస్స్వప్ననాశనీ" అని వేదం చెబుతోంది. ఈ సృష్టి అంతా ఈశ్వర స్వప్నమే కదా ! దానిని నివారించిన గాని తత్త్వం తెలియదని ఇట్లా దూర్వాపూజ ఏర్పడిందని ప్రపంచమనే స్వప్నం దూరంగా తొలగాలని ఇది సూచిస్తుందని వారు వివరించారు.

తత్త్వమర్థస్వరూపిణి - 92

## నలుగుపిండి కథ

పార్వతి తన ఒంటి నలుగుపిండిని బొమ్మగాచేసి ప్రాణప్రతిష్ఠ చేసిందని, అతడే గణపతిఅని చదువుకొన్నాం. వినాయకుడు శుద్ధ చైతన్య స్వరూపం కదా ! ఇట్లా నలుగుపిండి నుండి పుట్టడమేమిటి? అసలు అమ్మవారి శరీరంపై మాలిన్యం ఉంటుందా ? దేవతల శరీరాలు వాయు శరీరాలని, కొన్ని తేజోమయంగా ఉంటాయని, మన మాదిరిగా ఎముకలే ఉండవని, పవిత్రములని, అథర్వవేదం వర్ణించింది కదా ! ఆమె సచ్చిదానంద స్వరూపిణి కదా ! ఏమిటి దీని అర్థం ? ఈ ప్రపంచం అంతా రజస్సు (దుమ్ము, ధూళి, మాలిన్యం)తో కూడినదే! ఈ ప్రకృతినే ఆమె స్వరూపంగా భావిస్తే సందేహం లేదు. మన శరీరాలు మాలిన్యంతో కూడినవే కదా ! ఈ మాలిన్యాన్ని పోగొట్టుకుంటే మనమూ శుద్ధ చైతన్య స్వరూపులం అవుతాం. మాలిన్యం పోగొట్టుకోవడం కోసం ఈ కథ పుట్టిందేమో ! ప్రపంచం అంతా అర్వాక్ రజస్సని, దానిపై ఉన్నది. పరోరజస్సని వేదం వర్ణించింది. రజస్సుతో ఉన్నపుడే సృష్టి. ఆ పరో రజస్సని వేదం వర్ణించింది. రజస్సుతో ఉన్నపుడే సృష్టి. ఆ పరో రజస్సు అవతారం అవతరించడానికి కారణమౌతోంది. గాయత్రీ మంత్రంలో చివరిపాదం 'పరో రజసి సావదోం'. మామూలు రజస్సుకంటే పరమైన దాని నుండి గణపతి ఆవిర్భవించినట్లు భావించాలి.

## ఉత్తరపువైపు తలపెట్టి నిద్రపోవుట :

ఉత్తరపు వైపు తలపెట్టి నిద్రబోతున్న జంతువునుగాని, మనిషి తల గాని నరికి వినాయకుని మొండానికి అతకడంలో దాగిన సత్యమేమిటి ? ప్రతికర్మకు తూర్పుకి తిరగండని అంటూ ఉంటారు. ఉత్తరంవైపు పడుకోవద్దని అంటారు. ఉత్తరంగా తిరిగి తినినా, నిద్రబోయినా నాడులద్వారా విద్యుత్ప్రవాహం మిక్కిలి వేగంగా ప్రసరిస్తుంది. బ్రహ్మాండంయొక్క నడక ధ్రువంవైపు ఉండడంచే ధ్రువంయొక్క ఉనికి ఉత్తరదిక్కుగా ఉన్నందువల్ల బ్రహ్మాండంలో ఉన్న భూగోళంలో ప్రవహించే విద్యుత్ప్రవాహం దక్షిణం నుండి ఉత్తరపువైపునకు ప్రసరిస్తోంది. కాబట్టి వద్దన్నారు.

ముందుగా గణపతిని ఎందుకు పూజించాలి ?

శబ్ద కల్పద్రుమంలో సూర్యుణ్ణి, గణపతిని, దేవిని, రుద్రుణ్ణి, కేశవుణ్ణి అన్ని శుభకర్మాలలోను పూజించాలని నియమం. "ఆదిత్యం గణనాథం చ దేవీం రుద్రం చ కేశవం పంచ దైవతమిత్యుక్తం సర్వ కర్మసుపూజయేత్"

పంచభూతాలకు పంచ దేవతలు అధిపతులు. "ఆకాశస్యాధిపో విష్ణురగ్నేశ్చైవ మహేశ్వరీ వాయోః సూర్యః క్షితే రీశో జీవనస్య గణాధిపతాః"

| మహాభూతములు | అధిపతులు | మహాభూతములు | అధిపతులు |
|---|---|---|---|
| (1) క్షితి (మట్టి) | శివుడు | (4) మరుత్ (వాయువు) | సూర్యుడు (అగ్ని) |
| (2) అప్ (నీరు) | గణేశుడు | (5) వ్యోమ (ఆకాశం) | విష్ణువు |
| (3) తేజము (అగ్ని) | శక్తి (మహేశ్వరి) | | |

శివుడు పృథ్వీ తత్త్వానికి అధిపతి కాబట్టే మట్టితో లింగాన్నిచేసి పూజిస్తారు. దీనినే పార్థివ లింగమని అంటారు. విష్ణువు ఆకాశానికి చెందినవాడు కాబట్టి, ఆకాశం లేకపోతే (అవకాశం) శబ్దం వినబడదు కనుక శబ్దాలద్వారా అతణ్ణి పూజిస్తారు. దేవి అగ్ని తత్త్వానికి చెందింది కనుక ఆమెకు అగ్ని కుండంలో హోమాలు చేస్తారు. గణేశుడు జలతత్త్వానికి చెందినవాడు కాబట్టి ముందుగా పూజలందుకొంటున్నాడు. మనుస్మృతిలో జలం నుండే సృష్టివచ్చినట్లుంది. ముందు నీటిని సృష్టించి అందు తన శక్తిని పరమేశ్వరుడు పెట్టినట్లుంది : "అప ఏవ ససర్జాదౌ తాసు బీజ మవాసృజత్"

సూర్యుడు వాయు తత్త్వానికి అధిపతి. ప్రాణ రక్షణకు నమస్కారాదులద్వారా పూజించాలి. పెద్దలను చూస్తే మన ప్రాణాలు పైకి పోతాయని, మనం నమస్కరించడం ద్వారా యథాస్థానానికి వస్తాయని ఒక శ్లోకంలో ఉంది. ఇక సూర్యుడు సమస్త జగత్తుకి ఆత్మఅని మంత్రం చెబుతోంది : "సూర్య ఆత్మా జగతస్త స్థుషశ్చ"

మంత్రయోగ సంహితలో సమస్త జగత్తు పంచభూతాలతో ఉందని, వాటికి సంబంధించిన దేవతలను పూజించాలని చెప్పబడింది.

"మానవానాం ప్రకృతయః పంచధాపరికీర్తితాః
యతో నిరూప్యతే సర్గః పంచభూతాత్మకైర్బుధైః
భిన్నాయద్యపి భూతానాం ప్రకృతిః ప్రకృతేర్వశాత్
తథాపిపంచ తత్త్వా నామానుసారేణ తత్త్వవిత్
ప్రత్యేక తత్త్వ ప్రాచుర్యం విమృశ్య విధిపూర్వకం
ఉపాసనాధికారస్య పంచభేద మవర్ణయత్"

వేద మంత్రాలలో 'గణానాంత్వా....' వంటి మంత్రాలుండటంవల్ల పూజించాలని చెప్పవచ్చు.

గణపత్య థర్వశీర్ష ఉపనిషత్తు - ఇతడు సర్వదేవతామయుడని ఇతన్ని పూజిస్తే అందర్ని పూజించినట్లేఅనీ చెప్పింది :

"త్వం బ్రహ్మంత్వం విష్ణుస్త్వం రుద్రస్త్వ మింద్రస్త్వ మగ్నిస్త్వం
వాయుస్త్వం సూర్యస్త్వం చంద్రమాస్త్వం బ్రహ్మ భూర్భువః స్వరోమ్"

ఇతణ్ణి పూజిస్తే సమస్త దోషాలనుండి, సమస్త విఘ్నాలనుండి, సమస్త పాపాల నుండి విముక్తులమౌతామని కూడా ఈ ఉపనిషత్తులో ఉంది.

"మహా విఘ్నాన్ ప్రముచ్యతే, మహా పాపాత్ ప్రముచ్యతే,
సర్వదోషాత్ ప్రముచ్యతే, స సర్వవిద్ భవతి"

సర్వ సృష్టి ఓంకారం నుండి రాగా ఆ ఓంకారం యొక్క వ్యక్త స్వరూపమే గణపతి కావడం వల్ల ఆ గణపతినే ముందుగా పూజించాలని తాత్పర్యం.

**కొన్ని ప్రసిద్ధ గణేశ నామాలు - విశేషార్థం :**

అన్ని దేవతలకూ చాలా నామాలు సమానంగా ఉన్నా కొన్ని కొన్ని నామాలు ఒక్కొక్క దేవతనే గుర్తు చేస్తాయి. ఇతర దేవతలకున్నట్లే గణపతికీ సహస్ర నామాలున్నాయి. అందుకొన్ని నామాలను, వాటి విశేషార్థాలను పరిశీలిద్దాం-

**(1) గణేశ :** "జగద్రూపో గకారశ్చ ణకారో బ్రహ్మవాచకః
తయోర్యోగే గణేశాయ నామ తుభ్యం నమో నమః"

- ముద్గల పురాణంలో - గణేశ స్తోత్రంలో

జగద్రూపము 'గ'కారమని, 'ణ'కారము పరబ్రహ్మ వాచకమని ఈ రెంటి కలయికయే గణేశుడని అర్థం. మరొక నిర్వచనం :

"జ్ఞానార్థవాచకో గశ్చణశ్చ నిర్వాణ వాచకః
తయోరీశం పరంబ్రహ్మ గణేశం ప్రణమామ్యహం"

'గ' జ్ఞానార్థమును, 'ణ' కారము మోక్షమును సూచిస్తుంది. రెంటికే ఈశుడు గణేశుడు.

బ్రహ్మ వైవర్త పురాణంలో కొన్ని నామాలకు వివరణ స్పష్టంగా ఉంది.

**(2) ఏకదంతుడు:** ఏక శబ్దము ప్రధానమనే అర్థాన్ని, దంత శబ్దం బలాన్ని సూచిస్తుంది. మొత్తం బలశాలి.

"ఏకదంతః ప్రధానార్థో దంతశ్చ బలవాచకః
బలం ప్రధానం సర్వ స్మాదేకదంతం నమామ్యహం"

ఈ ఏకదంతత్వము అద్వైతాన్ని సూచిస్తుందని మరొక వివరణ.

"ప్రాగ్ ద్వైతభ్రమ ఏవ భాతి నితరామ ద్వైత మేవాం తత
ఏత ద్బోధయతే రదో గణపతే రేకత్వ మే వాశ్రయం"

చంద్రునిపై దంతాన్ని విసిరి వేయడం వల్ల ఏకదంతుడయ్యాడని పురాణాలు చెప్పగా అథర్వ శీర్షోపనిషత్తులో ఏక అనగా మాయయని, దంతమనగా దానికి ఆధారమని చెప్పబడింది.

**(3) హేరంబ :** హే అను అక్షరం దీనుడనే అర్థాన్ని, రంబ అనే పదం పాలించువాడనే అర్థాన్ని సూచిస్తుంది. భక్తులను పాలించువాడని అర్థం.

"దీనార్థవాచకో హేశ్చ రంబః పాలన వాచకః
దీనానాం పాలనం తంచ హేరంబం ప్రణమామ్యహం"

మరొక నిర్వచనం :

హేరు ద్రసమీపే రంబతే తిష్ఠతీతి హేరంబః వ రుద్రుని ప్రక్కనే ఉంటాడు కనుక హేరంబడు. ఋగతౌ, హేరతే వర్ధయతి; భక్తాని తివా వ భక్తులను సంపద, సమృద్ధులతో నుంచువాడు.

**(4) విఘ్ననాయక :** విఘ్న శబ్దం విపత్తిని, లేక అమంగళాన్ని, నాయక శబ్దం ఖండనను, లేదా అపహరణను సూచిస్తుంది. విఘ్నములను పోగొట్టువాడు.

"విపత్తి వాచకో విఘ్నో నాయకః ఖండనార్థకః
విపత్ఖండన కర్తారం నమామి విఘ్ననాయకం"

**(5) లంబోదర :** వ్రేలాడుతున్న కడుపు కలవాడు, విష్ణువిచ్చిన నైవేద్యాలవలన, శివుడిచ్చిన మృష్టాన్నాల వలన లంబోదరుడయ్యాడు.

"విష్ణుదత్తైశ్చ నైవేద్యైర్యంస్య లంబోదరం పురా ।
పిత్రా దత్తైశ్చ వివిధైర్వందే లంబోదరం చ తం" ॥

అతనిలో ఈ అఖండ విశ్వం అంతా ఉందని ఇది సూచిస్తోందని అథర్వ శీర్ష ఉపనిషత్తు.

ఇక బ్రహ్మ పురాణంలో గణపతి పార్వతి స్తన్యాన్ని పూర్తిగా త్రాగివేశాడని, కార్తికేయునకు ఏమీ మిగల్చలేదని, నీవు లంబోదరునిగా ప్రసిద్ధి పొందుతావని శంకరుడన్నట్లు చెప్పబడింది.

"పపౌస్తనం మాతురథాపి త్రప్తో యో భ్రాత్ర మాత్సర్య కషాయ బుద్ధిః
లంబోదరస్త్వం భవ విఘ్నరాజ లంబోదరం నామచకారం శంభుః" - బ్ర.పు. 114.11

**(6) శూర్పకర్ణ :** చేటలవంటి చెవులు కలవాడు. చేట, పొల్లును చెరిగివేసినట్లుగా భక్తుల విఘ్నాలను చెల్లాచెదరు చేయువాడు. వివిధ ఐశ్వర్యాలను ప్రసాదించేవాడు.

"శూర్పాకారౌ చ యత్కర్ణౌ విఘ్నవారణ కారణౌ
సంపదౌ జ్ఞాన రూపౌచ శూర్పకర్ణం నమామ్యహం"

**(7) గజ వక్త్ర :** ఇతని తలపై మునిద్వారా ఈయబడిన విష్ణు ప్రసాద రూపమైన పుష్పం విరాజిల్లుతోంది.

"విష్ణు ప్రసాద పుష్పంచ యన్మూర్ధ్ని మునిదత్తకం
తద్ గజేంద్ర వక్త్ర యుక్తం గజ వక్త్రం నమామ్యహం"

**(8) గుహాగ్రజ :** కార్తికేయునికంటే ముందు పుట్టినవాడు అని షష్ఠీ తత్పురుష సమాసం చెప్పవచ్చు. గుహుడు అగ్రజుడుగా కలిగినవాడని బహువ్రీహి సమాసం చెప్పవచ్చు కాని ముందే ఇతడు పుట్టినట్లు పురాణాలలో ఉంది.

"గుహస్యాగ్రే చ జాతోఽయమావిర్భూతో హరాలయే
వందే గుహాగ్రజం దేవం సర్వ దేవాగ్ర పూజితం"

**(9) గజానన లేదా ద్వైమాతుర :** ఒకనాడు ఇంద్రుడు పుష్పభద్రానదీ తీరంలో రంభతో స్థల జల క్రీడలలో మునిగి ఉండగా దుర్వాసో మహర్షి వచ్చి నారాయణుడిచ్చిన పారిజాత పుష్పాన్ని ఇంద్రునికిచ్చి ఇది సమస్త విఘ్నాలను పోగొడుతుందని చెప్పినా ఇంద్రుడు వినకుండా ఐరావతం తలపై ఉంచాడు. ఇంద్రుని సంపద పోయింది. రంభ విడిచి పెట్టింది. ఐరావతం అరణ్యాలనుబట్టి అక్కడున్న ఆడ ఏనుగులతో విహరించింది. కొంత కాలానికి అక్కడ ఉత్తరపు దిక్కుగా తలపెట్టి నిద్రబోతున్న ఏనుగు తలను శ్రీహరి ఖండించి ఇతనికతికాడు.

ఇట్లా పార్వతి ఒక తల్లి, రెండవది ఆడ ఏనుగు ఒక తల్లి అయింది కనుక ద్వైమాతురుడు లేదా గ కారము గమనాన్ని (లయను) జ కారము ఉత్పత్తిని సూచిస్తుంది. అట్టి తత్త్వము ఆననము (ముఖము)గా కలవాడు.

"సర్వం జగదిదం త్వత్తో జాయతే, సర్వం జగదిదం తత్తస్తిష్ఠత

సర్వం జగదిదం త్వయి లయమేష్యతి" - గణపత్యథర్వశీర్ష.

**(10) వక్రతుండ :** మాయ వక్రంగా, దుస్తరంగా ఉంటుంది. అట్టి మాయను తన తుండంచే నాశనము చేయువాడగుటచే వక్రతుండుడు.

"మాయా భ్రాంతికరీ జంతోర్వక్రాసం కథితా మునే ।

తుండేన తాం నిహంతీహ తే నాయం వక్రతుండకః ॥

వక్రమనగా తెలియరానిది. వక్రరూపములైన విఘ్నాలకు అధిపతి కావడంచేత వక్రతుండుడై విఘ్నేశుడగుచున్నాడు. కంఠము క్రిందనుండి మాయతో కూడింది. తల మాత్రం బ్రహ్మను సూచిస్తుంది.

"కంఠాధో మాయయా యుక్తం మస్తకం బ్రహ్మవాచకం ।

వక్రాఖ్యంయేన విఘ్నేశ స్తేనాయం వక్రతుండకః" ॥

తుండంతో ఆశ పుట్టించు సాధనాలను నిర్మూలిస్తాడని అందువల్ల వక్రతుండుడని అథర్వ శీర్ష ఉపనిషత్తు.

**(11) వినాయక :** తండ్రి లేకుండా పుట్టినవాడని వామన పురాణం చెప్పగా, భవిష్య పురాణం, దేవతలను, ప్రజలను సన్మార్గమున నడపువాడని చెప్పింది.

"నాయకేన వినాదేవి భూయోపి పుత్రకః

యస్మాజ్జా త స్తతో నామ్నా భవిష్యతి వినాయకః - శివపురాణం 33.72.7

**(12) విఘ్నరాజ :** అథర్వ శీర్షంలో - భక్తుల విఘ్నాలను పోగొట్టేవాడని, సేవించని వారికి విఘ్నాలను కలిగించేవాడని అర్థం చెప్పబడింది.

**(13) సిద్ధిదాత :** చాలా కాలం నుండి మన వర్ణ సమామ్నాయం సిద్ధి అని పిలువబడుతోంది. సిద్ధం నమః అని అక్షరాభ్యాసం చేస్తున్నాం. తమిళనాడులోకూడా ఇతణ్ణి పూజించి దిద్దుతారు. మహాభారత లేఖకుడుగా ప్రసిద్ధిని పొందాడు కదా ! అక్షర జ్ఞానాన్ని కలిగించేవాడని, సమస్త సిద్ధులను ప్రసాదించేవాడని అర్థం.



# మన హైమమ్మ - త్రివేణి సంగమం

- ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం

హిమం అంటే మంచు, హేమం అంటే బంగారం. హైమ సార్థక నామధేయ. హైమ అంటే చల్లని తల్లి - బంగారు తల్లి (పసిడి వన్నె సజీవ శిల్పం). హైమ అంటే పరికిణీ, ఓణీ వేసుకుని మువ్వల పట్టాలు ధరించిన అమ్మాయి కాదు; అమ్మ; మాతృతత్వం - మధురత్వం. కనుకనే సోదరులు ఎక్కిరాల భరద్వాజ, షేక్ మస్తాన్........ లను కన్న బిడ్డలుగా లాలించింది.

"ఉన్నది ఉన్నట్లుగా కనడమే లోచూపు" అని అన్నది అమ్మ. ఆ దృష్టితోచూస్తే 'రాధ అంటే ఆరాధన' అనే అమ్మ నిర్వచనానికి సాకార రూపం హైమ దివ్య స్వరూపం. అమ్మనే ధ్యానించింది. అమ్మలో చేరాలని తపించింది, సాధించింది. "అమ్మా ! నీలోకే వస్తున్నాను' అంటూ మహాభినిష్క్రమణం చేసింది. కనుకనే భద్రాది తాతగారు 'తనలో జేరెడు మంత్రమేదయిన ఉద్ఘాటించెనే మాత ? నాకును బోధింపుము భక్తవత్సలి ! పరాకున్ జెంద నీకేల ?' - అని ప్రశ్నించారు హైమను.

తత్త్వతః కళంకరహితంగా తన మనస్సును జగన్మాతకు అర్పించుకున్న కన్యకా పరమేశ్వరి హైమవతీశ్వరి. బ్రహ్మచర్యానికి నిర్వచనం హైమ సాధనా మార్గం. ఆంజనేయస్వామి బ్రహ్మచారి అని అంటాం. వివాహం చేసుకోకపోవడం బ్రహ్మచర్యం కాదు. బ్రహ్మపదార్థంలో నిరంతరం ఎవరి మనస్సు సంచరిస్తుందో వారు బ్రహ్మచారి. కనుకనే అష్ట భార్యలతో ఉన్నా శ్రీకృష్ణుని బ్రహ్మచారి అని అన్నారు. "పెళ్ళిలో పెద్దపులి లేదు" అనే అమ్మ ప్రవచనసారం ఇదే.

**"క్షణశః కణశశ్చైవ విద్యాం అర్థంచ సాధయేత్**
**గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్"** అనే ఆర్షోక్తి హైమ విషయంలో వాస్తవం.

జగన్మాత ఉద్దేశపూర్వకంగా సృష్టించిన ఆణిముత్యం, అనన్య సామాన్య ప్రేమ తత్వం- మానవ కోటికి ఆదర్శమూర్తిమత్వం, విశ్వశ్రేయస్సాధనకై అమ్మ వెలిగించిన కర్పూరదీపం, 'ఆత్మవత్ సర్వభూతాని' అనే గీతాచార్యుల ప్రవచనానికి ప్రత్యక్షరూపం - హైమ అపురూప రూపం. యోగ పరంగా అవలోకిస్తే హైమవతీశ్వరిలో గణపతి, సుబ్రహ్మణ్యేశ్వరస్వామి, ఆంజనేయస్వామి వార్ల మహిమాన్విత సమ్మేళనం-త్రివేణీ సంగమంగా గోచరిస్తుంది. 'యోగం' అంటే కలయిక, జీవుని దేవుని కలయిక. అదే స్వస్వరూప సందర్శనం.

**ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహవేదీత్ మహతీ వినష్టిః ।**
**భూతేషు భూతేషు విచిత్య ధీరః ప్రేత్యాస్మాత్ లోకాత్ అమృతా భవంతి ॥**

'ఎవడు ఇక్కడే (ఈ లోకంలోనే) సాక్షాత్కరించుకొంటాడో వానిదే నిజమైన జీవితం... ప్రతి ప్రాణిలోను ఆత్మను కనుగొన్న ధీరులు ఇహలోకాన్ని వీడి అమరులవుతారు.'

- అష్టావక్ర సంహిత

సుబ్రహ్మణ్యేశ్వరుడంటే పాము అని కాదు; వేదములు అంటే ఇష్టపడువాడు అని అర్థం. 'షట్చక్రాయనమః' అనీ, 'ప్రాణాయామ పరాయణాయనమః' అనే నామాలతో వారిని పూజిస్తాం. షట్చక్రాలంటే మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, అజ్ఞాచక్రాలు. మూలాధార చక్రంలో సర్పాకృతిలో ఉంటుంది కుండలినీ శక్తి.

గణపతి మూలాధార చక్రానికి అధిష్ఠాన దైవం. కనుక సిద్ధి వినాయకుని అనుగ్రహం వలననే కుండలినీ జాగరణం సాధ్యం. మరి వినాయకుడు అంటే హైమక్కయ్య కదా ! పార్వతీదేవి ప్రాణ ప్రతిష్ఠ చేసిన పిండి బొమ్మ పార్థివమైనది. ఆ బొమ్మను పరమేశ్వరుడు గజాననునిచేసి దైవత్వాన్ని ఇచ్చి గణాధ్యక్షుని చేసిన వృత్తాంతము తలచుకుంటే హైమాలయ ప్రాదుర్భావం మన కళ్ళముందు సాక్షాత్కరిస్తుంది.

గుంటూరులోనే హైమ తుదిశ్వాస విడిచింది. అమ్మ హైమకు పునఃప్రాణప్రతిష్ఠచేసి, కుండలినీ శక్తిని జాగృతం చేసి సహస్రారానికి చేర్చినట్లు మనకు నిదర్శనం చూపింది. "హైమ మనకు దారి అనుకొని నామం చేయండి. ఇది తపస్సాధకులకు నిలయం అవుతుంది" అని మోక్ష సాధనకు చక్కని రాచబాటను ఏర్పరచింది అమ్మ.

ఈ సందర్భంగా యోగ ప్రక్రియలకు కొంత వివరణ ఇవ్వాలి. మనలోని ఉచ్ఛ్వాస, నిశ్వాసలు అనియంత్రిత చర్యలు. మన ప్రమేయం లేకుండా జరుగుతాయి అవి. శ్వాసను నియంత్రించడమే యోగాభ్యాసం. దాని వలన మనస్సు స్వాధీనమౌతుందని, ఏకాగ్రత కలుగుతుందని, సమాధి స్థితి సిద్ధిస్తుందనేది యోగ సాధనా మార్గం. ఇందుకు సూర్యభేద, చంద్రభేద, అగ్నిసార, భ్రామరి వంటి ప్రక్రియలను పేర్కొన్నారు. కుండలినీశక్తి షట్చక్రాలని దాటి సహస్రారంలో ప్రవేశిస్తే అమృతత్వసిద్ధి లభిస్తుంది.

అమ్మ యోగాభ్యాసానికి చక్కని ఆచరణ యోగ్యమైన విధానాన్ని బోధించింది. మనలోని శ్వాసను గమనిస్తూ ఇష్ట దైవ నామాన్ని అనుసంధానం చెయ్యమంది. క్రమేణా నామం లయం అయిపోయి మనస్సు నిశ్చలస్థితికి వస్తుంది.

మరి ఆంజనేయస్వామి విషయానికి వద్దాం. మొదటిసారిగా ఆంజనేయస్వామినిచూచి, ఆయన మాటలు విన్న శ్రీరాముడు

"నానృగ్వేద వినీతస్య నాయజుర్వేద ధారిణః
నా సామవేద విదుషః శక్యమేవం విభాషితుమ్"

ఆంజనేయస్వామి చతుర్వేద పారంగతుడు, నవ వ్యాకరణ పండితుడు అని కీర్తిస్తాడు.

**అణోరణీయన్ మహతో మహీయాన్ ఆత్మాస్య జంతో ర్నిహితం గుహాయామ్ ।**
**తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతు ప్రసాదాన్ మహిమానం ఆత్మనః ॥**

'అణువుకన్న సూక్ష్మమై బ్రహ్మాండంకన్న పెద్దదైన ఆత్మ ప్రాణుల హృదయాలలో ఉంటుంది. ఆత్మ మహిమను - నిష్కాముడై, నిర్మలమైన మనస్సు గలవాడు, వీతశోకుడైనవాడే తెలిసికొంటాడు.'

– కఠోపనిషత్తు



ఇహైవ తైర్జితః సర్గో ఏషామ్ సామ్యే స్థితం మనః;
నిర్దోషమ్ హి సమం బ్రహ్మ తస్మాత్ బ్రహ్మణి తే స్థితః

'ప్రస్తుత జీవితంలోనే వారు సర్గను జయించారు, వారి మనస్సులు సామ్యంలో దృఢంగా నిలిపివుంచారు; బ్రహ్మం అన్నిటా సామ్యం గలది, అపరిపూర్ణతారాహిత్యమైనది. అందువల్లనే వారు బ్రహ్మంలో ప్రతిష్ఠితులైనారు.'

\- భగవద్గీత

## తత్త్వమర్థస్వరూపిణి - 100

తత్త్వతః చూస్తే ఇంద్రజిత్ బ్రహ్మాస్త్రం అనే అసురశక్తి వలన రామలక్ష్మణులనే దైవశక్తి మూర్ఛపోతే పవమాన సుతుడు నాడులలోని ప్రాణరూపమైన వాయువుల చలనాన్ని క్రమబద్ధీకరించడమే సంజీవనీ ఔషధ ప్రయోగం-తద్వారా రామలక్ష్మణుల పునరుజ్జీవనం అని తెలుస్తుంది. పవనం (గాలి) అంటే శరీరంలోని ప్రాణాపాన వ్యానోదాన సమాన వాయువులు. సోదరులు షేక్ మస్తాన్ వంటి అనేకులకు హైమమ్మ అమృతమే పోసి బ్రతికించింది.

ఈ విధంగా మనం సోదరిగా భావించే హైమలో ముగ్గురు దేవతా మూర్తులు మనోజ్ఞంగా సాక్షాత్కరిస్తారు.

కోదండరాముడు మూర్తీభవించిన ధర్మం అయితే మన హైమతల్లి మూర్తీభవించిన సాధన. ధ్యానంలో మనస్సు నిలవడం లేదని, ఏకాగ్రత కుదరడం లేదని, బాధపడేది. వాస్తవానికి ఆ బాధే తపస్సు. దీనినే తైత్తరీయోపనిషత్ 'సత్‌తపస్తప్త్వా'' అని వర్ణిస్తుంది.

సాధన అనేది నిరంతరాయంగా సాగేది. ఒకసారి విశ్వ విఖ్యాత గాన సరస్వతి లతామంగేష్కర్ విదేశాల్లో పర్యటిస్తోంది. ఒక పాత్రికేయుడు ఆమెతో మాట్లాడాలని అందుకు సమయం కావాలని అర్థించాడు. మర్నాడు ఉదయం 6 గంటలకు - అంటే తాను పూజ చేసుకునే సమయం అన్నది. 7 గంటలకు అని అడిగితే అదే సమాధానం; 8 గంటలకు, 9 గంటలకు అన్నా అదే సమాధానం. ఆయనకు విసుగెత్తి 'మీరు చేసే పూజ ఏమిటో !' అన్నాడు. ''సంగీత సాధన'' అని బదులిచ్చింది ఆమె.

హైమను యోగీశ్వరేశ్వరిగా యోగులు మాత్రమే దర్శించగలరు. ''హైమ ప్రేమకు మన ప్రేమకు పోలిక ఏమిటి ?'' అనే అమ్మ ప్రశ్నలోనే హైమ ఔన్నత్యం సువిదితం. కనుకనే హైమ అంటే ..........

మార్దవం - ఆర్ద్రత<br>
మమకారం - నైర్మల్యం<br>
పవిత్రతీర్థం - మోక్షద్వారం<br>
ఆప్తబాంధవి - అశ్రిత కల్పవల్లి

అనంత వాత్సల్య రసామృతమూర్తి - నిర్వ్యాజ ప్రేమాకృతీ, ఆదరణ ఆప్యాయతలకు నవీనకృతి.

మనం హైమాలయంలో అడుగుపెట్టగానే పాలరాతి హైమమ్మ దర్శనం ఇస్తుంది మేనుకు మనస్సుకు హాయిగా. హైమాలయం వంటి దేవాలయం నభూతో న భవిష్యతి. రెండు చేతుల్లోనూ చిన్ముద్రతో విరాజిల్లే ఆ దేవత అద్వైతసిద్ధికి ఆలవాలం, దక్షిణామూర్తి తత్త్వానికి నిలయం. ఆ విధంగా హైమత్వాన్ని, హైమతత్వాన్ని దర్శించగల మహద్భాగ్యం ఎన్నటికో ! అందుకు మనం హైమమ్మ అనుగ్రహం కోసం ప్రార్థించాలి.



# భగవదారాధనకు దేవాలయాలు దివ్య సాధనాలు

- శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శంకరాచార్యస్వామి

భగవంతుని స్మరణ మనజీవితంలో ఎన్ని గంటలు, ఎన్ని నిమిషాలు లభిస్తుందో, మనకున్న ఆయుష్షులో ఆ భాగమే సార్థకమైన జీవితం. మామూలుగా మనకు అనవసరమైన మాటలు, అనవసరమైన తలపులు ఎక్కువగా వస్తుంటవి. భగవంతుడు మనకు కొంత ఆయుష్షు ఇచ్చాడు గదా-ఇందులో భగవత్ స్మరణతో ఎన్నిగంటలు గడచినవి అని మనస్సులో వివేచనం చేసి ఆలోచిస్తే మనకు శాంతి కలుగుతుంది. లౌకిక విషయాలు, నానారకాలైన యితర విషయాలను గురించి ఆలోచించునప్పుడల్లా, ఏదో ఓ ఉద్వేగమో, తాపమో, మోహమో, కామమో, భయమో కలుగుతుంది, భగవత్ స్మరణ చేస్తే శాంతం తప్ప మరొకటి కలుగదు.

అందరికీ కుటుంబభారం వుంది. భార్యాపిల్లల్ని, పెద్ద వాళ్ళయిన తల్లిదండ్రుల్ని రక్షించాలి. ఇదంతా భారమే. ఇందుకని మనం అనేక విషయాలను గురించి మాట్లాడాలి. అనేక ఆలోచనలు, పనులు చేయవలసిన అవసరం అందరికీ వుంది. అయితే, ఇవి ఎంతవరకూ అవసరమో, అంతవరకు నిర్వర్తించి, మిగిలిన అవకాశాన్ని భగవత్ స్మరణతో గడపాలి. మనము ఇతర కార్యాల్లో నిమగ్నులమైనపుడుకూడా భగవన్నామస్మరణో, రూపస్మరణో చేయవచ్చు. భగవత్ కథా కథనాన్ని గీతలో చెప్పినట్లు-

"కీర్తయంతః బోధయంతః కథయన్త శ్చ మాం నిత్యం"

పలువిధాలుగా జేయవచ్చు, కాని భగవంతుని స్మరణకు మనకు అసలు అవకాశం చిక్కడం లేదంటున్నాము, ఆత్మ వివేచనం చేసికొని, ఆత్మ శోధనం చేసికొని నిజంగా భగవత్ స్మరణకు అవకాశం కలగడంలేదేమో చూడండి. ఆ విధంగా ఆత్మ వివేచనం చేసికొంటే భగవంతుడే మనకు పరిపూర్ణమైన అవకాశం ఇస్తాడు. భగవంతుడే మనల్ని తలుచు కుంటాడు. అందు వల్ల అతని స్మరణం ఎంత కాలం మన జీవితంలో వుంటుందో అంత కాలం మన జీవితం సార్ధకమవుతుంది. అవసరమైనంత వరకు, అత్యావశ్యకమైనంత వరకు కుటుంబ పోషణ చేసుకోవటం నియమంగా పెట్టుకుంటే, ముప్పాతిక మాటలు, ముప్పాతిక పనులు అనవసరమై పోతాయి. కుటుంబాలలో వున్నవారు, గృహస్థాశ్రమంలో వున్నవారు, చిన్న చిన్న వృత్తులు చేసుకొనువారు అనేకమంది, అటు మహారాష్ట్రం లోను, ఇటు దక్షిణ దేశంలోను, ఇతర దేశాలలోను కూడా మహాభక్తులు, మహాజ్ఞానులు అయినారు. వారికి ఆ అవకాశం పరిపూర్ణంగా దొరికింది, అయినా, మనకు అవకాశం లేనే లేదంటున్నాము, కాని పాపసంపాదనానికి మాత్రం అవకాశం కల్పించుకుంటున్నాము.

శరీరం బాగా వుండాలని, ఆరోగ్యం బాగావుండాలనీ ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాం. కాని అదేమి బాగా లేదు. భగవత్ స్మరణ చేతనే ఆరోగ్యమైన, కుటుంబపోషణమైనా కొంతకు కొంత జరుగు తున్నది.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,**

**తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహం"**

శాంతమైన వాడికి యోగక్షేమం బాగా జరిగిపోతుంది. శాంతంతో భగవత్ స్మరణ చేసుకుంటే యోగక్షేమంలో లోటు అతడే తొలగిస్తాడు. మనసులో లోటు అనే భావన కూడా రాదు. భగవత్ స్మరణ కలిగింది కదా అని శాంతం కలుగుతుంది.

పిల్లలకు, పెద్దలకు, అందరికీ భగవత్ స్మరణ కలగాలనే ఉద్దేశం తోనే దేవాలయాలు నిర్మింపబడినవి. బస్సులోనో, రైలులోనో, వెళ్తూ కనకదుర్గ దేవాలయాన్నో, మంగళగిరి గోపురాన్నో, అమరావతి ఆలయాన్నో చూసి, గుర్తించినందువల్ల ప్రజలకు అప్రయత్నంగా నైనా భగవత్ స్మరణ కలిగే అవకాశం ఏర్పడుతున్నది. అందువల్లనే మన పూర్వీకులు ధర్మాలన్నింటిలో దేవాలయ నిర్మాణ ధర్మమే చాల ఉత్తమమైన ధర్మమన్నారు. దేవాలయాన్ని చూడగానే ఇదొక గొప్పకట్టడం-ప్రపంచమంతా సృష్టి చేసిన వానికోసం కట్టిన ఇల్లు ఇది-అనే స్మరణ కలుగుతుంది. ఉత్తమమైన దేవాలయ ధర్మం శాశ్వతంగా వుండేది. ఎంత శాశ్వతమైన వస్తువులతో ఆలయ నిర్మాణం చేస్తున్నామో, ఆ ఆలయం అంతకు అంత శాశ్వతంగా కోట్ల కొలది జీవులలో తక్షణం భగవత్ స్మరణను కలుగజేస్తున్నది.- అసలు దేవాలయమే కనుక లేకపోతే దేవుడనే వాడొకడున్నాడని సాధారణంగా మనకు స్మరణకు రావడానికి అవకాశమే లేకపోతుంది.

ఉత్తరదేశంలోనూ, దక్షిణదేశంలోనూ దేవాలయాలు కొల్లలుగా వున్నవి. కాశీలో వేలకొద్దీ దేవాలయాలు వున్నవి. అదేవిధంగా దక్షిణంలో కంచిలో కూడా వున్నవి. ఒరియా దేశంలోని జాజిపురిలో కూడా దేవాలయాలు మిక్కుటంగా వున్నవి. తంజావూరు, కుంభకోణంలో ఎన్ని దేవాలయాలు ఉన్నవో, ఒక్క జాజిపురిలో అన్ని వున్నవి. జాజిపురి వైతరిణీ నదీ తీరంలో వుంది. ఇది పూర్వం కాశీరామేశ్వర మార్గంలో వుండేది, రైలువచ్చాక ఆమార్గాన ఇపుడు ఎవరూ వెళ్ళటం లేదు .

అడుగడుగుకూ యిన్ని దేవాలయాలు ఎందుకు కట్టించారు? పనికి మాలినవని - అవి పాడయిపోతాయి కదా అని అడుగవచ్చు. డబ్బువుంటే, ఈవిధంగా ఖర్చుచేయకుండా. ప్రాణులకు ఉపకరించేపని మరేదైనా చేయకూడదా? అని అడగవచ్చు. మనకే ఆవిధంగా తోస్తుంది కూడాను.

మనకు బట్టకావాలి, ఇల్లుకావాలి, అన్నంకావాలి, వాహనంకావాలి, ధన, కనక, వస్తువాహన సమృద్ధిరస్తు అని. "వాహనం - ఛాయ - వస్తువు - తోయం - వసనం - అశనం - తేషు ఆసక్తకం", ఇవన్నీ అందరికీ అవసరమే. మనము ఏ తంటాలు పడినా, ఇవన్నీ ఎవరో ఒకరు ఇస్తున్నారు. ఒక్కమెతుకు, ఒక్క అరటిఆకు, ఒక్కవిస్తరి మనం చేయగలమా? ఎవడో ఒకడు చేసి ప్రకృతిలో మనకు ఇస్తున్నాడు. మన శక్తికి మించిన శక్తిసంపన్నుడు ఎవడో ఒకడు ఇస్తున్నాడు. అశనం, వసనం, తోయం ఎవరివద్దనుండి వస్తున్నవో, ఎక్కడ నుంచి వస్తున్నదో మనకు తెలియదు. కాని, ఎవరో ఒకరు సిద్ధంచేసి - క్రిమికీటకాదులు లగాయతు మానవులవరకు కావలసిన సర్వం అందిస్తున్నాడు.

ప్రభుత్వం ప్రజలకు నీరు సరఫరాచేయాలంటే ధవళేశ్వరంవద్ద పెద్దలాకులునిర్మించి మెట్టభూములలోనికి కూడా నీరు పారేటట్లు ఏర్పాటు చేశారు. ఈ కార్యనిర్వహణకు వలసిన సిబ్బందినీ, గ్రామకరణాలు మొదలైన

వారిని నియమించారు. అందుకు మనం ప్రతిప్రయోజనంగా. కృతజ్ఞతతో నీటి తీరువ కడుతున్నాము. మనకు ఇతర విధాలైన కష్టాలు వచ్చినపుడు చెప్పుకోవలసినవస్తే, పోలీసువారికి చెప్పుకోవడం కద్దు. అందుకని పోలీసువారికి రెవెన్యూ శిస్తుమూలంగా కొంత ముట్టజెబుతున్నాం. కృతజ్ఞత చూపక ఇలాంటిపన్నులు మేము ఇవ్వమంటే వారు బలాత్కారంచేసి తీసుకువెళ్తారు. అయితే, ప్రజలు పన్నులు చెల్లిస్తున్నారు. కదా, వారికి న్యాయం చేకూర్చాలి, అనేభావం ప్రభుత్వానికి కూడా వుండాలి, ఇల్లుకడితే ఇంటిపన్ను, డబ్బు నిల్వచేస్తే ఆదాయం పన్ను - ఇలాగు ప్రతిదానికి - మనకొక ప్రయోజనం కలిగితే, ప్రతి ప్రయోజనాన్ని మనం న్యాయంగా, కృతజ్ఞతతో చేయాలి. ఇవన్నీ న్యాయంగా చెల్లించకపోతే, వారు బలాత్కారంగా లాక్కుపోతారని ఇస్తున్నామనుకోండి. అది వేరే విషయం.

ఇటీవల మూడుసంవత్సరాలు వర్షాలుపడని కారణంగా ప్రజలు త్రాగడానికి కావలసిననీరు లేదనీ ఇంజనీర్లు ప్రకటన చేశారు. గీతలో భగవంతుడు **"అహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామిచ"** నేనే వర్షాన్ని పంచిపెడుతున్నాను అని సెలవిచ్చాడు. అతడు వర్షం ఇస్తే ఇంజనీర్లు నీరు వచ్చినపుడు ఆనకట్టకట్టి దానిని అందరికీ అందజేస్తున్నారు. మన శక్తికి మించిన శక్తి ఉపకారం చేయడంవల్లనే ప్రజలు జీవిస్తున్నారు. మనం తినేతిండి, కూరగాయలు-అన్నీ మనశక్తికి మించిన చోటునుంచి వస్తున్నవి. అవి తిని మనం బ్రతుకుతున్నాం. ఆ అనంతమైన శక్తులు భగవంతుని యొక్క సంకల్పం చేత మన కుపకరిస్తున్నవి.

ఉదాహరణకు ఒక రాజో, ప్రెసిడెంటో, వున్నాడనుకుందాము. ప్రతి దేశంలోనూ ఇలాంటి అధిపతి వున్నాడు. పేరుకైనాసరే, ఇప్పటికీ బ్రిటనులో రాజు అనే వాడొకడున్నాడు, అక్కడ ప్రజలు పన్నులను నేరుగా రాజుకిస్తామంటే వీలుకాదు. రాజ్యాధిపతి ఏ ఉద్యోగిని - ఏ మునసబును ఆ పనికి నియోగించాడో అతనికే ఆపన్ను చెల్లించాలి. అది ఒక క్రమపద్ధతిలో చివరకు రాజుకు అందుతుంది.

మనకు ఎండకావాలి, వర్షం కావాలి. చాలాకాలం వర్షం పడకపోతే నాస్తికులు కూడా మీ శాస్త్రంలో ఏమి చెప్పారో, అది చేయండి అని ఆస్తికులను అడుగుతారు. ఇంజనీర్లు కూడా ఆ విధంగానే అడుగుతారు.

ఆయామార్గాలను అనుసరిస్తున్న కారణంగా వరుణుడు, అగ్ని, పర్జన్యుడు, మొదలైన ముప్పై మూడుకోట్ల శక్తులు దేవతలనీ మనకు చెప్పారు. ఇదే విషయం గీతలో భగవంతుడు అర్జునుడికి చెప్పినపుడు - భగవంతుని ఆజ్ఞ చేతనే ఆ దేవతలు మనకు వర్షమిస్తున్నారు - ఎండ ఇస్తున్నారు - వారికే మనం ప్రతి ప్రయోజనం ఇచ్చుకోవాలి. దీనిని మనం తెలుసుకోవాలి. భగవంతుని ఆజ్ఞవల్ల, ప్రభుత్వ ఆఫీసర్లులాగా అనేక దేవతలు, దేవలోకాలు నియమింపబడ్డాయి. ఆ దేవత లను భావన చేసినపుడు "అగ్నిముఖావై దేవాః" అని హోమం చేసి "ఇదం న మమ" అని అంటున్నాం. ఈశ్వరునికి అభిషేకం చేసినపుడు కూడా, పాలు, పెరుగు, పండ్లు, నైవేద్యం వారికి అర్పణ చేస్తున్నాము, ఇలా అర్పణచేసిన దానిని కొన్ని కొన్ని చోట్ల తిరిగి పుచ్చుకొని తినడానికి తీసుకువెళ్తున్నారు. అప్పుడు "న మమ" అనే భావం అక్కడ లేదు. కాని, అగ్నిహోత్రంలో పడేసినది మీకు తిరిగిరాదు. "న మమ" అని ఇవ్వగా అది నిజమే అవుతుంది. నిజంగా మనం ఏ దేవతలను భావనచేస్తున్నామో అదికొంతైనా హోమం చేయాలి, అంతేకాదు, ఈశ్వరపూజలకు కూడా అంగంగా ఆలయంలో హోమాలు చేస్తారు. శైవ, వైఖానస, పాంచరాత్ర, ఆగమా లన్నిటిలోను పూజాంగ హోమం చేస్తారు. అప్పుడు 'న మమ' అనే భావంతోనే

హోమం చేయాలి. ఈశ్వరాజ్ఞచేత ఆఫీసర్లుగా అనేక దేవతలు ఎక్కడెక్కడ వున్నారో, హోమం చేయబడినది వారికి అందాలని చేయాలి.

మనశరీరానికి ఎక్కడ నీరు తగిలినా, అది మనస్సుకు స్పర్శగా తెలుస్తున్నది. అదే విధంగా శరీరంలో ఇక్కడ ఉపద్రవం, ఇక్కడ సుఖం అని తెలుస్తున్నది. ఈశరీరం నఖశిఖపర్యంతం మనది అనే భావన ఎక్కడ సుఖం కలిగినా మనకు తెలుస్తున్నది. ఆవిధంగానే ప్రపంచములో ఎక్కడెక్కడ నీళ్ళు ఉన్నవో అన్నింట, ఒకచేతనుడు మనదీ అనే భావనతో వున్నాడు. అతనికి వరుణుడు అనిపేరు. అలా ఈశ్వరుడు అనుగ్రహం చేశాడు, ఆవిధంగానే అగ్నిదేవుడు, ఎక్కడ నిప్పువున్నా అవన్నీ తనశరీరమని అభిమానించివున్న చేతనుడు అగ్నిదేవుడు. మనం ఉపనిషత్తులో "దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యం" అని అంటాము. అందులో మనం అలక్ష్యంగా వుండకూడదు. ఏదేవునికి అర్పణచేసినా అంతర్యామిరూపేణా "జనార్దనః ప్రీయతాం" - "పరమేశ్వరః ప్రీయతాం" - అని ఆ ఒక్కడికే చేరుతుంది. ఈ అగ్నికి గాని, వరణునికి గాని, అర్పణ చేస్తున్నా మంటే "పరమేశ్వరం ప్రీణయామి" - ఇదంతా ఆ పరమేశ్వరునికి ఒక్కనికే చెందుతుంది. "సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" ఏఒక్కడి పేరైతే చివరి వాక్యంగా వుందో, ఆభగవంతుడు గీతలో ఏమిచెబుతున్నాడు? "తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః" అన్నీ ఎక్కడో బజారులో కొన్నాం అనుకో కూడదు. బజారులో వాడికి ఎవరు ఇచ్చారు? ఇది ఎక్కడ పుట్టింది? ఆ శక్తిని ఎవరు ఇచ్చారు? ఆ నీళ్ళు ఎవరు ఇచ్చారు? ఆ విత్తనాలు, చెట్లు ఎవరు సృష్టించారు? ఎవరు రక్షిస్తున్నారు? ఎవరు పాలిస్తున్నారు?

మనకు మించిన శక్తిలోనుంచి వచ్చేపదార్థాన్ని మనం పరిపూర్ణంగా అనుభవించి, - అన్నంగాని, పానంగాని, వస్త్రం గాని అనుభవించి వీనిని ఎవరు ఇచ్చారని ఆలోచించకుండా - ఎవడు ఇవ్వకపోతే లాక్కుపోతాడో వాడికి మాత్రం పన్నులు కట్టి, నిజంగా మన నిత్యావసరాలను ఎవరు ఇస్తున్నారో వారికి పన్నుకట్టకుండా వుంటే వాడు దొంగ అవుతాడు. దొంగ అని తక్షణం తెలిసి వాడికి శిక్షపడితే, వాడు మంచి పనులు చేసినప్పటికి కూడా వాడికి అనుగ్రహం కలగటానికి కారణం వుండదు. గవర్నమెంటువారికి, రాజకీయాలవారికి అపుడపుడూ మనం డబ్బు ఇచ్చుకుంటాము-అది భయంచేత ఇచ్చుకుంటాము. అనేక రకాల పన్నులు కట్టే మనం, అన్నింటికీ మించిన శక్తికి కృతజ్ఞతతో పన్నుకట్టవలసిన అవసరం వుంది. మనమలా చేయక ఏదో నిర్బంధం చేత, ఇది కట్టకపోతే ఏమినష్టం వాటిల్లుతుందో అని భయపడి పన్ను చెల్లిస్తే - అది కృతజ్ఞత కాదు. అలాంటి సందర్భంలో మనకు పాపపరిహారం కూడా కాదు.

మనకు కావలసిన ఆహారాన్ని ఎవరు మనకు ప్రసాదించారో మొదట వారికి నివేదన చేసి తరువాత మనం భుజిస్తాం, ఇంటిలో పెద్దవాళ్ళకూ, ముసలివాళ్లకూ, మొదట వడ్డనచేస్తాం, లేకపోతే వాళ్ళు అరుస్తారనీ, శాపంపెడతారని కూడా కొందరికిభయం. ఈవిధంగా కాకుండా కన్నతల్లి తనబిడ్డకు పిండివంటనో, భక్ష్యాన్నో ఇస్తే, "నువ్వుతింటేగాని నేనుతినను" అని ఆబిడ్డ తిరిగి తనతల్లికి ఇస్తే, ఆతల్లి, ఇతరులు ఎంత సంతోషిస్తారో వూహించండి. ఎదిగి పెద్దవాడయిన తరువాత అలా ఇవ్వడంలో లాభంలేదు. కేవలం అజ్ఞానదశలో వున్నపుడు ఇదంతా ఎవరు ఇచ్చారు అని యోచించి, అతనికి కొంతయినా పెడదాము - అని అనుకోవడంలోనే విశేషముంది.

మనపూర్వులు కూడా వైశ్వదేవంలో ఏలోకంలో ఎవ రెవరున్నారో, వారిని తలచి అన్నం పెట్టేవారు. ఈలోకంలో, కుక్కలు, నీచులు, చండాలురు, రాక్షసులు - అందరినీ తలచి కొంత అన్నం పెట్టేవారు గవర్నమెంటు వారు కాని, శ్వేతజాతీయులుగాని, పరస్పరంకూడి 'పార్టీ' లు చేసుకునేటపుడు ఎవరినో ఉద్దేశించి 'టోస్ట్‌ప్రపోజ్' చేస్తున్నారు. ఏమిటి దాని అర్థం? ఏ యే లోకంలో ఎవరెవరు కష్టపడుతున్నారో, వారందరినీ భావించి సుఖంగావుండాలని కోరుకోవడమే దాని అర్థం. అదే విధంగా వైశ్వదేవంలో సకల దేవతలకు కొద్దిగానైనా, సరే అన్నంపెట్టి, ప్రపంచమంతా శాంతంగా వుండాలని ప్రతిరోజూ కోరుకుంటూండేవారు.

మనం ఇల్లు కట్టుకోవడానికి ముందు దేవాలయం కట్టుకోవాలి. దేవాలయం కట్టుకోకుండా ఇల్లు కట్టుకుంటే అది ఒక దొంగతనం, ఎవనిశక్తితో నైతే మనం ఇల్లు కట్టడము కాని, తిండి తినడము కాని సాధ్యమవుతున్నదో, అతనికి మొదట నివేదనంచేసి, ఆ పిమ్మట మనం స్వీకరించాలి, ప్రతివారూ తమ ఇంట్లో పూజచేసి, దేవునికి అర్పణచేసి ఆ నైవేద్యాన్ని తీసుకొనడం మంచిది, అయితే ప్రపంచంలో మనకు అనేక పనులుంటవి, అందరూ ఇంట్లో కూర్చొని పూజలు చేస్తుంటే ప్రపంచంలో పనులు సరిగా జరుగవు. అందుకు సమిష్టిగా పూజచేయడానికి ఒక సాధనం. అదే దేవాలయం, అక్కడ విష్ణురూపంగానో, ఈశ్వరరూపంగానో, అమ్మవారి రూపంగానో, గ్రామరక్షా దేవతగానో - ఒక ఆలయనిర్మాణం-ఇలా అనేక ప్రకారాలుగా ఆగమ శాస్త్రంలో చెప్పబడివుంది. కొద్దిమందిని ఈపనులకు నియోగించాలి. గ్రామస్థులంతా కలసి, దేవాలయాన్ని నిర్మించి, అక్కడ ఒక అర్చకుణ్ణి ఏర్పాటు చేసి, అతని కుంటుంబ జీవనానికి, అతని పరార్థపూజకు (అతని స్వార్థపూజ వేరేవుంది) కావలసిన ఏర్పాట్లు చేస్తే ప్రజలందరూ కృతార్థు లవుతారు. కృతజ్ఞు లవుతారు.

మనం కట్టుకునే బట్టకంటే ఈశ్వరార్పణమైన బట్టశుచిగా వుండాలి. మనం తినే అన్నంకంటె దేవుని నైవేద్యం శుచిగా వుండాలి. మన కిపుడు రేషన్ రావడంతో, 'ఈశ్వరునికి ఆ నైవేద్యం మటుకు ఎందుకండీ?' అని తగ్గించి వేసే స్థితిలో కొచ్చాం, ఇదివరకు, నాకు జ్ఞాపక మున్నంతవరకు, రాత్రి కాలంలో కూడా, రాత్రిపూజ, అర్థయామ పూజ అని సుమారు తొమ్మిదిగంటల కొక పూజచేసేవారు. అపుడు గంటకొట్టేవారు. అది ఎందుకండి అంటే "ఈశ్వరుని పూజ అయింది-ఇక మనం భోజనం చేయవచ్చు" అని తెలుసుకోడానికి. ఆగంట వినకపోతే ఇంట్లో భోంచేసేవారు కాదు.

ప్రజలు అందరూ ఈవిధంగా వుంటే ఇపుడున్న దేవాలయాలు సరిపోతాయా? అతనికి అర్పణం కాకపోతే మనం భోజనం చేయకూడదనే భావన అందరికీ రావడానికి ఇంతకు వెయ్యి రెట్లు దేవాలయాలు కావాలి.

అతనికి వస్త్రం ఇవ్వకుండా, మనం వస్త్రధారణం చేయకూడదు, అందుకొరకు ఒకస్థానం. ఆస్థానంలో అతని సాన్నిధ్యం కావాలి. ఆ సాన్నిధ్యానికి ఒకశాస్త్రం, దానిని ఆగమం అంటాము. అతనికి ఇల్లు కట్టించాలంటే ఒకవిధానం. ఆవిధానాన్నికొక శాస్త్రం, దానిని శిల్పం అంటాము. అతనికి రోజూ పూజ చేయడానికి ఒక విధానం. అందులో ఉపచారం - అపచారం - ప్రాయశ్చిత్తం - అపచారానికి పరిహారం - ఇవన్నీ చేయించి అక్కడ సాన్నిధ్యం తగ్గకుండా చేయించుకొనడం మనందరికీ అవసరం. మనజీవనం జరగడానికే, ప్రతిక్షణం సావధానంగా మనకు అన్న, వస్త్ర, ఛ్చాయలు ఇస్తున్న ఈశ్వరుడు - అతని ఆజ్ఞ పరిపాలిస్తున్న దేవతలు-వారిని స్మరించి ఇవ్వడం - ఏదేవతకు అర్పించినా ఆపరమేశ్వరునికి ఇచ్చినట్లుగా భావించడం అవసరం. ఏయేస్థానంలో, ఏయేవిధంగా ఏయే దేవాలయం కట్టించాలో తెలిపేది ఆగమశాస్త్రం. మొత్తంమీద పసిపాపలు మొదలుకొని -

ఒక గోపురాన్ని చూసినట్లయితే, దేవుడు అని వారికి జ్ఞాపకం వస్తుంది. అందుచేత భగవత్ స్మరణకు దేవాలయం ఒకకారణ మయింది. ఆ దేవాలయం లేకపోతే మనం కృతఘ్నుల మవుతాము, మనం కట్టించకపోయినా, మనపెద్దలైనా ఒకదేవాలయం కట్టించారు గదా. అందులో మనకు తెలియకుండానే మన కుటుంబపు సొమ్ము, సొత్తు కలిసి వుందిగదా. మనం నేడు కృతఘ్నుల మైనప్పటికీ - మనపూర్వులు ఆ దేవాలయానికి అర్పణ చేసిన కారణంగా కొంతవరకైనా కృతజ్ఞత కలసివుంటుంది. ఈకారణంచేత నైనా మనం దేవాలయాలను రక్షించాలి. అదే మనకు ఈశ్వర స్మరణకావాలి. అది లేని దినం వ్యర్థం, జన్మవ్యర్థం, శాంతికి అవకాశం లేకుండా పుట్టి చావడంలో అర్థంలేదు. సదా రామకోటి వ్రాస్తూ, ధ్యానజపాదులలో నిమగ్నులైన మహనీయులు ఇంకా వున్నారు. వారందరూ పోతే ఈ ప్రపంచమే ఉండదు. ఇపుడున్న స్థితి ఇంతవరకైనా వుండదు. వారి సంగతి కాదు నేను చెప్పడం, అందరికీ భగవత్ స్మరణ కలగడానికి దేవాలయం ఉద్దేశింపబడింది.

భగవత్ స్మరణకలిగే క్షణమే మనకు శాంతిక్షణం. భగవత్ స్మరణకు దేవాలయం కారణం. అందువల్ల దేవాలయం కావాలి. దేవాలయ గోపురం, విమానం నిర్మాణశైలి కూడా సాన్నిధ్యం కలిగించేలా వుండాలి. దానికి శాస్త్రం సంప్రదించాలి. ఈ విధంగా ప్రజలకు భగవత్ స్మరణ తగ్గకుండా వుండడానికి మూలభూతమైన శాస్త్రములు తెలిసినవారు, నేటిరాజకీయ పరిస్థితులు, విద్యారీతులు, జీవనధోరణులు కారణంగా రానురాను తగ్గిపోతున్నారు. వారు ఎక్కడెక్కడ వున్నారో తెలుసుకోవాలి. ప్రాచీన తాళపత్ర గ్రంథాలు ఏవేవి వున్నాయి? అందులో ఏమివ్రాసి వుంది? అవన్నీ తెలుసుకోవాలి, ఇంకా పదిసంవత్సరాలు వూరుకుంటే - ఈ మిగిలినవి కూడా పోతాయి. వీటిని ఎరిగిన వారూపోతారు. అందుచేత వీటిని రక్షించడం మనకర్తవ్యం.

అసలువీటన్నింటికి మూలభూతుడు వ్యాసుడు. అతను పురాణాలు రచించాడు. వేదవిభాగం చేశాడు. వేదాంతానికి ఉపనిషత్తులు రచించాడు; బ్రాహ్మణేతరుడైన సూత మహర్షిచేత సూతపీఠస్థాపన గావించి అష్టాదశ పురాణప్రవచనం అతనికి ఒప్పచెప్పాడు. ఇతర ఋషులు ఎవరైనా సరే మొదట సూతునికి వందనంచేసి, అతనివద్దనుండి పురాణసాహిత్యాన్ని గ్రహించేట్లుగా వ్యాసుడు ఏర్పాటుచేశాడు. ఆ పురాణాలు పామరులకు మిక్కిలి ఉపయుక్తంగా వుండాలనే ఉద్దేశంతో వ్యాసుడు ఈవిధంగా ఇతర కులాలకు అధికారమిచ్చాడు. ఆదేవిధంగా రాజసూయ యాగంలో బ్రాహ్మణులు క్షత్రియులను గౌరవించే విధంగా వారికి ఉన్నతస్థానం ఇచ్చారు.

**నీతితో జీవించాలి :**

మనం చెడ్డపనులు చేయకూడదు, కొన్ని ధర్మాలు వున్నవి. సత్యం పలకాలి. అబద్ధాలాడకూడదు. ఒకరిని నిందించకూడదు. వ్యర్థంగా, అకారణంగా హింస చేయకూడదు. అపుడపుడు హింసచేయవలసిన అనవసరంవస్తుంది. అయితే మహాభారతంలో అర్జునుడు యుద్ధం చేసినట్లుగా న్యాయాధిపతి నేరస్థుణ్ణి శిక్షించితీరాలి. అతను శిక్షవేయక పోతే ప్రపంచంలో అక్రమం పెరిగిపోతుంది. అనవసరమైన హింసకూడదు గాని, కొన్ని సందర్భాలలో హింస చేయాలి. నిత్యజీవితంలో ఈవిషయాలన్నీ ఎలా తెలుసుకోవడం? చదివినందువల్ల వివేకం, జ్ఞానం వస్తవి అనుకుంటాము. కాని ఇది అనుమానాస్పదమైన విషయమే, ఎందుకంటే ఎక్కడైతే యూనివర్సిటీలు

ఎక్కువ వున్నవో, అక్కడే నేరాలుకూడ ఎక్కువగా వినపడుతున్నవి. చెంచులు, సవర్లు, ఆఫ్రికాదేశస్థులు నివసించే అడవులలో ఇక్కడున్నన్ని కోర్టులుగాని, కేసులుగాని కనబడటంలేదు. వాళ్లు కొట్టుకోవచ్చు తిట్టుకోవచ్చు. అంతటితో వాళ్ళ వివాదాలు నిలచిపోతున్నవి గానీ, ఇక్కడున్నంత కాపట్యము, ఫోర్జరీలు, అబద్ధాలు అక్కడ కనబడటం లేదు. అలాంటివి వారికి తెలియనే తెలియవు. మనకాపులకు, భూములలో పనిచేసేవారికి అసలు అబద్ధాలాడవలసిన అవసరమే లేదు. స్వాతంత్ర్య సముపార్జనం తరువాత మనదేశంలో అబద్ధమాడనివాడు లేకుండా పోయాడు. ఓటువేస్తానని లంచాలు తీసికొని అబద్ధాలాడటం ఈరోజులలో అందరికీ అలవాటయిపోయింది. ఇదివరలో, నాచిన్నతనంలో, ఎవరో కొందరు ఉద్యోగస్థులే లంచాలు పుచ్చుకొంటారని వినేవాళ్ళం. ఇప్పుడు ప్రతిఊళ్ళో, ప్రతిఉద్యోగికి అబద్ధాలాడటం అలవాటయిపోయింది. అబద్ధమాడటం తప్పు అనిభావించడానికి వీలుగా హరిశ్చంద్రనాటకం మనహృదయంలో జ్ఞప్తికి వస్తుంది. 'సత్యమే పలుకు' అని వేదంలో చిన్నమాట విన్న మరుక్షణం ఎక్కడికో పోతుంది. ఆ సందేశాన్ని నాటకంగా చూసిన ప్రజలలో స్థిరమైన ధర్మవివేచనం కలుగుతుంది. హరిశ్చంద్రుడు అనుభవించిన కష్టం అంతా ఇంతా కాదు- భార్యపోయినా, బిడ్డలుపోయినా, అవమానము వచ్చినా, దారిద్ర్య మొచ్చినా - ఎంత కష్ట మొచ్చినా నేను అబద్ధం చెప్పను, ఈప్రపంచం వచ్చినా, పోయినా, అబద్ధం చెప్పననే ఆదర్శపురుషుడు ఒక్కడైనా వున్నాడు- అని తెలుసుకొన్నప్పుడు ప్రజలలో దృఢమైన ధర్మబుద్ధి కలిగేది. సీత, సావిత్రి, వంటి పతివ్రతలకు, శ్రీరాముడు, హరిశ్చంద్రునివంటి వారి కొచ్చిన కష్టాలు చెప్పనలవికానివి. వీరి దివ్యచరిత్రలను ఇది వరకు చదివి తెలుసుకొనేవారు. నిరక్షరాస్యులు, వృద్ధులు, పాటకులు మొదలైనవారు ఈపుణ్యచరిత్రలను గ్రామాలలో చిన్న ప్రదర్శనలుగా కళ్ళారా చూసి ధర్మావలంబకు లయ్యేవారు.

ఇప్పుడేమో సినిమా ప్రదర్శనం వచ్చినది, వీటినిచూసి నప్పుడు హృదయంలో అధర్మాలే ఎక్కువవుతున్నాయి - అపమార్గబుద్ధే ఎక్కువవుతున్నది. పురాతన ప్రదర్శనలు సన్మార్గప్రబోధకంగా వుండి, హృదయానికి ఒక శాంతిని ధర్మబుద్ధినీ కష్టసహిష్ణుతనూ - ఏబడికి వెళ్ళనివారికికూడా ప్రసాదిస్తూ వుండేవి. నేటికి ఇన్నిసినిమాలు వచ్చినా, ఏ దేవాలయం వద్దనో, ఏదైనా ప్రదర్శనం ఏర్పాటుచేస్తే జనం సమకూడుతూనే వున్నారు. ఈజానపద ప్రదర్శనలను చూసి పూర్వం విద్యాగంధం లేనివారుకూడా ధర్మం గొప్పదనీ, అధర్మంగా వుండకూడదనీ, అధర్మపరులైన రావణుడు, హిరణ్యకశిపుడు మొదలైనవారు విశేష ఐశ్వర్య బల సంపన్నులయికూడా చివరకు అన్ని విధాలా నష్టపడ్డారని తెలుసుకొనేవారు.

ఇదివరలో నేను దేశాటన చేసినపుడు అనేకచోట్ల పరంపరానుక్రమంగా వస్తున్న వివిధజానపదకళా ప్రదర్శనలను గమనించాను. నేడు వేదం చెప్పుకొనేవారు. స్మార్తం చెప్పుకొనేవారు, తగ్గినట్లుగానే ఆ కళాకారులుకూడా తగ్గిపోతున్నారు. మరొక ముప్ఫయి సంవత్సరాలు గడిస్తే ఇంట్లో శుభకార్యం చేసుకోడానికి పురోహితుని వెతుక్కోవలసి వస్తుంది. అదేవిధంగా ఈ ప్రదర్శనలుకూడా క్రమేణ తగ్గిపోతున్నాయి. పూర్వంనుంచి ఈ ఆగమశిల్ప కళలను నమ్ముకొని వున్నవారికి తమ హయాములోనే ఈ విద్యంతా పోనివ్వము అనే ఆలోచన కలుగకుండా, వారు తమపిల్లలను, ఏదో జీవనానికి కక్కుర్తి పడి, కాలేజీ చదువులలోకి దించకుండా - వారు ఆయా వృత్తులను అభ్యసించేందుకు కావలసిన పరిస్థితులు కల్పించి, వారిని గౌరవించ వలసిన బాధ్యత మనపై వుంది.

కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వము ఇప్పుడు సంగీతనాటక అకాడమీలు స్థాపించారు. అందులో సంగీతము, నృత్యము. నాటకమునకే వారు సహాయం చేస్తారు. ఈ మూడింటిచేత ఆత్మగుణ వృద్ధికంటె దుర్గుణవృద్ధి ఎక్కువవుతున్నది. దానికేవారు సహాయం చేస్తున్నారు. ఇటీవల సినిమాలకు కూడా ప్రైజులు ఇస్తున్నారు.

సినిమా ప్రదర్శనలు చిత్తాన్ని కలుషితంచేసి, కామం, మోహం, అసత్యం, మోసం మొదలైనవాటిని హృదయంలో నెలకొల్పుతున్నవి.

కాని వాటికే ప్రభుత్వాదరణ లభిస్తున్నది. చదువు రానివారికి, బిడ్డలకు, వృద్ధులకు, ఏ అక్షరం తెలియనివారికి, ధర్మంలో స్థిరమైన బుద్ధి - అది వారుచేసినా చేయకపోయినా - కనీసం ఇది ధర్మం - ఇది అధర్మం అనే వివేచనవారికి కలుగజేయడానికి ఏ ప్రయత్నమూ జరగటం లేదు. సినీమాలు వచ్చిన తరువాత ధర్మాధర్మ వివేచనం కూడా లేకుండా పోతున్నది. అధర్మమే ధర్మమనే భావన కలిగే అంతటిస్థితికూడా వచ్చింది. పూర్వం అలాకాదు - ఇది ధర్మం - చేయదగినది - ఇది అధర్మం - చేయకూడనిది - ఇదే మనకృతార్థత, చరితార్థత అనే భావనవుండేది. అలాంటి స్థితికి కారణమైన కళలు, విజ్ఞానాలు, ప్రదర్శనలు, వంశపారంపర్యంగా అభ్యసిస్తున్నవారు వాటిని వీడకుండా చూడవలసిన బాధ్యత ఇదివరలో రాజులయొక్క ధర్మంగా వుండేది. ఇపుడు రాజులు లేరు. అందరూ రాజులే - మనమందరము రాజులమే. ఇలాంటి పరిస్థితిలో మనమే పూనుకొని - ముఖ్యంగా మనం రక్షించాలంటే దేవాలయాలనే రక్షించాలి. దేవాలయాలను రక్షించే శాస్త్రాలను తెలుసుకొని, ఆ శాస్త్రాలను రక్షించి, వారికొక స్థానమిచ్చి, గౌరవమిచ్చి, ఆ వంశంలో వుండే కుర్రవాళ్ళని సాధ్యమైనంత వరకు ఈ విద్య లోపించకుండా వుండడానికి ప్రోత్సహించి ఇదే విధంగా పల్లెలలో చదువురాని ప్రజలలో ధర్మవృద్ధి కలిగేటటువంటి ప్రదర్శనలు ఏవివున్నవో వాటిని ప్రోత్సహించి పరంపరగా దేవతాసన్నిధిలో వారు ఏమిచేస్తుండేవారో అది కొనసాగించటం చాలా ముఖ్యమని. మిగతా ఏవీ అంతముఖ్యం కాదని నాకుతోచింది.

ఎవరైనా ఆనందగజపతి రాజులాంటివారు వుంటే నేను ఇదంతా వారికి చెప్పవచ్చు. ఇప్పుడు ఎవరికి చెప్పుకోవడం? అందువల్ల అందరూ ఇందుకు పూనుకొని, ఏదోపల్లెలో ఒక పాకలోవుండి, శాస్త్రం తెలిసివున్నవాడిని పిలిపించి, వాడికొక స్థానమిచ్చి ఒకరినొకరు తెలుసుకునే సందర్భం కలుగజేస్తేనే వారికి సంతోషంగా వుంది. వారిని మనం ప్రార్థించి, ఆచరించాలి. అదేవిధంగా గ్రామాల్లోవున్న చిన్నచిన్న కులాలవారికి పెద్దచదువు, ఐశ్వర్యం లేకపోయినప్పటికీ పరంపరగా వస్తున్న భగవత్ స్మరణ సంధాయకములు, ధర్మ ప్రబోధకములైన విద్యలు, కళలు, శాస్త్రాలను పేరుకైనా, పోషించే ఉద్దేశ్యంతో సంవత్సరాని కొకతూరి సమీకరించమని మిమ్మల్ని కోరాలి అనుకొన్నాను. ఇప్పుడు కోరుకున్నాను.

నమః పార్వతీపతయే.



# శక్తి

- కీ॥శే॥ రామరాజు కృష్ణమూర్తి

సృష్టి అనాది, నాది అంటుంది అమ్మ. పైగా - 'సృష్టిసహజం; ఆశక్తికి ఇదంతా ఇట్లా ఐపోవడం సహజం. ప్రథమంలో స్పందన కలిగినపుడు ఎవరెవరినడకలు వారికేర్పడినయ్ - ఆస్పందన అనేక రూపాలై కూర్చుంది. పువ్వువిచ్చిన తర్వాత తెలుస్తుంది కానీ ఎట్లా విచ్చుకుందో తెలీదు. జరిగేటప్పుడు తెలీదు. జరిగిన తర్వాత తెలుస్తుంది. స్పందన కనబడదు' - అంటుంది అమ్మ.

అలాగే అమ్మను ఓనాడు యీ సృష్టి సైన్సు చెప్పినట్టు పరిణామ సిద్ధాంత ప్రకారం ఏర్పడిందా? లేక అంతా ఒకేసారి వచ్చిందా? అని అడిగితే - అపుడు శ్రీపాద గోపాలక్రిష్ణమూర్తి గారు అమ్మ మంచం దగ్గరే కూర్చొని ఉన్నారు. వారి కండ్లలో ఉత్సుకత తోచింది. అమ్మ చల్లగా చెప్పింది - అంతా ఒకేసారి వచ్చిందని. పైన చెప్పినట్టు ప్రథమంలో స్పందన కలిగినప్పుడే ఎవరెవరినడకలు వారికేర్పడినయి, అప్పుడే సర్వజ్ఞులు, అజ్ఞానులు, మంచిచెడూ, విధానాలు సమస్త ప్రాణికోటి అన్నీ ఏర్పడినయి. అంతే కాక "ఆది" ఏర్పడింది.

కాకపోతే - తెనాలిలో రిక్షాలో వస్తుండగా అమ్మ, రవి, హైమ - రిక్షావాడు దారి తప్పించి వూరుదాటించాడు. సంజచీకట్లు కమ్ముకుంటున్నాయి. కొంతదూరం పోనిచ్చి ఆపాడు. రోడ్డు ప్రక్క పల్లపు ప్రాంతంలో నలుగురున్నారు వీడి మనుష్యులు - వాడికది రివాజు, రిక్షా అటుగా తేవడం అంతా పడిదోచుకోవడం. అమ్మ అన్నది నాన్నా ఇటు తెచ్చావేం, ఊరు కాదుగా అంటూ మెల్లగా మెడలో గొలుసు కావాంటే ఇచ్చేదాన్నిగా ఇంత శ్రమపడ్డావేం - వాడికి ఏమీ పాలుపోలే. పల్లం నించి వాడి మనుష్యులు లేచే లోపు, నిర్మానుష్యమైన ఆ దారిన ఏమిరా సుబ్బయ్యా ఇటు వచ్చావేం అని అమ్మ అనగానే ఓ బలిష్టమైన ఎత్తైన విగ్రహం చేతిలో కర్రతో ప్రక్కనిలచి ప్రత్యక్షం - రిక్షావానితో ఇటు తెచ్చావేరా అమ్మను తీసుకుపో, వెనక్కు ఇంటికి అనడం సాధికారమైన శాసనంఐ రిక్షా వెనుతిరిగింది. పల్లాన ఉన్న వారికి ఏదో భీతి కలిగి ఆ విగ్రహాన్ని చూడంగానే కదలలేకపోయారు. అకస్మాత్తుగా అంత విగ్రహం ఎట్లా తయారు, వస్త్రధారణ, మాటలు, పెద్దమర్యాదా!

అలాగే వంట యింటిలో సరకు కావలసివచ్చింది. జనం వొచ్చారు. భోజనాలు సిద్ధపరచాలి. ఎవరూ వెళ్లేవారు లేరు. ఓ రెండెడ్ల బండీ పై కావలసిన వస్తు సంబారం యావత్తూ ఫలానా అంగడినించంటూ, వివరాలతో పంపినవారి పేరుతో చీటీ పుచ్చుకొని బండివాడు సరకులు లోపల వేసి చూచుకోమని చెప్పి బండివాడు అటువెళ్లిన కాసేపటికి చీటీలోని వ్యక్తి లోపలకు అడుగుపెట్టాడు. ఏం అన్నయ్యా నీవు పంపిన సరకు సమయానికి చేరింది అన్నారు అంతా. ఆయన ఆశ్చర్యంగా ఇదేమీ నేనెరుగను, ఇప్పుడే రైలు దిగి బస్సులో వస్తున్నానన్నారు. మరునాడు పనికట్టుకొని వెళ్లి విచారిస్తే ఆ అంగడి వారేకాక ఏ అంగడి వారూ బండికాసామాన్లు ఎత్తలే, కాగా ఏడవమైలు నించి కాక ఇంకా సమీపం నించే బండివాడు, బండితో పాటు సరకులు, ఎద్దులు సృష్టించబడి చీటీతోపాటు

తయారించగా దిగుమతిఐంది. అన్నీ పరిణామక్రమానికి ఎదురుతిరిగి అప్పటికపుడు తయారై చర్యలకు చాలా సహజంగా పొదిగినవి! బండివాడు అనుసరించవలసిన పద్ధతి ఆచరించవలసిన రీతీ అంతా అందులోదే!

అలాగే పంచదార ఐపోయింది. వచ్చిన వారికి కాఫీలోకి పంచదార కావాలి. అమ్మకు చెప్పారు. కనుక్కోండి మనవాళ్ల దగ్గర ఎవరి దగ్గరన్నా ఉందేమో అని విచారిస్తుండగా ఓ ఆసామి మానెడు పట్టే డబ్బా పంచదార తెచ్చి ఇచ్చి మాట్లాడి వెళ్లాడు. అనుమానం వచ్చి ఇరవైముప్పైమంది వెంటనే నాలుగు చెరుగులకు పరుగులు తీసి వెదికారు. ఆ కవళికలు కలవ్యక్తిని ఎవరూ చూడలేదన్నారు. ఆ డబ్బా మాదికాదంటే మాదికాదన్నారు. మనిషి తయారు వేరే సంగతి పంచదార ఎక్కడినించీ అని?

అలాగే మెడిసిన్ చదువుతున్న ఆడపిల్లలు అమ్మను చూడటానికి వచ్చి మాట్లాడి ఏడో మైలుకు వచ్చి బస్సు కోసం సాయంత్రం నించీ వేచివేచి చీకట్లు పరుచుకునేవేళ నిర్జనమైన ఆ ప్రాంతాన తామొక్కరమేననే భయం కలుగగా దిక్కుతోచక ఏడుపు లోకిదిగారు. చీకట్లు చిక్కపడ్డవి. వెనుతిరిగి జిల్లెళ్లమూడి ఊళ్లోకి పోదామన్నా భయం - అక్కడే వుండటానికీ భయం - ఎవరైనా ఏమైనా చేస్తారేమోనని భయం.

ఇక్కడ అమ్మచుట్టూ జనం, చర్చలు, అమ్మ మాటలు వింటూ అందరూ ఆనందంగా. అమ్మ మెల్లగా అట్లా కారులో తిరిగివద్దామన్నది. జనం సద్దుకున్నారు. మందయానఐ చల్లగావస్తుంది అమ్మ. అక్కడవారికి క్షణక్షణం భయం ఎక్కువైతున్నది. అందులో డబ్బుకూడా, ఆ చిన్న హాండ్‌బ్యాగ్ కూడా అమ్మ దగ్గరే మరిచారని దగ్గర పైసా కూడా లేదని తెలిసింది. పరిస్థితి భయంకరంగా తయారైంది. ఇద్దరూ సన్నగా ఏడుస్తున్నారు. ఇంతలో అమ్మ కారులోంచి దిగింది. పెద్దగా బావురమన్నారు. తేరుకొని నీవు నీజంగా దేవుడి వన్నారు. దగ్గర పైసా కూడా లేదన్నారు. ఫరవాలేదని వెంట ఉన్నవారిని మీ దగ్గర డబ్బేదన్నా ఉంటే ఇవ్వమన్నది. అందరూ పర్సు తెచ్చుకోలేదన్నారు. డ్రైవరును అడగమంది. డ్రైవరు అసలు పైసా కూడా జేబులో లేకుండా వచ్చానన్నాడు. 'చూడు నాన్న' అంది. అప్రయత్నంగా అతని చేయి జేబులోంచి కొత్త నోట్లు కొన్ని తీసి అతనినే ఆశ్చర్యం లోకి జార్చినయి. వారిని ఆ కారులో బాపట్ల చేర్చి రెపరెపలాడే నోట్లు ఇచ్చి పంపింది అమ్మ! ఆ నోట్లు తయారీ ఎక్కడో!

అయినా సృష్టి ఒక్కసారిగా తయారించడం శ్రీపాద వారికి గుటక పడలా. ఇది వారికి సంబంధించిన విషయం కానట్టు పెడగా కూర్చున్నారు. అది వారి అలవాటు. కానీ ఇందులో ఆశ్చర్యపడవలసిన పనికనబడలా. రామకృష్ణ పరమహంస వివేకానందుల వారి ఇంటికి సరకులు నెత్తిన పెట్టుకొని పోయి ఇచ్చి వచ్చారు. మరొకసారి డబ్బు సంచీ పోగొట్టుకొని ఆత్మహత్యకు తలపడ్డ కుర్రవానికి డబ్బు సంచి ఇచ్చారు. ఇంతెందుకు శాలివాహనుడో - మట్టి బొమ్మలను కదనరంగానికి దూకించలేదా? మరొకసారి కలియుగే ప్రథమ పాదే అనగానే అమ్మ 'ప్రథమ పాదం లేదు నాన్నా. చివరి పాదం ముప్పాతికపైనే అయిపోయిందని;' మరొకసారి 'యుగాంతంలా ఉందని' చెప్పింది. కనక ఆది ఉన్న ఈ సృష్టి అమ్మకు ఆట, యీ ఆట ఓ దశకు చేరింది.

అటు సనాతనులు, ఇటు విజ్ఞానయుగం వారు సమాధానపడలా అమ్మ మాటలకు. అసాధ్యాన్ని సాధ్యం చేసేది ఆధ్యాత్మిక శక్తి అనే అమ్మ దయగా ఇంతకూ ఉన్నది ఒక్కటే ప్రశ్న అసలేమిటి? అనేది - ఇంకొంచెం

వివరంగా పోతే అసలిదంతా ఏమిటి? అనేది. అంతకన్నా ప్రశ్న వేసుకోలేం. సైన్సు పదార్థంలోని శక్తి ని చూస్తుంది కానీ దైవం అనలేకపోతున్నది. అంతటా ఉన్న శక్తే భగవంతుడు. శక్తి కనబడదు. కనిపెడుతుంది. శక్తి అంటే అన్నిటికీ మూలమైంది - అంటూ శక్తిని వివరిస్తూ ప్రతిదాంట్లోనూ శక్తి ఉంది. కట్టెకు కాలే శక్తి ఉన్నపుడే, గిన్నెకు కాల్చుకునే శక్తి ఉన్నపుడే అన్నం ఉడకకల్గుతుంది. అంతటా ఉన్న శక్తి రూపాలను ఆధారం చేసుకొని చర్యలను నడుపుతోంది, చరిస్తోంది.

అమ్మ  ఇంకా ఇలా "శక్తిని గుర్తించడానికి రూపమే ఆధారం, చెప్పుకోడానికేగా ఆకృతి; అంతటా ఉన్న దైవం శరీరంతో రావడానికి కారణం అదే - తాను రాలేడా చెయ్యలేడా? అంటే చెయ్యగలడు కానీ గుర్తించేదెట్లా?" అన్నది.

అయినా శ్రీపాదవారు ఊర్కోలే - మరో ప్రక్కనించి మెల్లగా అమ్మ గదిలోకి వచ్చారు. అమ్మ కళ్లు తెరచినా ఎటో చూస్తోన్నట్టు, అసలు ఇక్కడ ఉందా లేదా అన్నట్టు చలనం లేకుండా పోతపోసిన విగ్రహంలాఅయి అప్పటికే కొన్ని గంటలు అయింది. చుట్టూ అంతా నిశ్శబ్ధంగా కూచొని ఉన్నారు. కొంతసేపటికి అమ్మ భోజనాలు చెయ్యమంది.

శ్రీపాదవారు అడిగారు చల్లగా "అమ్మా, అమ్మవు తానే అయివుండటాని కంటే లోకంవైపు చూడటానికి ఎక్కువకాలం ఖర్చౌతున్నదమ్మా" అంటే అమ్మ అన్నది -

"యీ వ్యాపారంలో లాభనష్టాలులేవునాయనా" - (ఔను అమ్మ అది ఇది అని వేరుగా అనుకుంటేగా) ఐనా శ్రీపాదవారు ఊరుకోలే - వెంటనే -

"నష్టమనికాదమ్మా - యోగులు సహజసమాధిలో ఉంటారంటారు. మేము కొబ్బరికాయలుకొట్టి, హారతులిచ్చి - మిమ్మల్ని మావైపు త్రిప్పుకొని ఆ కాలంలో సమాధి భంగం చేస్తున్నాం కదా" - అని.

అమ్మ నవ్వుతూ అన్నది " నేను మీలో నన్ను చూచుకోనప్పుడుగా చిక్కు" రెండుగా తోచని అమ్మ; ఇదంతా నేనే నాదే ననే అమ్మ, అవధిలేనిదే సమాధి అనే అమ్మ తిరిగి దయగా మరింత వివరిస్తూ అర్థం కావడానికి ఇలా అంది - రూపం పరిమితం, శక్తి అనంతం - అని - అమ్మ అన్నా అంతులేనిది అని ఇది వరకే చెప్పింది. రూపానికి హద్దు ఉన్నా; శక్తికి హద్దూపద్దూలేదు. శక్తి అనాది, నిత్యము, సత్యము, శాశ్వతము, శక్తికి ఆద్యంతమేమిటి?

ఒక చోట "వస్తు రూపం పురుషుడని, దానిలో ఉన్న శక్తి స్త్రీ అని రెండింటినీ విడదీయలేని స్థితే శ్రీ విద్య అని పుస్తకాలు చెబుతూనే ఉన్నాయి" అన్నారు చిదంబరరావుగారు. దానికి అమ్మ సమాధానం చెబుతూ "విడదీయలేని స్థితి కాదు, ఆరెంటి సంయోగంలో ఉండే సంధి కాలమే - అదే అవాఙ్మానసగోచర" మన్నది అమ్మ.

విడదీయలేని స్థితి కాదు అంటే విడదీయవచ్చు- "నాగేంద్రా నా కోసంవచ్చావా? నన్ను నీలో కలుపుకోవూ? కలుపుకుంటున్నావా? నీవెంత దయామయుడివి" అని పారవశ్యంలో కేకలు వేస్తూ నిలుచునే ప్రాణాలువదిలింది. ఆమెకు శిరోబేధనం అయి ప్రాణంపోయింది. ఆమెలో నించి ఏదో పోయింది. ప్రాణం లేకుండా పుట్టిన బిడ్డలో ఏదోలేదు. ఇక్కడ ఏదోపోయింది, అక్కడ ఏదోలేదు. రూపం ఉంది. కానీ స్పందన లేదు- చైతన్యం లేదు. అమ్మ మనల్నువదలి పోయిందంటే స్పందన లేదు. రూపం ఉంది. దాదాపు రెండేళ్లనించీ పోతానంటున్న అమ్మలో స్పందన పోతుందని తెలుస్తోంది - ఎవరికి - స్పందన అంటే కదలిక, చైతన్యం - హృదయస్పందనా - అమ్మలో మనపట్ల మాతృత్వప్రేమా, ప్రకటనలేదా? - ఉంది. ఇది మమతల గర్భగుడి అనలేదా? జూన్ రెండోతారీఖున అందరకు ఉత్తరాలురాయి నాన్నా రమ్మని ఓసారి చూచిపోతారు అనడంలో ప్రేమలేదా? అయితే మనకు అమ్మపట్ల భక్తి, ప్రేమ, యిష్టంతగ్గి స్పందన పోతుందా?

అసలు అమ్మకు స్పందన ఏమిటి? నిర్లిప్త, నిర్విచార, నిర్గుణ, నిరతిశయ ఐన అమ్మకు స్పందనేమిటి? ఏది నాలికమీద పెట్టినా రుచి తెలియని స్థితి, మధురసుధ ఇచ్చినా విషమిచ్చినా తాగే స్థితి, ఏదీ కావాలని లేని స్థితి, గుణబేధమే తోచని స్థితి, ఇదంతా తానే అనే స్థితికి స్పందన ఏమిటి?

అయితే మనలో స్పందన లేదా? భక్తిగా, ప్రేమగా అమ్మపట్ల - పరిమితులలో ఉన్నమనం, అజ్ఞానులమైన మనం; సంశయం భయంలో ఉండే మనం అమ్మ ఉనికికి, అమ్మకు మనపట్ల ప్రేమకు ఎలా కారణమౌతాం?

గుణ భేదమే లేకపోవడంలో అన్ని గుణాలకూ మూలం తానై అంటే త్రిగుణాలు, త్రికాలాలూ, త్రిమూర్తులు తానై, అవస్థాత్రయం లేనిదై, బాల్య యౌవ్వన కౌమార వార్ధక్య దశలులేనిదై అంతా తానై తెరలో తెరలువేస్తూ మరుపులేని మరుగై, విధై, ప్రేరణై, రెండై, రెంటిమధ్యసూక్ష్మమైన సంధై, సృష్టి స్థితి లయాలకు కారణమై, ఆధారమై, స్పందనకు మూలమైన శక్తైన మాతృమూర్తికి స్పందన ఏమిటి? అంటే శక్తి శక్తిగా వ్యక్తంకావడమే. అంటే పరిమితులులేని, అవధులులేని సహజస్థితి. దాన్నే అమ్మ సహజసహనం, సమసమత్వం, సర్వసామాన్యం అని అంటుంది.

---

తనువెల్లన్ పులకాంకితంబయి మనః స్థైర్యంబు నీరై; గళం
బున డగ్గుత్తిక భారమై, కనుల నిర్ముక్తాశ్రు పూరంబు లు
ప్పెనలై, చేతులు సంభ్రమాతిశయ నిర్వీర్యంబులైపోవ, నిన్
మనసారంగని మ్రొక్కుభాగ్య మిడుమమ్మా! జన్మ ధన్యంబగున్.

- కీ॥శే॥ డా॥ నోరపరాజు శ్రీధరరావు

# సర్వ నివేదన

- కీ॥శే॥ కొండముది రామకృష్ణ

(మాతృసంహిత నుండి)

1980 మే 20వ తేదీ, తొమ్మిది గంటలయింది. గగన తలంలో నీలనీరదాలు మందగమనం చేస్తున్నాయి. అక్కడక్కడ నక్షత్రాలు మెరుస్తున్నాయి. మంటలగాలులు విలయంగా వీస్తున్నాయి. అందరి శరీరాలూ మూడు రోజుల నుండీ కాస్తున్న ప్రపంచాగ్ని తీవ్రతకూ, వీస్తున్న వడగాలుల తాపానికీ తుకతుక ఉడికిపోతున్నాయి.

అమ్మ గదికి ఉత్తరంగా సంగీత కళాకారులూ రసజ్ఞులయిన కొద్దిమంది శ్రోతలూ ఆసీనులై ఉన్నారు. వాద్యాలు సిద్ధమై ఉన్నాయి. మైకు సెట్టు అమర్చబడి ఉంది. టేపు రికార్డరు ఆయత్తమై ఉంది.

1938 మే 5న అమ్మ వివాహమయింది. ఇపుడు జిల్లెళ్ళ మూడిలో ప్రముఖంగా జరిగే ఉత్సవాల్లో అమ్మ కల్యాణ దినోత్సవం ఒకటి.

ఈ సంవత్సరం ఆ ఉత్సవాల జాబితాలో మరో పండుగ చేర్చబడింది. అది పెండ్లి పదహారురోజుల పండుగ. ఈ ఉత్సవం జరుపు కొందామని సోదరుడు శ్రీ కాసు రాధాకృష్ణరెడ్డి సూచనచేస్తూ... ఆనాడు తాను అమ్మ - నాన్నగార్లకు పూజచేసుకుని, 'స్వర నివేదన' చేసుకుంటానని తన అభీష్టాన్ని అభివ్యక్తం చేశాడు.

అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ చకచకా సాగాయి. తత్ఫలితంగానే విజయవాడ నుంచి ప్రఖ్యాత మృదంగ కళాకారులు శ్రీమహదేవు రాధాకృష్ణరాజు, సుప్రసిద్ధ వాయులీన విద్వాంసులు శ్రీకోటిపల్లి ప్రకాశరావు, ఏలూరు నుంచి కంజరీవాద్య నిపుణులు శ్రీమంతెన త్యాగరాజు వచ్చారు. బాపట్ల నుంచి సంగీత కళా కోవిదులు శ్రీశిష్టా సత్యనారాయణ రాజశేఖరం వారి శిష్యురాలు కుమారి జొన్నలగడ్డ రత్నమాల తంబుర మీటడానికి వచ్చారు.

అమ్మా నాన్నగారూ వచ్చి మంచంపై ప్రక్క ప్రక్కన కూర్చున్నారు. ముందుగా రాధాకృష్ణరెడ్డి అమ్మకూ, నాన్నగారికీ నూతన వస్త్రాలు సమర్పించి వారి గళసీమల మల్లికామాలలు వేసి అష్టోత్తర శతనామావళి చదువుతూ తమలపాకులతో పూలతో పూజ చేసుకున్నాడు. తర్వాత కళాకారులందరూ అమ్మను పూజించుకున్నారు.

అమ్మ అందరికీ నూతన వస్త్రాలు ప్రసాదించి ఆశీర్వదించింది.

రాగప్రస్తారం ప్రారంభమయింది. నాటరాగంతో కార్యక్రమానికి శ్రీకారం చుట్టాడు. రాధాకృష్ణరెడ్డి. ప్రారంభమే అనితరసాధ్యంగా మహోజ్వలంగా సాగింది. రాధాకృష్ణరెడ్డి గాత్రం అతి గంభీరంగానూ, అత్యంత మధురంగానూ నినదించింది. అప్పటిదాకా ఎంతో ఆసక్తితో ఎదురు చూస్తున్న గుండెలు ఒక్కసారిగా రసప్లావితమైనట్లు పులకించాయి.

అన్ని సంగీత కచ్చేరీలవలె రాధాకృష్ణరెడ్డి కృతులు గానం చేయదలుచుకోలేదు. రాగం, తానం, పల్లవితో రసవర్షం కురిపించాలని అతని అభిలాష. అతడు నాదోపాసకుడు; సంగీత తపస్వి, అమ్మయందు అచంచల శక్తి విశ్వాసాలు గల విశుద్ధ యోగి. అనుక్షణం అమ్మ నామ సంకీర్తనలో తన్మయమైపోయే రాగజీవి, రససిద్ధుడు.

ఆరితేరిన కళాకారులు గాయకుని మానసికగతి ననుసరించి అత్యంతోత్సాహంతో రసోత్పత్తికి ప్రయత్నం చేస్తున్నారు.

శ్రోతలు రసార్ద్ర మానసులై మైమరచిపోయారు.

గానలోల, సంగీతప్రియ, రాగమయి, నాదస్వరూపిణి, ఓంకార మూర్తి, వాగీశ్వరి అవతారం అయిన అమ్మ ప్రధాన శ్రోతయై రాధాకృష్ణ రెడ్డిపై వాత్యల్య పీయూషధారలు కురిపిస్తూ కూర్చున్నది.

ఆ అపురూప సన్నివేశం - గాంధర్వలోకమే భువికి దిగి వచ్చిందా అన్నట్లున్నది. ఆ సమయంలో 'రాధ'ను చూస్తే ఒక నారదుడు, ఒక తుంబురుడు, ఒక త్యాగయ్య, ఒక తాన్‌సేన్ - ఒకరేమిటీ? ..... అందరూ కలిసి ఒక ఆకృతి ధరించి అమ్మ సేవచేసుకుంటున్నారా - - అనిపించేటట్లు కనిపించాడు. అమ్మ ప్రసాదించిన ఆకుపచ్చ అంచుగల ఖద్దరూ ధోవతీ, ఉత్తరీయం పైన కప్పుకోగా వాటిపై అమ్మ అతణ్ణి ఆశీర్వదిస్తూ అలంకరించిన మల్లెపూలదండ సువాసనలు విరజిమ్ముతూ ఉంటే - అతని నిండయిన విగ్రహమూ, ఆ రీవీ సంగీతమే ఒక సమ్రాట్టు రూపం ధరించి రసరాజ్య ఆవిష్కరణకు పూనుకున్నదా - అనిపించింది. అతడు గళమెత్తి గానం చేస్తుంటే నాద తరంగాలు ఉప్పొంగినట్లున్నాయి. రసవృష్టిలో ప్రకృతియే వివశత్వం పొందింది. ఆ వాతావరణమంతా ఆనందమయమై దివ్యమై రాగమయమై రమణీయమై పోయింది. అందరి మనస్సులూ అనిర్వచనీయమైన ఆనందంతో మయూరాలై నర్తించాయి.

అతడు ఎవరికోసమో, ఎవరిని ఆనందపరచటం కోసమో పాడడం లేదు. తనకోసమే తాను పాడుకుంటున్నాడు. అతనికి అదొక సాధన. అదొక తపస్సు. అదొక ఆరాధన. అతని మనస్సు నుండి పై కుబికిన తీవ్రవేదన. అతని ఆరాధ్య దేవతకు స్వర నివేదన.

అతడు రాగాలాపన చేస్తుంటే - అతని రక్త మాంసాదులే రాగరూపం ధరించి అమ్మ అరుణ చరణ కమలాలకు అభిషేకం చేస్తున్నట్లూ పారాణి పెడుతున్నట్లూ ఉన్నది. అతని పంచప్రాణాలే సప్తస్వరాలై అమ్మను స్తుతిస్తున్నట్లు తోచింది.

అది స్వర నివేదన మాత్రమే కాదు. అతని సర్వ నివేదన; ఆత్మ సమర్పణ. అతనిలోని అణువణువూ స్వరంగా మారి 'హరి హర హిరణ్య గర్భ సంసేవిత దివ్యచరణా'ల మ్రోల మోకరిల్లటానికి తహ తహ లాడుతున్నట్లు కనిపించింది. ఒక్కోక్షణంలో అతడు స్వరాలతోనే తాదాత్మ్యం చెందుతున్నాడో, సర్వేశ్వరిలోనే ఐక్యం పొందుతున్నాడో - తెలియడం లేదు.

నాట, శ్రీరంజని, అమృతవర్షిణి, మోహన, భూపాల, బిలహరి.... ఎన్నో రాగాలు రసవీచికలై సాగాయి. 'ఇతర దైవమును వేడను ఇది నిజము నిజము...' అని జలదగంభీరమైన అతని గళం నుండి నాటరాగంలో వినిపిస్తుంటే అతని ప్రగాఢ విశ్వాసం ప్రస్ఫుటమవుతోంది.

శ్రీ రాధాకృష్ణ శర్మగారిచే రచింపబడ్డ అమ్మ అష్టోత్తర శత నామస్తోత్రం రాగమాలికలో అతి మనోజ్ఞంగా వినిపించింది.

తుది ఘట్టంలో అమ్మనామం గానం చేశాడు. ఆ గానం చేసిన తీరూ, ఆ రాగమూ, ఆ తాళమూ అనుపమానంగా సాగి శ్రోతల మనస్సులను దైవోన్ముఖంచేశాయి. వాద్యాలు పూర్తిగా సహకరిస్తూ వల్లభుని అడుగుజాడలలో నడిచే కులకాంతలనూ, ఆచార్యుని అనుగమనించే సచ్ఛాత్రులనూ, నాయకుని అనుసరించే సైనికులనూ స్ఫురింపచేశాయి.

రసవృష్టి ప్రభావం వలన మంటలగాలులు మలయ పవనాలై అందరినీ మైమరపింప చేశాయి. శ్రోతలు లోకాన్నీ కాలాన్నీ విస్మరించారు.

రాత్రి 1.30 ని.లకు నాదోపసంహారంచేసి రాధ అమ్మ పదపీఠిపై నతమస్తకుడైనాడు. కళాకారులందరూ అమ్మకు పాదాభివందనం చేసుకొని - తామందరూ కూడా మైమరచి పోయినామని నివేదించుకున్నారు. స్వరగంగలో సుస్నాత అయిన ప్రకృతి ప్రశాంతమై శీతలమైంది.

సభానంతరం అమ్మ కళాకారు లందరికీ తీయని మామిడిపండు ముక్కలు తన చేతిమీదుగా పెట్టి వారిచే తినిపిస్తూ.... "రాధ 1963లోనే ఇక్కడకు వచ్చినా, ఇంతవరకు నాకు 'యిది' కావాలి. అని అడగలేదు. ఈసారి ఈ వాద్యాలు పిలిపించండి; ఈ పూజ చేసుకుంటానూ - అని అడిగాడు. వాడికేం కావాలో వాడికే తెలీదు" అని అమ్మ అంటుంటే అమ్మకంఠం రుద్ధమై కన్నులు చెమ్మగిల్లాయి.

ఏ కళగానీ - ఏ విద్యగానీ - అవి మానవుణ్ణి ఆ కళలోనే, విద్యలోనో తాదాత్మ్యం చెందించి సర్వేశ్వర పాదాంకితం చేయగలిగిన నాడే - వాటికి పరిపక్వతా, పరిపూర్ణతా, పరమ ప్రయోజనమూ.

**ఆనాడట్టి దివ్య సన్ని వేశం ఆవిష్కృతమయింది.**
**రాగమయి అమ్మ; రాగసాధకుడు రాధ.**
**నాదస్వరూపిణి అమ్మ; నాదోపాసకుడు రాధ.**
**రసోదధి అమ్మ; రసతరంగిణి రాధ.**

**- కొండముది వారసులకు కృతజ్ఞతలతో**

# ప్రేమే అమ్మ

- రాచర్ల లక్ష్మీనారాయణ

1983-84 సంవత్సరంలో నాకు స్పాండిలైటిస్ వచ్చింది. ఎడమ భుజము, మెడ చాలా పోటుగా ఉండేది. మెడపట్టీ పెట్టాను. మందులు తిన్నాను. ఎన్నో చేశాను. రోజూ నావృత్తిపరంగా రెండువందల కిలోమీటర్లు తిరగాల్సిన అవసరంఉంటూ ఉండేది. పగలంతా తిరుగుతూ వుండేవాణ్ణి. రాత్రి వచ్చేటప్పటికి పోట్లు ఎక్కువయ్యేవి. కిందపడుకొని దిండులేకుండా ఒక దుప్పటి తలకింద పెట్టుకొని పక్కనే టేప్‌రికార్డర్ పెట్టుకొని అమ్మనామంగానీ,అమ్మసంకీర్తన గానీ వింటూ నిద్దరపోయేవాణ్ణి ఎప్పుడు టేప్ ఆగిపోయేది

ఇలాకొన్నాళ్లు గడిచింది. కానీ ఒకరోజు చాలా సివియర్‌గా పెయిన్. తట్టుకోలేనంతగావుంది. మూడు టేప్‌లు తిరిగిపోయినా నిద్దరరాలేదు. బాధను భరాయించటంకోసం, నిద్దరపట్టటానికి డాక్టర్లు పెయిన్‌కిల్లర్స్, నిద్రమాత్రలు సజెస్ట్ చేశారు. కానీ నేను అవికొనుక్కోలేదు. అవి అలవాటైతే తగ్గదేమో అనే భయంతో. ఆరోజు అనిపించింది- నిద్రమాత్రలు కొనుక్కున్నా బాగుండేది అని. ఈబాధ భరాయించే బదులు ఓ పాతిక ముప్పై నిద్రమాత్రలు మింగి ఈ తనువు చాలించివుంటే బాగుండేది అని. అలా అనుకొని అమ్మను తలచుకుంటూ పడుకున్నాను. అంతలోకి నిద్రపట్టింది.

తర్వాత ఆదివారం మామూలుగా జిల్లెళ్లమూడి జేరాను. అమ్మదగ్గర కూర్చొని ఉన్నప్పుడు - దీని వ్యవహారం నా మనసులో వచ్చిన ఆలోచనలు ఏవీ అమ్మకు చెప్పకుండా అమ్మతో అన్నాను - 'ఎప్పుడైనా ఏకారణంచేతనైనా, నేనేదైనా చేసుకుంటే నీవు అడ్డం రాకు' అని. కారణం ఏదైనా నిద్రమాత్రలు మింగిన నన్నుచూసి, హాస్పటల్‌కు తీసుకువెళ్ళి, కక్కించి నానాగందరగోళంపడి అవమానాలు పాలు కాకుండా, తనువు చాలించిన తరువాత ఎవరు చూచినా ఫర్వాలేదు అనే ఉద్దేశంతో.

"నువ్వెవరివిరా చెప్పటానికి, నే అడ్డం వచ్చేది వచ్చేదే" అంది.

"అలాగైతే ఈ శరీరంలో ఏఒక్క అవయవము అయినా - నీకుగానీ, నాకుగానీ, ఉపయోగపడక పోయినరోజున నన్ను నీలో కలుపుకో" అన్నాను.

అమ్మ నవ్వి ఊరుకుంది.

తర్వాత నా స్పాండిలైటిస్ తగ్గిపోయింది. హాయిగానే వున్నాను. కానీ 2000 సంవత్సరంలో ధర్మసూరి, భగవతి వాళ్లూ బెంగుళూరులోవుండగా సమ్మర్‌లో హాయిగా గడుపుదామని బెంగుళూరు వెళ్లాను. అక్కడికి వెళ్లిన వారం పదిరోజులకు 'వైరస్' అంటే సర్పివచ్చింది. మొహం నిండా సన్న సన్నని కురుపులు అద్దంలోకనబడ్డాయి. వెంటనే డాక్టర్ దగ్గరకు వెళ్లాను. ఇది సర్పి - అంటే ఇది అమ్మవారు, చిన్న అమ్మవారు, పెద్ద అమ్మవారు,

స్ఫోటకానికి, మీజిల్స్‌కు సంబంధించిన వ్యాధి ఇది. అయితే చాలా సివియర్ నొప్పివుంటుంది. తట్టుకోవటం కష్టంగా కూడా వుంటుంది అని సూచనప్రాయంగా చెప్పి సర్పికి మాత్రలు ఇచ్చారు. హెవీడోస్‌లో మాత్రలు వాడుతున్నాను. ఒకరోజు గడిచింది. రెండోరోజుగడిచింది. ఏమాత్రం నొప్పిలేదూ కానీ కంటిలోకూడా పోయటం వలన కంటిలోనుంచి నీరు కారుతుండేది. అట్లా ఐదారురోజులు గడచింది. మనసుకు చిలిపి ఆలోచన వచ్చింది. డాక్టర్ వార్నింగ్ ఇచ్చాడు చాలా పెయిన్‌గావుంటుంది, అందులో కంట్లో కూడా పోసింది కనుక ఇంకా ఎక్కువ పెయిన్‌గా వుంటుంది - ఎలా తట్టుకుంటారో అని సూచనప్రాయంగా చెప్పాడు. కానీ నాకు ఏమాత్రం పెయిన్‌గానీ, ఏమీలేదు - ఒక్క కంటినుండి నీరుకారటం తప్ప. ఈ ఆలోచనవచ్చి, డాక్టర్లు సరైన డయాగ్నసిస్ చేయలేదనో, లేక డాక్టర్లకు తెలియదనో సర్పి వ్యవహారం అని - నాలో ఒక రకమైన నిర్లక్ష్య భావం, డాక్టర్ల యొక్క సమర్థత మీద కలిగింది.

అనుకున్న క్షణంలోనే తలలోంచి పోట్లు, కంట్లో ఒక గడ్డ పలుగుతో పొడిచినంత బాధ వచ్చింది. రెండు క్షణాలు తట్టుకోలేక లేచి అటూ ఇటూ తారట్లాడుతూ గోడకేసి తలకాయకొట్టుకుందామన్నంత స్థితి వచ్చింది. కొట్టుకుందామనే స్థితిరాగానే తగ్గింది. అప్పుడు అనిపించింది. నేను అనవసరంగా డాక్టర్ల యొక్క సమర్థతను అనుమానించినందుకు, "అమ్మ నాకు బాధలేకుండా చేసిందనేభావన రానందుకు" బహుశా వాళ్లు చెప్పింది నిజమేనాన్నా దీంట్లో ఇంతబాధవుంటుంది, కానీ నేను దానికి నీవు బాధపడకుండా చేయటం కోసం నివృత్తి చేశాను - అనే సూచనప్రాయంగా మనసుకుతోచేటట్టు చేసింది.

తర్వాత మళ్ళీ బాధ ఏమాత్రం లేదూ కానీ కంటిచూపు గురించి డాక్టర్లు ముందే చెప్పారు - ఫిఫ్టీ, ఫిఫ్టీ ఛాన్సెస్. దృష్టి రావటం అనుమానమేనని. పదిహేనురోజులు గడిచింది. నీరు ఇంకా కారుతూనే వుంది. డ్యూయల్స్ కనబడుతున్నాయి. అంటే ద్వంద్వంగాచూపు. అంటే ఒక వస్తువు రెండుగా కనబడటం. దృష్టి మందగిస్తోంది. కంట్లో నీరు కారుతూనే వుంది. కానీ నొప్పిలేదు.

నీరు కారటం, చూపుతగ్గటం కనబడుతూనే వుంది. తెలుస్తూనే వుంది. అప్పుడు జ్ఞానకం వచ్చింది. అమ్మతోనే నన్నమాట- "అమ్మా ఈ శరీరంలో ఏ అవయవమైనా నీకుగానీ, నాకుగానీ ఉపయోగపడకపోతే నన్ను నీలోకలుపుకో" అని రిక్వెస్టు చేశాను, కాబట్టి ఈ కంటిచూపు పోతే నా శరీరంలో ఒక అవయవం పనిచేయనట్టే కనుక నన్ను నీలో కలుపుకో" అని అమ్మను రిక్వెస్టు చేశాను మనస్సులో.

మామూలుగా భోజనం చేస్తూనే వున్నాను. స్నానం చేస్తూనే వున్నాను. ఒక కంటితో పుస్తకం చదువుతూనే వున్నాను. కాలక్షేపం చేస్తూనే వున్నాను. ఈ అనుకొన్న రోజు స్వప్నంలో..... కనిపించింది. నాకంటిపైనే చూస్తూ, ఒక స్టూల్ మీద కూర్చొని తెల్లటి చీరతో, ఆచీరకొంగును తలమీద కప్పుకొని నాకంటిపైపే పది పదిహేను నిమిషాలు చూస్తూ ఆ స్వప్నం గడచింది.

ఆ మరుసటి రోజునుంచి సర్పి మొత్తం తగ్గిపోయింది. కంట్లో నీరు కాస్త తగ్గటం మొదలైంది. అనుకోకుండా హోమియో డాక్టర్ దగ్గరకు వెళ్లాం. డ్యూయల్టీ పోయి మళ్ళీ సింగ్యులర్‌లోకి వచ్చింది. దృష్టి మామూలుస్థితి కొచ్చింది. అంటే ఆ సర్పివల్ల పడాల్సిన బాధను బాధలేకుండా రోగాన్ని అనుభవించా. అవయవంపోతే నేను అమ్మతో విన్నవించుకున్నట్లుగా నేను శరీరాన్ని వదలాలి కానీ కన్ను నయం చేసింది. జిల్లెళ్లమూడి వెళ్ళినప్పుడల్లా అమ్మపడుకోనున్నా, కూచోనున్నా, నారెండు కళ్లని అమ్మ రెండుకాలిబొటన వ్రేళ్లకు ఆనిచ్చేఅలవాటు.

కళ్లు మూసుకొని నా ుగుడ్లను అమ్మకాలిబొటనవ్రేలుకు ఆనించి నమస్కారం చేసే అలవాటు.

ఒకరోజు అమ్మ మంచిగాఢనిద్రలో వుంది. లోపలకు వచ్చాను. నిద్రబోతోందని నారెండు కళ్లు మూసుకొని వంగి అమ్మబొటనవేలుకు రెండుకంటి గుడ్లను ఆనించి నమస్కారంచేస్తుండగా - “గోరు గుచ్చుకుంటుంది నానా” - అంది. గాఢనిద్రలో వుండి, నేను అమ్మ నిద్రలేస్తుందేమోనని తాకీ తాకకుండా అమ్మబొటనవేలుకు నాకళ్లూ ఆనిస్తూ నమస్కారం చేస్తున్నప్పుడు కూడా - “గోరు గుచ్చుకుంటుంది నాన్నా” అని నాయొక్క క్షేమాన్ని, నా స్పర్శని గుర్తించి అన్నది.

అంటే నిద్రలోవున్నా, శరీరంతో లేకపోయినా మనక్షేమాన్ని అమ్మ ఎప్పుడూ కాంక్షిస్తూ మనవెనుక వుండి మనల్ని కాపాడుతూ వుంటుందని ఇంతకన్నా దృష్టాంతం వేరే ఏమీ లేదని అనిపిస్తుంది.

“జయహోమాతా”



పూజయామి మృదు పాద పంకజం
యోగి చంద్ర హృదయాంబుజార్చితం ।
వేద దివ్య పదవీ విరాజితం
లోకపాలన కలా విచక్షణం ॥

మానసే వసతు లోక శంకరం
మాతురబ్జ సదృశం మనోహరం ।
భక్తలోక వరదాన తత్పరం
పాదయుగ్మ మమరై ర్నిషేవితం ॥

- కీ॥శే॥ డా॥ నోరపరాజు శ్రీధరరావు

# అంఆ

## అన్నం పరబ్రహ్మస్వరూపం. మరి అశుద్ధమో?

- **పర్సా హరగోపాల్** (U.S.A)

'అంఆ' ది తోలు నోరుకాదు - తాలు మాటరాదు. కానీ 'అంఆ' మాటలకర్థం తెలుసుకొనడానికి తోలు శరీరం సరిపోదు. తాలులేని మనసు కావాలి. ఆ అదృష్టం ఎవరికి ఇస్తుందో అమ్మ.

ఇది అమ్మ మాట. "అన్నం పరబ్రహ్మ స్వరూపమయితే, మరి అశుద్ధమో"

ఈ వాక్యం గత 20వ సంవత్సరాలుగా నాకు పెద్ద సమస్యగా మిగిలిపోయింది. ఈ వాక్యం సత్యం అయితీరాలి అని తెలుసు - అమ్మ అన్నది కనుక. కాని దాన్ని సమర్థించే శక్తి నాకులేదు. ఎందుకంటే ఆవాక్యం నాకు అనుభవంలోకి రాలేదు కనుక.

అనుభవం లేక చెప్పినదానికి విలువ ఎక్కడుంది? ఎన్నోసార్లు అర్థం చేసుకోడానికి ప్రయత్నించి విఫలుడనయ్యాను.

ఎంత ఆలోచించినా - అశుద్ధాన్ని పరబ్రహ్మగా వూహించలేకపోయాను. చివరికి ఈ సమస్య కూడా ఆ పవిత్ర పాదాల దగ్గరే వదిలివేసాను. చివరికి దీనిఅర్థం భాషలో ఇమిడివున్నట్లు తెలిసింది. 'అంఆ' చెప్పిన వాక్యాన్ని కొంచెం కొంచెం విడదీసి ఆలోచించి అర్థం చేసుకోటానికి ప్రయత్నించాను. దానికి రూపమే ఈవ్యాసం.

తప్పులన్నీ నావి - ఒప్పులు అమ్మవి.

ముందుగా "అన్నం" అన్న పదానికి అర్థం తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాం. అన్నం అంటే బియ్యంతో వండిన పదార్థమే కానక్కరలేదు. ఏ ఆహారమైనా అన్నంతో సమానమే. అన్నం శరీరానికి బలంకలుగజేస్తే, విద్యాబుద్ధికి, తపస్సు మనస్సుకు, భక్తి హృదయానికి పుష్టిని చేకూర్చి మానవుని తీర్చిదిద్దుతాయి. అన్నీ ఆహారంగా పనిచేస్తాయి. వీటిలో ఏ ఆహారం లోపించినా మానవునికి సమగ్రత లోపిస్తుంది.

ఉపనిషద్రుషి యాజ్ఞవల్క్యుడు, గురుతిరస్కారం కారణంగా తనవిద్యనంతా వమనం చేసుకుంటాడు. గురువుయొక్క ఆజ్ఞను తిరస్కరించిన అతనికి విద్యయనే ఆహారం పుష్టినివ్వలేదు. అదే వమనాన్ని తిత్తిరి పక్షులరూపంలో గ్రహించినవారు పుష్టిని పొందారు. వారు విజ్ఞానానికి పుష్టిని కలుగజేసింది. వారికి పరమాత్ముడు ఆరూపంలో శక్తిని ప్రసాదించాడు.

ఆహారం జీవనాధారం. జీవి శరీర పోషణకు కావల్సిన ముడిసరుకు (Raw material) ఆహారమంటే జీవి జీవనానికి కావల్సిన ఇంధనం. ఆహారం లేకుండా మనిషి బ్రతుకలేడు కనుక ఆహారాన్ని పరబ్రహ్మతో పోల్చారు. అలాగే మిగతా జీవులు (జంతువులు, పక్షులు) కూడా ఆహారంలేకుండా బ్రతుకలేవని జగమెరిగిన సత్యమే.

భగవంతుడు సర్వాంతర్యామి. అంతటా భగవంతుడిని చూడగల్గాడు ప్రహ్లాదుడు. ఎక్కడా చూడలేకపోయాడు అతని తండ్రి. వామనుడిగావచ్చి ఎదురుగా నిల్చినప్పటికీ గుర్తించలేకపోయాడు ప్రహ్లాదుని మనుమడు బలిచక్రవర్తి. పరమాత్మ అంతటావున్నాడనేది సత్యం. అది తెలుసుకోలేకపోవడం మన అజ్ఞానం.

అంతటావున్న ఆ పరమాత్మ ప్రతి జంతువులో ప్రతివృక్షంలో, ప్రతిపక్షిలో, ప్రతిజీవిలో వున్నాడు. వారి వారి వుపాధిననుసరించి వారి వారికి వివిధములైన ఆహారాలు కావాలి. ఆ ఉపాధి లోని పరమాత్మను జీవింపజేయడానికి కావలసిన ఆహారం కూడా (అది ఏవిధంగా, ఏరూపంగా వున్నప్పటికీ) పరబ్రహ్మమే. అంటే జంతురూపాలుగా వున్న మత్స్య, కూర్మ, వరాహ, నాగేంద్ర, బసవ, గరుడ అన్నీ దైవస్వరూపాలే. వాటి ఆహారం కూడా పరబ్రహ్మమే.

నేను పుట్టి పెరిగింది పల్లెటూరిలో. "కాకులు దూరని కారడవి" అన్నట్లు ఏ ప్రయాణ ఆధునిక సౌకర్యాలు కారు, బస్సులాంటివి లేని మాకు గ్రామానికి 'అంఆ' కు మాపై మాతల్లిదండ్రులపై కల అపార కరుణ ప్రేమ యనే రెక్కలుగల గరుడవాహనారూఢయైవచ్చి మాగృహాన్ని పావనంచేసింది. అలాంటి గ్రామంలో అన్నిరకాల జంతువులు ముఖ్యంగా గేదెలు, ఆవులు, ఎడ్లు, మేకలు మొదలైనవి వుండేవి. వ్యవసాయమే ఆధారంగా గల రైతులకు జంతువుల పూజ చాలాముఖ్యం. ఆ జంతువుల బలి కూడా ముఖ్యమే. అది వేరే విషయం. గోపూజ అందఱికీ తెలిసిందే. దశావతారాలలో పరమాత్మ కొన్ని జంతువుల రూపంలో రావడం కూడా మనందఱికీ తెలిసిందే. పల్లెటూళ్లో పెరిగే రోజులలో జంతువులను ప్రేమించడం పూజించడం చాలాసహజం. అన్ని జంతువులు ఎలా వున్నా, ఒక జంతువు మాత్రం తనశరీర పోషణకు, తనలోవున్న ఆభగవంతుని పోషించడంకొరకు, అశుద్ధంపై ఆధారపడ్తుంది. అదే సూకరం. అమ్మకు చన్ను గుదిపిన ఆ సూకరమెంత ధన్యజీవియో. రాజరాజేశ్వరీ స్వరూపిణి అమ్మకు అందఱూ (తల్లిగా) తనబిడ్డలే. గొల్లరంగమ్మ స్తన్యపానం, సూకరం స్తన్యపానం బిడ్డగా అమ్మకు రెండూ సమానమే. విశ్వరూపిణికి అందఱూ తనలోని వారేకదా! ఇంకదేనిపై అసహ్యము, దేనిపై గౌరవం?

ఇంతకూ సూకరం భుజించినది అశుద్ధం అని వప్పుకుంటున్నాము. ఆ పందికి ఆహారమై ఆ పందిలో జీవిస్తున్న భగవంతుణ్ణి పోషిస్తున్న అశుద్ధం పరబ్రహ్మ మెందుకు కాకూడదూ? మనిషిని పోషించే అన్నం (ఆహారం) పరబ్రహ్మమైనపుడు అదే సర్వాంతర్యామిని పోషిస్తున్న అశుద్ధం, పరబ్రహ్మమనక తప్పదు. అలాకాదు అంటే ఆ జీవుడు ఈ జీవుడు వేరు భగవంతుడు సర్వవ్యాపి కాదు అనవలసివస్తుంది. అలా అనలేనప్పుడు "తోలునోరుకాదు - తాలు మాటరాని" అంఆ మాట సత్యమని ఘంటాపథంగా చెప్పకతప్పదు. చేసి చూపిన అమ్మకదా మరి అనుభవజ్ఞురాలు.

ఇదే విషయాన్ని ఇంకోవిధంగా, తెలుగుసంస్కృతిలోని ఒక వుదాహరణ తీసుకొని వివరించడానికి ప్రయత్నిస్తాను. తెలుగునాట గ్రామాలలో సంక్రాంతి గొప్పపండుగ. గంగిరెద్దు ముగ్గులు, చలిమంటలు,

ముగ్గులపోటీలు, కోడిపందాలు రంగురంగుల ముగ్గులమధ్యలో కొప్పులో బంతిపూలతో గొబ్బెమ్మలు. మన తెలుగుదేశంలోని గౌరవసంస్కృతికి చిహ్నాలైన ఆ గొబ్బిళ్లను ఎలా చేస్తారో ఎప్పుడైనా ఆలోచించారా?

ఈ మధ్య గౌరవనీయురాలైన వసుంధరక్కయ్యతో ఫోనులో మాట్లాడటం జరిగింది. ఆ సందర్భంలో అక్కయ్యను గొబ్బిళ్లు ఎలా చేస్తారని అడిగాను. ఎందుకంటే నేను మా వూరువదిలి 30 సంవత్సరాలైంది. పట్టణంలో చదివి అమెరికాలో నివసిస్తున్న మాకు గొబ్బిళ్లు ఈ రోజుల్లో అసలు చేస్తున్నారా? అనే అనుమానం వచ్చింది. మా చిన్నప్పుడు గొబ్బిళ్లు ఆవుపేడతో చేసేవారు. జిల్లెళ్లమూడిలో అమ్మ వున్నపుడు, ఆవుపేడతో గొబ్బిళ్లు చేసి పసుపు కుంకుమ బంతిపూలతో అలంకరించే వాళ్లం అని అక్కయ్య నాజ్ఞాపకానికి వత్తాసు ఇచ్చారు.

ఇక్కడొక చిన్నవుదాహరణ. ఒక గురువుగారు శిష్యుని సృష్టిలో పనికిరానివస్తు వేదయినా వుందేమో చూసి రమ్మన్నారు. శిష్యుడు అనేక ప్రదేశాలలో తిరిగాడు. ఎక్కడా ఏవస్తువు పనికిరానిదిగా కనిపించలేదు. చివరకు అశుద్ధంచూసి ఇది ఎందుకు పనికిరాదు అనుకున్నాడు. ఆ అశుద్ధం అతనిని చూసి నవ్వు నేను ఈ విధంగా కావడానికి నీవేకారణం. బలవర్ధకమైన ఆహారంతిని నన్ను పనికిరాని దానినిగా చేసిన మానవుడివి నువ్వే ఎందుకూ కొరగానివాడివి అని చెప్పిందట. మానవుడు సమస్తసృష్టిని తాను అనుభవిస్తూ, ఆనందిస్తూ, సృష్టికి మూలకారణమైన పరమాత్మను తెలుసుకోడానికి ప్రయత్నించని కృతఘ్నుడు. మిగిలిన జంతు జాలమంతా తమ పరిధిలోనే అనుభవిస్తూ ఇతరులకు ఏదో రూపంలో వుపయోగపడతాయి. మానవుడే ఎవరికీ వుపయోగపడని వ్యర్థజీవి. స్వార్థజీవి.

అశుద్ధాన్ని కూడా పరబ్రహ్మగా చూసిన అంఆ వాక్యానికి ఇది ఒక చిన్న వివరణ మాత్రమే. ఇది కూడా అమ్మ చేయించిందే.

**అన్నీ తెలిసినవారికి, అన్నీ అదే అనిపిస్తుంది.**
**తెలిసీ తెలియని వారికి, అది, ఇది అనిపిస్తుంది.**
**ఏమీ తెలియనివారికి ఏదీ తెలియని అజ్ఞానం**
తెలుసుకుంటే అంతా అదే కదా!
జయహో మాతా - అంఆ

---

సామాన్యం నుండి విశేషాన్ని వేరు చేసు కోవటం సాధన.
విశేషాన్ని సామాన్యం చేసుకోవటం సిద్ధి.

**- అమ్మ**

# ధనాధ్యక్షా ధన ధాన్య వివర్ధిని

- టి. శ్రీ కృష్ణదేవరాయలు (U.S.A)

అనేక కోటి బ్రహ్మాండజనని అయిన అమ్మవారి పాద పద్మములకు నాశతకోటి సాష్టాంగ నమస్కారములు.

ఒకసారి అమ్మవారి దగ్గర కూర్చుంటే అమ్మవారు "అంతా అదే అని చెప్పడానికి ఇవన్నీ చెప్పారు" అన్నారు. అప్పుడు నాకు అర్థం కాలేదు. ఇప్పుడు అనిపిస్తుంది. అమ్మవారు చెప్పింది. "లలిత సహస్రనామములు" గురించి అని, అన్ని సహస్రనామములు ఒక్క మన అమ్మవారు గురించేనని.

అమ్మవారు ప్రతినామము లోనూ అవగతం అవుతూ ఉంటారు. అమ్మవారు ఇచ్చిన లెక్కలేని ఎన్నో అనుభవాలలో ఒక అనుభవం గురించి వ్రాయాలనిపిస్తుంది. 'ధనాధ్యక్షా ధన ధాన్య వివర్ధినీ" అన్న నామం ఈ అనుభవానికి ఎంతగానో సరిపోతుంది అనిపిస్తుంది.

అది 70లలో అమ్మవారి దర్శనము చేసుకున్నాను. అమ్మవారు "అమ్మాయిని తీసుకురా, అక్షరాభ్యాసం చేద్దాం" అన్నారు. సుధ గురించి అన్నమాట, సుధకి అప్పుడు అక్షరాభ్యాస వయస్సు, అప్పుడు ఆర్థిక పరిస్థితి ఏమీ బాగుండలేదు. అప్పటి వరకూ అమ్మవారిని దర్శనము చేసుకొనడమూ, అమ్మ వారిప్రసాదం తినడమూ వెళ్లడమే కాని అమ్మ వారికి ఏమీ చేసుకోలేకపోవుచున్నానే అన్న బాధతో లోపల లోపలే వాపోతూఉండేవాడిని. పైగా ఇప్పుడు అమ్మ వారు సుధకు అక్షరాభ్యాసం చేద్దాం తీసుకురా అన్నారు. ఎలా అని ఆలోచనలో పడ్డాను. అప్పటి ఆ పరిస్థితిలో ఆ కొంచెం ఖర్చు ఎంతో ఎక్కువ అనిపించింది. అమ్మవారు అన్నారు కదా ఎలా అయితేనేం అందరం కలసి జిల్లెళ్ళమూడి వచ్చాం. స్వీట్స్, బిస్కెట్లు, పువ్వులు అన్నీ తీసుకురావడం జరిగింది. అమ్మవారు సుధకు అక్షరాభ్యాసం చేశారు. అప్పుడు ప్రిన్సిపాల్ గార్ని పిలిపించి సుధతో ఆయన పాదాలకు నమస్కారం చేయించారు. ప్రిన్సిపాల్ గారు సుధను దీవించారు. ఆ సమయంలోనే అమ్మవారు వసుంధర అక్కయ్యను పిలిచి అక్కడ డబ్బులు ఉన్నాయి తీసుకురా అనడం గుర్తు. వసుంధర అక్కయ్య తీసుకురావడం, అవి తీసుకుని నా చేయి పట్టుకొని నా చేతిలో పెట్టబోతూ ఉంటే నేను అవాక్కయ్యి, ఒక ప్రక్క ఆశ్చర్యపోతూ వద్దు అమ్మా అంటూ, ఒక ప్రక్క నేను అమ్మ వారికి ఏమీ చేసుకోలేకపోవుచున్నాను సరికదా అమ్మవారే నాకివ్వడం ఏమిటని బాధ ఇంకా ఎక్కువ అవ్వడంతో వద్దమ్మా అని అమ్మవారు ఇస్తూ ఉంటే అమ్మవారి చేయిని అడ్డు పెట్టబోయాను. అప్పుడు అమ్మవారు "దిగులు పడకు నాన్నా నీవు అమెరికా వెళ్ళిన తరువాత నాకు పంపుదువుగాని, తీసుకుని అమ్మాయిని బడిలో చేర్పించు" అన్నారు అమ్మ. అప్పుడు కన్నీళ్ళతో అంతా నీదయ అమ్మా" అని అనగలిగాను అంతే. అమ్మ వారు ఇచ్చింది 216 రూపాయలు. అమ్మ వారి మాట ప్రకారం కొన్ని సంవత్సరములకు అమెరికా రావడం జరిగింది. అమ్మ వారి దయవల్ల మరియు అమ్మ వారి మాట వల్ల ఆర్థికంగా బాగానే పైకి రావడం జరిగింది. వెనకకు తిరిగి చూసుకుంటే ఇదంతా అమ్మ దయవల్లనే పూర్తిగా, అవును అమ్మవారు అన్నట్లు అది తోలునోరు కాదు కదా తాలుమాట కావడానికి. అంతటి లక్ష్మి, జగజ్జనని అయిన అమ్మ వారికి ఇది అంత విషయమా? కానేకాదు.

అవతారమూర్తులు, మహాత్ములు వారి చేతులతో డబ్బుతీసుకోవడం గాని, డబ్బు ఇవ్వడం గాని చాలా అరుదు అని విన్నాను. అటువంటిది అనేక కోటి బ్రహ్మాండ జనని అయిన అమ్మ వారే తన బంగారు చేతులతో స్వయంగా ఇవ్వడం మరియు అన్నీ కలిపితే 9 అంకె అవ్వడం చాలా విశేషం అని విన్నాను. ఇది అమ్మ వారి అవ్యాజకరుణకు తార్కాణం అని అనుకుంటున్నాను.

ఈ అనుభవంతో అమ్మ వారు 'ధనాధ్యక్షా' 'ధన ధాన్య వివర్ధినీ' అన్న నామం ఎంతగానో సరిపోతుంది అనిపిస్తుంది.

జై అనసూయ మాతకు జై

# ఏకాంత భక్తుడు 'రహి'

- రాచర్ల లక్ష్మీనారాయణ

'అమ్మ' భక్తులకు, బిడ్డలకు అన్ని ఉత్సవాలూ జిల్లెళ్ళమూడిలో జరుపుకోవడం ఆనవాయితీ. వివాహాలు, ఉపనయనాలు, అన్నప్రాశనలు, అక్షరాభ్యాసాలు, ఒకటేమిటి? అన్నీ అమ్మసన్నిధిలోనే. ఇక, 'బారసాల'లు సరేసరి. తమ పిల్లలకు పేరు అమ్మే పెట్టాలని ఎక్కడెక్కడి సోదరులూ నామకరణ మహోత్సవాలను అమ్మ సన్నిధిలో జరుపుకునేవారు. హైమ, నాగేశ్వర్, ప్రేమకుమార్, సుహాసిని, శ్రీచరణ్ లాంటికొన్ని పేర్లు అమ్మ తరచుగా ఎన్నుకుంటూ ఉండేది. అలాంటి పేర్లలో 'రహి' ఒకటి. ఒకానొక కాలంలో అయితే, దాదాపుగా అందరికీ 'రహి' అనే పేరే పెట్టేది - అమ్మ. "ఏమిటమ్మా' ఈ మధ్య ఏ పిల్లాడికైనా 'రహి' అనే పేరే పెడుతున్నావు?" అని ఒకసారి ఒకసోదరుడు తన కుతూహలాన్ని అమ్మకు నివేదించగా "అవునురా, ఆ పేరు కనీసం 108 మందికైనా పెట్టాలి. ఈ పిల్లలంతా పెరిగి పెద్దవాళ్ళయి, జిల్లెళ్ళమూడి రావాలి. నేను 'రహి' అని పిలవగానే అందరూ ఒక్కసారి తిరిగి చూడాలి. 'ఓయ్' అని పలకాలి" అన్నది అమ్మ.

అమ్మకు ప్రియమైన పేర్లు ఎన్నో ఉన్నాయి. వాటిలో ప్రియాతి ప్రియమైన పేరు 'రహి'. జిల్లెళ్ళమూడి చరిత్రలో 'రహి' ఒక సువర్ణాధ్యాయం. 'రహి' చిరంజీవి.

ఎవరు ఈ 'రహి'? ఏమిటి ఇతని కథ? ఎందుకు ఈ పేరు అమ్మకు ఇంతగా ప్రీతిపాత్రమై చరితార్థమైంది? అని మనకు ఉత్కంఠ కలుగుతుంది.

జ్ఞాపకాల దొంతరను కదిలించి ఆనాటిసోదరులలో కొందరికి అప్పుడప్పుడు కొన్ని సంగతులు వివరించింది అమ్మ. వాటి ద్వారా తెలుస్తోంది - రహి అమ్మకు ఏకాంత భక్తుడని. శ్రీరాముని పదసన్నిధిలో తరించిన హనుమ లాంటి వాడని.

అమ్మ 12 ఏళ్ల బాలికగా ఉన్నప్పుడు జరిగినసంఘటన అది. బాపట్లలో రైల్వేస్టేషన్ సమీపంలో ఉన్న చిదంబరరావు తాతగారి ఇంట్లో ఉండేది అమ్మ. రైల్వే ఆస్పత్రి దగ్గరున్న వీధి కుళాయి నుండి మంచినీళ్ళు తీసుకువస్తూ ఉండేది. ఒకరోజు సాయంత్రం ఆసుపత్రి గోడనానుకుని దుప్పటి ముసుగులో ఒక మనిషి పడుకుని ఉండటం చూసింది అమ్మ. ఎవరో రోగగ్రస్తులు బాధపడుతున్నారని, ముసుగు తీసి చూడాలని, చేతనైన రీతిలో ఆదుకోవాలని అమ్మ మనసులో తపన. ముసుగు తీసి చూద్దామని అమ్మ ప్రయత్నించే సరికి, ఆ దారిన పోతున్న ఒకాయన "ఆపిల్ల వాడెవరో నాలుగు రోజులనుంచి అక్కడే పడిఉన్నాడు. అసలు ప్రాణం ఉన్నదో లేదో కూడా తెలియదు. పెద్దవాళ్ళంతా తమకేమీ పట్టనట్లు పోతూ ఉంటే, కడిగిన ముత్యంలా ముద్దుగా ఉన్నావు, చిన్న పిల్లవు నీకెందుకమ్మా! ఈ గొడవ? లేనిపోనిది, ఏ దయ్యమో పట్టేను". అని హెచ్చరిస్తూ వెళ్ళిపోయాడు. అయినా, అమ్మ చలించలేదు. మెల్లగా ముసుగు తీసింది.

అక్కడ సుమారు 16 ఏళ్ళ కుర్రవాడు. కళ్ళు పుసులు గట్టి నీళ్ళు కారుతున్నాయి. జ్వరంతో ఒళ్ళు కాలిపోతోంది. స్పృహలేదు. నోటి వెంట చొంగ కారుతోంది. దుర్వాసన వస్తోంది.

చూడగానే అమ్మ హృదయం ద్రవించింది. రైల్వే డాక్టర్ ఇంటికి పరుగు పరుగునా వెళ్ళింది. కుర్రవాడి పరిస్థితిని వివరించి, ఒక్కసారి వచ్చి చూడమని ప్రాధేయపడింది. చికిత్సకు కావలసిన డబ్బుకడతానంది. నమ్మకం కోసం తన మెడలో గొలుసుతీసి యివ్వబోయింది. ఎలాగైనా అతణ్ణి బ్రతికించమని జాలిగా అడుగుతూ, రెండు చేతులూ జోడించింది.

గొలుసుతీసి అందించబోతున్న అమ్మను వారించి, ఆ డాక్టరుగారు బయలుదేరారు. ఆ అబ్బాయిని పరీక్షచేశారు. టైఫాయిడ్ అనీ, ప్రాణాపాయపరిస్థితి అనీ చెప్పారు. దుప్పటితీసి చూడగా, ఆ కుర్రవాడు బట్టల్లోనే మలమూత్ర విసర్జన చేసినట్లు తెలిసింది. అమ్మ, తన చీర చెంగు చింపి, అతడిని శుభ్రంచేసి, అతడి ఒళ్ళంతా తుడిచి, అతణ్ణి కూచోపెట్టి, నెమ్మదిగా అతడి నోరుతెరచి, కాసిని నీళ్ళు తాగించి, తన చీర చెంగుతో గోచీపెట్టి నెమ్మదిగా మంచంమీద పడుకోబెట్టి, ఎనలేని వాత్సల్యంతో చూసి, ఒళ్ళంతా ప్రేమగా నిమిరి ముద్దుపెట్టుకుంది.

ఈ పిల్లవాడు 'అమ్మ'కు ఏమవుతాడని డాక్టరుగారు అడిగారు. తనకూ ఇంతకుముందే తెలుసునని, రోడ్డుప్రక్కన అలా పడిఉంటే చూస్తూ ఊరుకోలేక సేవచేశానని అమ్మ చెప్పింది. బ్రతుకుతాడని ఏ మాత్రం ఆశలేదని డాక్టరుగారు చెప్పినా, అమ్మసేవలతో క్రమంగా అతడు కోలుకున్నాడు. డాక్టరుగారే ఆశ్చర్యపోయారు. "నా వైద్యం కాదు. భగవంతుడే బ్రతికించాడ"ని చెప్తూ, తాతగారితో "అమ్మాయి వాత్సల్యం మాతృమూర్తిని మరిపిస్తుంది" అన్నారు.

ఆ పిల్లవాడి పేరు 'రహి'. మెదక్ ప్రాంతానికి చెందినవాడు. అతడికి వెనుకా ముందూ ఎవ్వరూ లేదు. ఆనాటి నుంచి 'అమ్మ'ను అమ్మగా దర్శించాడు. డాక్టరుగారు అడిగితే 'అదిగో అమ్మ' అని అమ్మను చూపించాడు. 'ఇప్పుడే పుట్టాను' అన్నాడు. 'అమ్మ దేవుడు' అన్నాడు. అతడు పూర్తిగా కోలుకోవడానికి కావలసిన అన్ని ఏర్పాట్లూ అమ్మచూసింది. తాతగారు అమ్మలోని విశ్వమాతృత్వానికి ముగ్ధులవుతూ, అమ్మకు సహకరించారు. క్రమేణా రహిని తాతగారు ఆప్యాయంగా చూడసాగారు. డాక్టరుగారు కూడ తనకు ఫీజు వద్దని తిరస్కరించారు. తాతగారు అతనికి తమ యింట్లోనే పని చూపించి. యింత అన్నం పెట్టి ఆదరించాలనుకున్నారు. కాని, రహి బాగా నీరసంగా ఉన్నాడని, పనులు చేయలేడని విలవిలలాడింది అమ్మ.

ఆ నాటి నుంచి 'రహి' అమ్మను వదిలి ఉండలేని పసివాడు అయిపోయాడు. అమ్మలో అమ్మను దర్శించాడు. ఆ అమ్మనే దైవంగా భావించాడు. ఇంటి పనులన్నీ చేయడం మొదలుపెట్టాడు. అత్తింటి కోడలుగా రహిని ఆశించిన స్థాయిలో ఆదరించడానికి జంకుతూ, అమ్మగా తన స్వభావం కారణంగా రహికి అంతులేని వాత్సల్యాన్ని పంచుతూ - అమ్మ చిత్రమైన ఆవేదనను అనుభవించేది.

క్రమంగా కోలుకొని పరిపూర్ణ  ఆరోగ్యవంతుడైన 'రహి' అమ్మకు సేవలు చేయసాగాడు. అమ్మ చేయవలసిన ఇంటి పనులన్నీ 'అమ్మ'కు బదులుగా 'రహి' చేసేవాడు. పైగా ఒక భోజన హోటల్లో అంట్లు తోమడం, పొద్దున పూట కాఫీహోటల్లో పనిచేయడం, రైలుస్టేషనులో కూలి పని చేసి ఏదో సంపాదించడం ప్రారంభించాడు. హోటల్లో పెట్టిన అన్నం, కాఫీ, ఇడ్లీ తెచ్చి అమ్మను తినమనేవాడు. 'నువ్వు తింటేనే నేను

తింటానని' మారాం చేసేవాడు. అమ్మను పనిలోకి పోవద్దని రెండుచేతులూ పట్టుకొని ఏడ్చేవాడు. ఇది అది అని లేకుండా ఇరవై నాలుగు గంటలూ అన్ని పనులూ చేసేవాడు. మేజోళ్ళు అల్లటం, పూసలు కుట్టటం, బనీన్లు అల్లటం, దర్జీపని, దూది ఏకి పరుపులు కుట్టటం, బంగారం పని అన్నీ నేర్చుకుని చేసేవాడు. చిత్రలేఖనం, శిల్పం మొదలైన కళల్లో ప్రావీణ్యం సంపాదించాడు. తాతగారి సాన్నిహిత్యంలో కవితలు చెప్పేవాడు. అలా రెండు సంవత్సరాలు గడిచాయి.

"నీ కొడుకు ఏకసంథాగ్రాహి, వరపుత్రుడు. వీడి పేరు 'దేవీ చరణ్' అంటే బాగుంటుందమ్మా" అన్నారు తాతగారు. 'దేవీచరణ్' ఏమిటి? 'మాతృ చరణ్' అంటే బావుంటుంది" అన్నది అమ్మ.

అమ్మా, నాన్నగారు మన్నవలో ఉన్నప్పుడు కూడా రహి అమ్మను అనుసరించాడు. ఎనలేని సేవలు అందించాడు. అమ్మ ఆప్యాయంగా అన్నం పెడుతుంటే, ఒక్క ముద్ద తిని, పొంగిపోతూ "ఈ ఒక్క ముద్ద చాలు, ఈ ముద్దతో మళ్ళీ ముద్దలు మింగకుండా ఎంతకాలమైనా బ్రతకవచ్చు. ఆకలిదప్పులు రెండూ ఈ ఒక్కముద్దతో పోవాలి" అనేవాడు.

అమ్మా, నాన్నగారు పుసులూరు వెళ్తే, బండి వెంటే పరుగులాంటి కాలి నడకతో ఆ వూరు చేరాడు రహి. ఆ వూళ్ళో ఉన్న మండువా యిల్లు, ఎత్తు అరుగులు, నాలుగు వైపులా చావడి చూస్తు, అదంతా కలయదిరుగుతూ, అమ్మ వంక చూస్తు, "ఇంత ఆవరణ మనకుంటే ఎంత బావుంటుంది" అన్నాడు రహి.

"ఇంత తక్కువ కోరావేం? మనది ఎంత వరకు ఉందో నీకు తెలియదు. ప్రపంచమంతా మనదే. మనమే తలాకాస్త వాడుకోమని ఇచ్చాం" అన్నది అమ్మ.

రహి : ఎవరికి ఇచ్చాం.

అమ్మ : నీ అన్నదమ్ములకు, అక్కచెల్లెళ్ళకు.

రహి : అలా అయితే, ఇక మనది కానిదేముంది?

అమ్మ : నేననేదీ అదే, మనది కానిది లేదు. అంతా మనదే, అంతా మనమే.

ఇలా అమ్మ సన్నిధిలో సేవలు చేస్తూ, అమ్మలోని దివ్యమాతృత్వాన్ని ప్రత్యక్షంగా దర్శించిన భాగ్యశాలి రహి.

రహి సేవలను గుర్తిస్తూ, అతను క్రమంగా విద్యలో ఎదుగుతుంటే చిదంబరరావు తాతగారు పరవశించి పోయేవారు. "నేర్చుకుంటే వస్తున్న విద్యకాదమ్మా! నీ యందు ప్రేమవల్ల. నీ సేవా భాగ్యం వల్ల వచ్చిన విద్య." రామకృష్ణ పరమహంసను వివేకానందుడిలా, శ్రీరామునికి హనుమంతుడిలా - అమ్మకు రహి సేవలు చేస్తున్నాడని తాతగారు తన్మయులయ్యేవారు. అమ్మ సన్నిధిలో రహిలోని తృతీయ నేత్రం క్రమంగా విప్పారింది. నాలుగు వైపులా వాకిళ్ళున్న ఆ మండువాయింటిని చూస్తూ, "ఒక్కదేహానికే తొమ్మిది వాకిళ్ళు ఉండగా, ఎన్నో దేహాలు తిరగవలసిన ఈ ఆవరణకు నాలుగు వాకిళ్ళేగా" అనుకునేవాడు.

అమ్మ వైద్యంకోసం చీరాల వెళ్తే, రహి కూడా చీరాలచేరాడు. కూలి పనులు చేసి డబ్బులు సంపాదించ సాగాడు.

"అమ్మా! వైద్యంతో సహా నేను అన్ని పనులూ నేర్చుకొని, నీకు విశ్రాంతి కలిగించాలని, నీవు పడే బాధలన్నీ నీకు బదులుగా నేనే పడాలని, అనిపిస్తోంది. నేను నిరంతరం నీ సన్నిధిలోనే ఉంటూ, నీకు సేవలు చేస్తూ ఉండాలనిపిస్తోంది. ఈ ఒక్క వరం ప్రసాదించమ్మా. అట్లా అయితేనే నీదయతో నేను బ్రతికినందుకు సార్థకత లభిస్తుంది. నీ విధానం చూస్తూ ఉంటే, నువ్వు సామాన్య స్త్రీవి అనిపించడం లేదు. అలాగని నువ్వెవరో నాకు పూర్తిగా తెలియటం లేదు. నువ్వు నాకు అర్థమై, నా అనుభవాలను ఇతరులకు వివరించే శక్తిని నాకు ఇవ్వమ్మా! నాకు భాష రాదు. ఇంతమాత్రం మాట్లాడుతున్నానంటే ఇదంతా నీదయ. నువ్వు పెట్టిన గోరుముద్దల మహిమ." అని ప్రాధేయపడ్డాడు.

అమ్మకు బదులుగా అన్ని పనులూ తానేచేసి, అమ్మకు విశ్రాంతి కలిగించే వాడు రహి. "వద్దు నాన్నా! ఆ పనులన్నీ నువ్వు చెయ్యలేవు". అనేది అమ్మ. "నీకు సేవ చేసుకునే అవకాశం ఇవ్వమ్మా! నేను చేసేది వాళ్ళకు కాదు, నీకే. ఇంటింటా నిన్నే చూస్తాను. ప్రతి మనిషిలో, ప్రతి వస్తువులో, ప్రతి పనిలో నువ్వే కనిపిస్తావమ్మా!" అంటూ సేవా భాగ్యం ప్రసాదించమని ఆర్తిగా అమ్మను వేడుకుంటాడు రహి.

అమ్మ సేవలతో బ్రతికాడు రహి. అంటే, అమ్మ రహికి ద్విజత్వం ప్రసాదించింది. అమ్మ సన్నిధిలో అన్ని పనులూ నేర్చుకుని, చేసి, అమ్మ దయతో విద్యావంతుడు, నేర్పరి అయ్యాడు రహి. అమ్మ సన్నిధిలో రహిలోని జ్ఞాననేత్రం వికసించి, అమ్మ చరిత్రలో తాను దర్శించిన అనుభవాలకు అక్షరరూపం కూడా కూర్చగలిగాడు. అమ్మలోని దివ్యత్వానికి, అంతులేని సహనానికి, అవధులెరుగని మాతృప్రేమకు వ్యాఖ్యానం చేకూర్చ గలిగాడు.

కాలం అన్ని వేళలా ఒకే తీరుగా ఉండదు కదా! కారణాంతరాల వల్ల రహి వ్రాసిన "అమ్మ చరిత్ర" కాలగర్భంలో కలసిపోయింది. రహి కూడా కనుమరుగై పోయాడు.

"నిర్ణయానికి - నిర్ణయించిన వాడు కూడా బద్ధుడే" అని ప్రవచించిన అమ్మ అంతటి దుఃఖాన్నీ తనలోనే దాచుకున్నది. అయితే, రహి పొందిన ఆవేదనను, రహికి ఇచ్చిన మాటను అమ్మ మరచిపోలేదు.

అందుకే, ఆ తరువాత తానే స్వయంగా చెప్పి, తన చరిత్రను శ్రీ యార్లగడ్డ భాస్కరరావు అన్నయ్య చేత అక్షర బద్ధం చేయించింది. కాల క్రమంలో శ్రీరామకృష్ణ అన్నయ్య 'రహి' అనే పేరుతోనే ఆ గ్రంథానికి కావ్య రూపం కల్పించాడు.

రహి చిరంజీవి. అతడికి మరణం లేదు.

---

యథానద్యః స్యందమానా సముద్రే అస్తం గచ్ఛంతి నామరూపా విహాయ ।
తథా విద్వాన్నామ రూపద్విముక్తః పరాత్పరం పురుషం ఉపైతి దివ్యం ॥

'ఏ విధంగా నదులు సముద్రం వైపు ప్రవహించి, తమ ప్రత్యేక నామరూపాలను విసర్జించి అందులో లీనమవుతవో, అట్లే జ్ఞాని తన నామరూపం - తాను అనే భావం నుండి విముక్తుడై పరాత్పరుడైన దివ్య పురుషుణ్ణి చేరతాడు.' - ముండకోపనిషత్తు



"చంద్రుని పోలినదీ, తేజోవంతమైనదీ, తన కీర్తిచంద్రికల వలన దేదీప్యమానంగా ప్రకాశిస్తూన్నదీ, దేవతలచే పూజలు అందుకొనునదీ, కరుణాస్వరూపిణీ, పద్మాన్ని ధరించినదీ, 'ఈం' అనే బీజమంత్రానికి భావంగా విరాజిల్లుతూన్నదీ అయిన మహాలక్ష్మిని నేను శరణుజొచ్చుతాను. ఓ దేవీ! నిన్ను ప్రార్థిస్తున్నాను, నా దారిద్ర్యం తీరిపోయేలా కరుణించు."

\- శ్రీ సూక్తమ్

అమ్మ చెప్పగా భాస్కరరావు అన్నయ్య వ్రాసిన
అంతా జీవిత మహోదధిలోని కొన్ని తరంగాలు ...

ఓం హంస హంసాయ విద్మహే
పరమహంసాయ ధీమహి ।
తన్నో హంసః ప్రచోదయాత్ ॥
ఓం యశ్ఛందసామృషభో...

ఆత్మను తెలుసుకొందాము. అందు నిమిత్తం భగవంతుని ధ్యానిద్దాం. ఆ భగవంతుడు మనలకు ప్రేరణ నిచ్చుగాక...

# ఛిన్నమస్త

**[అంత జీవిత మహోదధిలో ఓ తరంగము]**

[అమ్మ తన అవతరణకు ముందు అలాగే తరువాత ఎందరికో, ఎన్నో ఆధ్యాత్మిక అనుభూతులను ప్రసాదించింది. అవతరణ అనంతరం ఎందరో అమ్మను దైవంగా గుర్తించారు. వారిలో మౌలాలి అనే జ్ఞాన సంపన్నులు ఒకరు. వయస్సులో ఉన్నప్పుడు మశూచి వలన వారి కంటి చూపు బాగా దెబ్బతింటుంది. ఈ సంఘటనలు జరిగే నాటికి అమ్మకి 11 సం॥లు నిండి 12వ సం॥ వస్తే, మౌలాలికి వృద్ధాప్యదశ నడుస్తుంటుంది. మౌలాలి అమ్మ ఏ ఊరిలో వుంటే ఆ ఊరిలో బిక్షాటనే చేసుకొని ఏ అరుగు మీదనో, ఏ చెట్టు క్రిందనో కాలం వెళ్ళబుచ్చుతూ, అమ్మ దర్శనం చేసికుంటూ, అమ్మ ధ్యాసతో వుంటూ, అమ్మకు ఎక్కడ ఏమి జరిగినా అది తన జ్ఞాననేత్రంతో అవలోకిస్తూ, తనకు వచ్చిన సందేహాలను నివృత్తి చేసికుంటూ అమ్మననుసరించి వుండేవారు. ఆ సందేశ / సంభాషణ లోని ఒక భాగమే ఈ చిన్ని "తరంగం".]

భావనారాయణ స్వామి దేవాలయం వద్ద చింపిరి గుడ్డలతో ఒక సాయిబు ఎదురు వస్తాడు. చాలా సుస్తీగా వుంటాడు. అమ్మను జూసి అమ్మ ఎటు నడిస్తే అటు తలతిప్పుతూ కన్నార్పకుండా అమ్మ వంకనే చూస్తుంటాడు. అమ్మ కూడా అతని వంకనే చూస్తుంది. పాపం, నా కోసమే చూస్తున్నాడు కాబోలు ననుకొని, అమ్మ దగ్గిరకు వెళ్ళి ఏం నాయనా అనగానే చేతులు చాచి అమ్మను తన పొట్టలోకి తీసికుని తలను గుండెల దిమి పట్టుకుని ముద్దు పెట్టుకుంటాడు. దగ్గరకు వచ్చేటప్పటికి యెంత చిన్న పిల్లవయినావమ్మా? ఇందాక చాలా భారీ మనిషిలాగా కన్పించావు. యెందుకనమ్మా ఇంత త్వరగా మారిపోయావు? అంటాడు.

అమ్మ : నీకేం కావాలో చెప్పు నాయనా?

సాయిబు : నాకు నీవే కావాలమ్మా.

అమ్మ : నేను వచ్చానుగా, యెందుకేడుస్తావు?

సాయిబు : యేడుపు కాదమ్మా, ఆనందం. నేను పుట్టటం సాయిబు ఇంట్లో పుట్టినా ఒక కోమటి యింట్లో పెరిగాను. ఆ ఇంట్లో అందరూ బ్రహ్మంగారి భక్తులు. అందువల్ల నాకు ఈశ్వరమ్మ అంటే చాలా ఇష్టం. ఈశ్వరమ్మ గురించి చదివేటప్పుడు ఒక రూపాన్ని నిర్ణయించుకున్నాను. నేను నిర్ణయించుకున్న రూపమే మీలో చూసాను, మీలో చూట్టం ఏమిటి? మీరే ననుకున్నాను. మీ రూపం చూస్తుంటే క్షణ క్షణం జరిగే మార్పు చాలా చిత్రంగా వుంది. మీ బస యెక్కడమ్మా?

అమ్మ : బస అంటే సభ అనా?

సాయిబు : కాదమ్మా, నీవు చదువుకోలా?

అమ్మ : ఈశ్వరమ్మ నంటివిగా, ఇంక చదువెందుకు?

సాయిబు : అవుననుకోమ్మా, మామూలుగా అడిగాను. మీ ఇంటికి తీసికెళ్ళమ్మా. అసలు మీ ఇల్లెక్కడ?

అమ్మ : స్టేషన్ దగ్గర, ఆస్పత్రికి ఎదురు.

సాయిబు : ఇప్పుడు నీవు యెక్కడికి పోతున్నావమ్మా ?

అమ్మ : చదలవాడ సుబ్బారావుగారి ఇంటివైపు వెళుతున్నా

సాయిబు : మా ఇల్లు కూడా అటేనమ్మా. మీరెవరింటికి కెళతారమ్మా ?

అమ్మ : మంత్రి కిష్టయ్య గారింటికి.

సాయిబు : ఓహో, ఆయనింటికా? ఆయన నాకు చాలా కాలం నుండి తెలుసు. ఆయన మీకు ఏమవుతారమ్మా?

అమ్మ : నాకు తాతగారు అవుతారు.

సాయిబు : ఆయనకు యెవరూ అంత పెద్ద కూతుళ్ళు, కొడుకులు లేరే తాతగారయ్యేందుకు.

అమ్మ : వున్నా లేకపోయినా, నాకు తాతగారయినాడు.

సాయిబు : యెటువంటి తల్లి ఆయనకు మనుమరాలయిందని మనస్సులో అనుకుని - తిరిగి మీ ఇంటికే వెళదాం. రేపు వెళదాం తాతగారింటికి - అంటాడు.

సరేలే, నీవు ఇక్కడే వుండు. నేను వెళ్ళొస్తా అని అమ్మ ఒక అణా పెట్టి అరటిపళ్ళు తీసికుని వెళ్ళిపోతుంది.

అమ్మ తిరిగొచ్చి గుడి దగ్గర సాయిబును కలుసుకుని ఇల్లు చేరుతుంది.

అమ్మ సాయిబును చిటికేశ్వరపు చెట్టు క్రింద కూర్చోబెట్టి ఇంట్లోకి వెళుతుంది. నాన్నగారు, భారతాంబగారు, తాతగారు అంతా భోంచేస్తూ వుంటారు. అమ్మ సరాసరి పైకి వెళ్ళి పడుకుంటుంది.

చిదంబరర్రావు తాతగారు భోంచేసి భారతం చదువుతూ కూర్చుంటారు.

భారతాంబగారు, నాన్న గారు మాట్లాడుతూ గదిలో కూర్చొంటారు.

అమ్మ మేడమీద నుంచి దిగివచ్చి వంట మనిషిని అడిగి ఒక మనిషి అన్నం పెట్టించుకుని తీసుకువచ్చి సాయిబుకు పెడుతుంది. నాయనా, నీవు ఇక్కడే వుండు. అందరూ పడుకున్న తరువాత వచ్చి మాట్లాడుతానని అమ్మ తాతగారి దగ్గరకు వచ్చి కూర్చొంటుంది.

చిదంబరరావు తాతగారు భారతం చదవడం అపి, యే భాగవతం నడిపి వచ్చావు? అంటారు.

అమ్మ : నడిచేదంతా భాగవతమే!

తాతగారు : అదే, నీవు నడిపేదేగా?

అమ్మ : వెళ్ళి నాన్నను చూసొచ్చాను. వెళ్ళేటప్పుడు దారిలో భలే విచిత్ర మైన ఘట్టం జరిగింది తాతగారూ!

తాతగారు : నీకు విచిత్రమైన దేమిటమ్మా?

అమ్మ : ఎవరో ఒక ముసలివాడు కట్టుకోవడానికి గుడ్డలు లేకుండా చిరిగిపోయిన బట్టలు, శుష్కించి పోయిన శరీరం, మహా ఆర్తిగల మనస్సు, తిండికి కూడా లేనట్టు వుంది. యేమయినా ఇద్దామంటే నా దగ్గిరా ఏమీ లేదు.

తాతగారు : మన ఇంటికి తీసుకు రాక పోయినావా.

అమ్మ : తీసుకొస్తే ఏం చేస్తారు?

తాతగారు : మనతోపాటు పట్టెడన్నం తినేవాడు.

అమ్మ : మీరందుకు సిద్ధపడితే ఇప్పుడు మాత్రం రాడూ?

తాతగారు : అడుక్కోవటానికి వస్తే రోజూ ఇంతన్నం తీసుకువెళ్ళి పెట్టు.

అమ్మ : అతను అడుక్కునేవాడు కాడు. అతని పరిస్థితి నాకు బాగా తెలియదు. కలిసి మాట్లాడలేదు.

తాతగారు : నీకు ఎట్లా ఉత్సాహంగా వుంటే అట్లా చేద్దాం, అతన్ని కనుక్కో.

అమ్మ : గుర్తులు చెప్పి వచ్చాను, వచ్చేడేమో వాకిట్లోకి వెళ్ళి చూస్తా.

అమ్మ వాకిట్లోకి వెళ్ళేటప్పటికి సాయిబు అమ్మనే ధ్యానం చేస్తుంటాడు. అమ్మ వెళ్ళి దగ్గర కూర్చున్నా గమనించడు.

అమ్మ : నాయనా (సాయిబు పలకకుండా ధ్యానం చేస్తుంటాడు).

అమ్మ అతను లేచిందాకా వుండి, నాయనా ఇల్లు చూపించానుగా. నీకు యెప్పుడు వీలయితే అప్పుడు వస్తూ వుండు. అన్నం కోసం బాధపడకు. ఇక్కడికేరా. తరువాత నేను ఊరికి వెళ్ళేటప్పుడు తాతగారికి చెప్పిపోతా. ఇంకా ఇక్కడ నేను నాలుగు రోజులుంటానని అమ్మ అంటుంది.

సాయిబు : సరే, వెళ్లొస్తానమ్మా.

అని పై గుడ్డ దులిపి భుజానేసుకుని అమ్మకు సాష్టాంగ నమస్కారం చేసి వెళతాడు.

చిదంబరరావు తాతగారు ఊరెళ్లగనే అమ్మ మెల్లగా సీతాపతి తాతగారున్న చోటికి వెళ్ళటానికి ప్రయాణమవుతుంది. నిన్న కనపడ్డ సాయిబు కనబడతాడేమోనని బజారు వెంట వెతుక్కుంటూ వెళుతుంది. యెక్కడా కనబడడు. సీతాపతి తాతగారి ఇంటి సమీపానికెళ్ళగనే పై నుంచి వస్తుంటాడు. అతన్ని చూసి అమ్మ అక్కడే నిల్చుంటుంది. అతను అమ్మను చూడడు. తలవంచుకుని వస్తుంటాడు. అమ్మ గబగబా అతని దగ్గరకు వచ్చి నిల్చుంటుంది. సాయిబుకు కంటి మసక ఉంది. అసలు నీపేరేమిటి నాయనా? అని అమ్మ అడుగుతుంది.

సాయిబు : నా పేరు మౌలాలి.

అమ్మ : అసలు నీ ఉద్దేశ్యమేమిటో చెప్పు నాయనా! ఏం కావాలేమిటి?

మౌలాలి : నాకేమి వద్దమ్మా, నీవు కావాలి.

అమ్మ : నేనున్నా అన్నీ కావలసినదేగా?

మౌలాలి : నన్ను నీ దగ్గరే ఉంచుకోమ్మా.

అమ్మ : నేను ఒక చోట ఉండను కదా, యెట్లా వుంచుకోను, వుంచుకోవటం అట్లా వుంచి నీకేదైనా జీవనానికి వుందా?

మౌలాలి : యేమీ లేదు తల్లీ.

అమ్మ : నేను ఏదైనా ఇస్తా, తీసికొని, దానితో చీరాల ఆస్పత్రి దగ్గర నాను రొట్టె, బన్ అమ్ముకుంటూ ఉండు. దానికి బాగా ఖర్చు అవుతుందని జడ కుప్పెలు తీసిస్తుంది. అవి చేతిలోపెట్టి - బాధపడబోకు నాయనా, మళ్ళీ నీవు సంపాదించిన తరువాత నాకు ఇద్దువు గానిలే.

మౌలాలి : మీ ఇంట్లో వాళ్లు నిన్నేమన్నా అనరా అమ్మా? ఇంట్లో వాళ్ళు అనేదేమిటిలే, ఇవేసుకుంటే చక్కగా వున్నావు చిట్టి తల్లీ. నాకీ బంగారపు వస్తువులెందుకమ్మా. నీ దగ్గర అట్టే పెట్టుకుని పట్టెడన్నం పెట్టు.

అమ్మ : నేను వూళ్ళో ఉండనుగా, యెల్లుండి వెళ్ళిపోతున్నా.

మౌలాలి : నీవు ఎక్కడికెళితే అక్కడకొస్తానమ్మా.

అమ్మ : అక్కడి వాళ్ళు నీకు అన్నం పెడుతుంటే వూరుకోవద్దూ?

మౌలాలి : ఊళ్ళో అడుక్కుతిని నీదగ్గర వుంటానమ్మా.

అమ్మ : సరే, రా. సంపాదించుకుంటే రేపు లేవలేని రోజుల్లో అక్కరకొస్తాయి.

మౌలాలి : నేను లేవలేని రోజున నువున్నావుగా అమ్మా.

అమ్మ : నేను ఎప్పుడూ అక్కడే ఉంటానని నమ్మకమేమిటి?

మౌలాలి : నిన్ను బాధించకుండా, నువ్వు వున్న వూళ్ళో ఉండి దూరంగా ఉండే నమస్కారం చేసికుంటానమ్మా.

అమ్మ : సరే పోదాం రా, నీకు భార్యా, పిల్లల్లేరా?

మౌలాలి : లేరమ్మా. తల్లి, తోడు, నీడ, అన్నీ నీవే.

అమ్మ : సరే, ఇక్కడే కూర్చో, నే వెళ్ళి మా నాన్న గారితో ప్రయాణమెప్పుడో అడిగొచ్చి నిన్ను తీసికెళతాను.

అమ్మ తాతగారి దగ్గరకు వెళ్ళి నాన్నా, ఎప్పుడెళదాం మన్నవ?

సీతాపతి తాతగారు : యెప్పుడో అప్పుడు వెళదాం, తొందరేం ?

అమ్మ : తాతమ్మ ఒక్కతే ఉంది.

సీతాపతి తాతగారు : పర్వాలేదు, వెళదాంలే, నేను వచ్చి చెపుతాలే యెప్పుడు వెళ్ళేది.

అమ్మ : సరే అయితే నేను వస్తా

తాతగారు మెదలకుండా వూరుకుంటారు. అమ్మ వచ్చేస్తుంది. సాయిబు దగ్గరకు వచ్చి నాయనా!, నేను యెప్పుడు వెళితే అప్పుడు తీసికెళతాను.

మౌలాలి : సరే, నేను వాకిట్లో నే వుంటానుగా పోదాం పద.

అమ్మ : నువ్వు మెల్లగా రా. నేను తాతగారిని కలుసుకోవాలి, పనుంది.

అని అమ్మ ముందు నడిచి వెళ్తుంది. తాతగారు ఇంకా రాలేదు.

మౌలాలి మెల్లగా నడిచి వస్తూంటాడు.

అమ్మ అతని కోసం ఎదురు చూస్తూ కూర్చుంటుంది. అతను ఎంతసేపు చూసినా రాలేదు. ఉదయం 9.30 గంటలు అవుతుంది. వంట అవుతుంది. అమ్మ వంట మనిషి దగ్గిరకు వెళ్ళి మీరు వెళ్ళేలోగా ఒక మనిషి అన్నం నా చేతికిచ్చి వెళ్ళండి. వంటమనిషి అట్లాగే అమ్మా అని విస్తట్లో పెట్టి అమ్మకు ఇస్తుంది. మౌలాలి వస్తాడు. అమ్మ అతనికి అన్నం పెడ్తుంది. యింతలో సీతాపతి తాతగారు వచ్చి ఎల్లుండి ప్రయాణమని చెప్తారు. మధ్యాహ్నం ఒంటి గంటకల్లా చిదంబరరావు తాతగారు వస్తారు. భోజనం చేయకుండానే వస్తారు.

అమ్మ : తాతగారు, నేను అన్నం పెడ్తా, తింటారా?

చిదంబరరావు తాతగారు : ఎందుకు తిననమ్మా, అంతకంటే కావలసినదేమిటి.

అమ్మ తాతగారికి అన్నం పెడుతుంది. అందరూ నిద్దర్లుపోతుంటారు.

చిదంబరరావు తాతగారు : మళ్ళీ ఎప్పుడు పెడతావు తల్లీ, బంగారు చేతులతో?

అమ్మ : ఎప్పుడో, నాకు మీకు పెట్టే యోగ్యత ఉంటే అప్పుడు. మా ప్రయాణం ఎల్లుండి, తెల్సిందా మీకు?

చిదంబరరావు తాతగారు : మొన్న యెవరితోనో నీవంటుంటే విన్నాను. ఆ సాయిబు సంగతి ఏం తేలింది?

అమ్మ సాయిబుతో జరిగిన సంభాషణ అంతా చెప్తుంది.

చిదంబరరావు తాతగారు: మనకు బరువు లేకుండా, అతను అడుక్కు తింటే యిబ్బందేముంది? ఒకప్పుడు మాత్రం బరువేముందనుకో, ఒక మనిషికి అన్నం పెట్టడం బరువు కాదు కదా. అది ఇంట్లో వాళ్ళ యిష్టా యిష్టాల మీద ఉంటుంది. ఇటువంటి వాటికి తాతమ్మ ఏమనదుగా, తాతమ్మ అన్నం పెడ్తుంది. ఆమెకేం సందేహం లేదు. వచ్చేటప్పుడు మంచిగానే వస్తారు. తరువాత మళ్ళీ వాళ్ళ బాధ్యతను వాళ్ళు గుర్తుంచుకోరు, మర్చిపోతారు.

అమ్మ : ప్రాప్తమునన్నాళ్ళు వుంటాడు. తరువాత అతని దారిన అతను వెళతాడు.

చిదంబరరావు తాతగారు : అంతేననుకో, అతన్ని చూడలేదు, ఏడీ? అతనెక్కడ వున్నాడు?

అమ్మ వాకిట్లోకి వెళ్ళి చిటికేశ్వరపు చెట్టు క్రింద వున్న సాయిబును లోపలకు పిల్చుకొని వచ్చింది. మౌలాలి చిదంబరరావు తాతగారికి నమస్కారం చేస్తాడు. చిదంబరరావు తాతగారు కూడా చేస్తారు. ఇద్దరూ ఒకర్ని ఒకరు చూసుకుని నవ్వుకుంటారు.

అమ్మ : పది రూపాయలిద్దాం! ఏదో తగిన వ్యాపారం చేసికోమని చెప్పండి తాతగారు.

చిదంబరరావు తాతగారు : యేమిటి నాయనా ? ఏమిటి నీ జీవనం ?

మౌలాలి : ఏముంది నాయనా, నాది అసలు నాగులపాడు. మా తాతలు ఎవరో, ఈ వూరు వచ్చారు. మా నాన్నగారు కృష్ణ భక్తుడు. నాకు చిన్నప్పటి నుండి బ్రహ్మంగారంటే చాలా యిష్టం. మా ఆస్తంతా పోయింది. బంధువులందరూ పోయారు. ఒక్కడినే మిగిలాను. తల్లి లేదు. తండ్రి లేడు. తల్లి లేదంటున్నాను, దరిద్రుడ్ని, తల్లి దొరికింది. ఆ బ్రహ్మంగారి మనుమరాలు ఈశ్వరమ్మ, నాకు ఈ అమ్మగా కన్పించింది. ఈమెకు, ఆమెకు భేదం లేదనుకున్నా. నేను సిద్ధయ్యంత కాకున్నా కనీసం "అమ్మను" గుర్తు పెట్టుకునే స్థితన్నా ఉంటే చాలు. ఒదిలిపెడ్తే ఆ గుర్తు కూడా ఉండదుగా, అందుకని అమ్మను దగ్గరుంచుకొనే స్థితి లేదు. కనుక, దగ్గర ఉందామని, నాకోసం ఏడ్చేవారెవ్వరూ లేరు. నన్ను చూసి సంతోషించేవారూ లేరు. అందుకే అమ్మను కష్టపెట్టకుండా ఎక్కడైనా అడుక్కొచ్చుకుని తింటూ, అమ్మను చూస్తూ, మీ పంచలో ఉంటాను.

చిదంబరరావు తాతగారు : సరే నీ యిష్టం, దూరమాలోచించుకో. అమ్మాయికి వివాహమైతే అత్తారింటికి పోతుంది. అప్పుడు ఎక్కడుంటావు?

మౌలాలి : అప్పుడు ఏ వూరెళ్తే ఆ వూళ్ళో అడుక్కుంటా.

చిదంబరరావు తాతగారు : సరే నీ యిష్టం, అన్నింటికి సిద్ధపడున్నావు, కనుక ఒకరి సలహాతో ఏం పనుంది? రేపు ప్రయాణం, అన్నం తీసికొచ్చి పెట్టు అంటారు అమ్మతో.

మౌలాలి : ఇందాకనే పెట్టిందయ్యా.

చిదంబరరావు తాతగారు : లోపలికి పోదాం పదమ్మా.

రెండు నెలలు గడిచిపోతాయి. అమ్మ మన్నవ గ్రామంచేరింది.

మౌలాలి యీ రెండు నెలల నుంచి దొప్పలపూడిలో అడుక్కుతింటూ అమ్మను చూచిపోతూ వుంటాడు. ఒక రోజున వాకిట్లోకి వస్తాడు. మధూకరం కోసం అమ్మ ముద్ద వేయటానికి వాకిట్లోకి వెళుతుంది.

మౌలాలి : యెందుకమ్మా అట్లా వున్నావు.

లోపల నుండి సుబ్బమ్మ కేక - యేమిటి అడక్కుండా, పెట్టకుండా మూత దీసి - యీ కేక వాకిట్లోకి విన్పిస్తుంది. అతను అన్నం పెట్టించుకోవటానికి బాధపడతాడు. నేను అన్నం కోసం రాలేదమ్మా. నిన్ను చూడటానికి వచ్చాను. అన్నం తీసుకెళ్ళి గిన్నెలో వేసిరా అమ్మా.

అమ్మ : అట్లా వద్దు నాయనా, నీకు తెచ్చిన అన్నం మళ్లీ గిన్నెలో వేస్తే పోట్లాడుతారు.

మౌలాలి మాట్లాడటం చూసి, యెవరా అబ్బాయి? యెందుకు ఇంతసేపు మాట్లాడతావు. అడుక్కునే వాళ్ళతో యేమాలోచనట? చిన్నప్పుడు లేనిది పెద్దప్పుడు వస్తుందా? యెందుకు మగవాళ్ళతో ఇంతసేపు ఆలోచన? అని అంటుంది సుబ్బమ్మగారు (అమ్మ మేనత్త).

"జీవితంలో ఇదే ప్రారంభం అనుమానించటానికి" అనుకుంటుంది అమ్మ.

మౌలాలి : నేను రానులేమ్మా, యెప్పుడన్నా ప్రాప్తముంటే చూచి పోతూ వుంటా.

మర్నాడే సుబ్బమ్మగారు, పిల్లలు గరికపాడు వెళ్ళాల్సొస్తుంది. రాఘవరావు మావయ్య తెనాలిలో వున్నారు. మరిడమ్మ తాతమ్మ బాపట్లలో వున్నది.

అమ్మ అచ్చగా ఆ రోజు నుండి తోటలోనే వుంటుంది. పదకొండు రోజులు ఒకే చెట్టు క్రింద కదలకుండా కూర్చుంటుంది. 12వ రోజు కళ్ళు తెరిచేటప్పటికి నాలుక విరుచుకు పోతుంటుంది. దగ్గరలో యెక్కడా మంచి నీళ్ళు లేవు. ఆ చెట్టు మాను వంకను ఒక అర గంట చూస్తూ కూర్చొంటుంది. మాను పగిలి పోతుంది. ఆ పగిలిన చప్పుడికి వచ్చే ధ్వని "ఓంకార" ధ్వనిగా, పెద్ద మోతగా, పిడుగు పడినట్లుగా వూరంతా వినిపిస్తుంది. వెంటనే మేఘాలు పట్టి పెద్ద వర్షం కురుస్తుంది. వూరంతా చల్లబడుతుంది. ఆ సంవత్సరం ఆ గ్రామానికదే తొలకరి వాన. అయిదు రోజుల్లో భూమంతా పచ్చబడుతుంది. అమ్మ ఆ వానలో అక్కడే వుంటుంది. అది పగిలినపుడు దానిలో నుండి నురుగు నురుగ్గా కారుతుంటుంది. అమ్మ పోయి దోసిళ్ళతో రసం తాగుతుంటుంది. అమ్మ దాహం తీరేదాకా కారుతుంది. దీనిని "తింత్రిణీ సుధ" అంటారు. యెటు చూసినా నాగజెముడుమట్ట, చింతలు. ఆ చింతల్లోని చింతే నా దాహన్ని తీర్చిందను కుంటుంది అమ్మ. యెప్పుడూ నాకు చింతలే కావాలి, చింతే నీడనిచ్చింది. చింత అండన యెండ తీర్చుకున్నాను. చింత రసమే దాహం తీర్చింది. రేపు నేను ఈ వూరి నుండి వెళ్ళేటప్పుడు కూడా యీ చింతనే తీసుకెళతాను. యీ చింత నా చెంతనుండి నా మనస్సుకు యే చింతా లేకుండా చేస్తుంది.

ఒక పరికిణీ చొక్కాతో ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ, అక్కడే ఇంకో పదకొండు రోజులు గడుస్తాయి, అప్పటికి మొత్తం 23 రోజులు.

మౌలాలి దొప్పలపూడిలో అడుక్కుంటూ రోజూ తోటలో అమ్మ దగ్గిరకొచ్చి వెళుతూ వుంటాడు.

అన్ని రోజులు ఇంటికి రాకపోయినా అమ్మ ఏమయిందని ఇంటివద్ద వారు ఆలోచించరు. 23 రోజులు ఇలాగే గడిచిపోతాయి చెట్టు క్రింద. మౌలాలి ఎక్కువ కాలం తోటలోనే వుంటాడు. మౌలాలికి యేవేవో క్రొత్త క్రొత్త అనుభవాలు కలుగుతుంటాయి. ఏ రోజుకారోజు యీ తల్లి ఈశ్వరమ్మ తల్లి కంటే గొప్పది. యీ తల్లి ఇట్లా లోలోపల ఎంత మందిని తరింప చేస్తున్నదోనని మనస్సులో అనుకుంటుంటాడు.

అమ్మతో - యేవమ్మా యేనాటికైనా బయటకు వస్తావా? నీకు తెలీకుండానే నీ శక్తులే నిన్ను బయటకు రప్పిసాయేమోలే! నీ గురించిన వూహలు వస్తున్నాయి గాని వాటిని సరిగా వివరిద్దామంటే నాకు చదువు లేదు.

**యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి,**

**యత్ ప్రయంత్యభి సంవిశంతి; తత్ విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి**

ఎందునుండి ఈ ప్రాణులన్నీ జనించునో, జనించి ఎందులో జీవించునో, మరణానంతరం దేనిలో పూర్తిగా లయమగునో....... అదే బ్రహ్మం.

- తైత్తిరీయ ఉపనిషత్

కదమ్మా. అమ్మా! కూర్చుంటే ఏదో మైకంగా వుంటుంది. ఆ మైకంతో నే మాట్లాడక పోయినా నీతో మాట్లాడుతున్నట్లుంటుంది. రకరకాల రూపాలు కనబడతాయి. ఎన్ని రూపాలు కనబడ్డా నీవే ననిపిస్తుంది. ఎవరో, ఏమిటోలే ననిపించదు. నీ కంటే చిన్న పిల్లల్లు కనబడ్డా, నీవే ననిపిస్తుంది, ముసలి వాళ్ళట్లు కనిపించినా నీవనే అనిపిస్తుంది. పురుషులు, స్త్రీలు ఎవరు కనుపించినా, అట్లాగే. అది వరకు ఇంత లేదు. వారం రోజుల నుండి జాస్తిగా అనిపిస్తున్నది. యెక్కడయినా చెడు వాసన వచ్చి ముక్కు మూసుకుంటే వెంటనే అందులో నుంచి మంచి వాసన వస్తుంది. మంచి వాసన గల వస్తువు ముక్కు దగ్గర పెట్టుకుంటే దుర్వాసన వస్తుంది. వస్తువు తీసేసినా ఆ వాసన పోదు. ఒక అనుభవమేమిటి, యేదని చెప్పేది? అన్నం బాగా పెడతారనుకున్న ఇంట్లో పెట్టరు అన్నం. సరిపోతుందనుకున్ననాడు సరిపోదు. నా తిండి ప్రమాణం కూడా నాకు తెలియదు. ఆకలి లేదు కదా కొద్దిగా తిందామనుకున్ననాడు ఎక్కువ పోతుంది. ఆకలిగా వుంది, తిందామనుకున్న నాడు పోదు. ఇదంతా ఏమిటి? అది సరే, నిన్ను వదిలి వెళ్ళి అడుక్కుందామనిపించటం లేదమ్మా. అన్నింటికీ నిన్నే నమ్ముకున్నపుడు ఆకలి మాత్రం నీవు తీర్చవూ? ఇవన్నీ చూస్తే "నా ప్రయత్నం" లేదని స్పష్టంగా తేలిపోతున్నది.



అమ్మ ఇవన్నీ వింటూ కళ్ళు మూసుకుని తలవంచుకుని అట్లాగే కూర్చుంటుంది. అలా కూర్చున్న కూర్చోవటం అయిదు రోజులు కూర్చుంటుంది.

మౌలాలీ అమ్మను చూస్తు అమ్మలో కల్సిపోయినవాడిలాగా, చైతన్యం లేనివాడిలాగా కన్ను ఆర్పకుండా కూర్చుంటాడు.

అమ్మ వంటి మీద వాలుతున్న అనేక రకాల పక్షులను కొట్టాలని అనుకుంటాడు, కాని కొట్టలేడు. అనేక రకాల పురుగులు పాకుతూ వుంటాయి, తీసి వేద్దామనుకుంటాడు, చేతులు లేవవు, కాళ్ళు కదలవు, కనురెప్ప కొట్టడానికి కూడా స్వాధీనం కాదు శరీరం. కనబడ్డది గుర్తిస్తాడే కాని సంకల్పాలు రావు. ఇట్లా 5 రోజులు గడిచిపోతాయి.

యః ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవా ।
యస్య ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ ॥

ఎవరు మనలను మనకు ఇచ్చారో, మనకు బలిమిని ఒసగారో, ఎవరి ఆనతిని యావన్మంది దేవతలూ శిరసావహిస్తారో, ఎవరి నీడ మరణరహిత శాశ్వతస్థితియో, అట్లే ఎవరి నీడ మృత్యువో ఆ భగవంతుని ఆహుతులతో ఆరాధిస్తాము.

- హిరణ్యగర్భః సూక్తమ్

ఆ రోజు పౌర్ణమి, నిండు పౌర్ణమి. ఆ రాత్రి 12 గం॥ లప్పుడు అమ్మ చుట్టురా చుట్టేసుకొని, పైన గొడుగులాగ పడగ లిప్పి లెక్కలేనన్ని శిరస్సులతో అమ్మ తలకు అర్ధ గజం ఎత్తున అనేక రంగులతో ఆ వెన్నెల కాంతిలో మెరిసిపోతూ, ఆ కాంతిలో తలలూపుతూ ఆడుకుంటున్నట్లు కనబడుతుంది. భ్రమా, నిజమా అని అమ్మ దగ్గిరకు వెళ్ళి చూస్తాడు. ఇంకా బాగా స్పష్టంగా కనబడుతుంది.

దగ్గిరకు పోయినకొలది గొడుగు ఆకారంగా ఒక్కొక్క శిరస్సు ఒక్కొక్క గొడుగు కడ్డీగా కనబడుతుంది. పాము చర్మం గొడుగు గుడ్డలా వుంటుంది. క్రిందవైపున పాము చర్మము గొడుగు కర్రలా వుంటుంది. పామును అమ్మ పట్టుకున్నట్లు ఇంకా చూడగా చూడగా విష్ణుమూర్తి, శేషశాయి మాదిరిగా అమ్మ పడుకుని కనబడుతుంది. అమ్మకు ఆదిశేషుడు గొడుగై యెండకు, వానకు కాపాడుతున్నాడను కుంటాడు. అలా చూస్తుండగానే అనేక రూపాలు వస్తాయి. అమ్మను కాపాడుతున్నాడని అమ్మ వంకనే చూస్తుండగా రూపాలన్నీ పోయి అమ్మ ఒక్కతే కిరీటంతో వర్ణించవీలులేని రూపంతో అనేకమైన తలలతో కనబడుతుంది. అన్నీ పోయి అమ్మ ఒక్కతే కనబడుతుంది. అప్పుడు - అమ్మను కాపాడడమేమిటీ, అన్నీ అమ్మ రూపాలే అయితే ననిపిస్తుంది.

'యిటువంటి మహత్తరమైన దృశ్యాలను చూడాలనుండేది. అమ్మకు నా యిష్టము తెలుసు గనుకనే నన్నిలా తరింపజేసింది. ఇక నాకు జన్మ లేదు. నా ఈ జన్మకు మూలమే ఈ అమ్మ. యిప్పుడు కనిపించిన అవతారాలకూ మూలం అమ్మే. అన్నింటికీ "అమ్మే" మూలం అని గుర్తించటమే - జన్మ తరించటం. గుర్తించటం అంటే మాటలతో కాదు, మనోవాక్కాయకర్మల ద్వారా గుర్తించటం. అదే బ్రహ్మను తెలుసుకోవడం. బ్రహ్మంగారు చెప్పింది కూడా ఇదేగా, బ్రహ్మంగారు చెప్పారు, అమ్మ చూపించింది.' అని తన్మయత్వంతో తనలోతాను మాట్లాడుకుంటుంటాడు.

అమ్మ కళ్ళు తెరిచి మామూలుగా కూర్చొని యేమిటి మౌలాలీ, నీలో నీవే మాట్లాడుకుంటున్నావు?

మౌలాలీ : ఏమీ లేదమ్మా! నేను కూడా భగవంతుణ్ణి నని గుర్తిస్తున్నాను. అదేగా బ్రహ్మంగారి తత్వాలలో చెప్పేది. నేనే బ్రహ్మనురా అనేగా?

అమ్మ : అయితే నీవు బ్రహ్మవైనావన్న మాట.

మౌలాలీ : నిన్ను బ్రహ్మంగా గుర్తించాను కనుక నేను బ్రహ్మనైనానా? యేమిటోనమ్మా, ఇప్పుడు అంతా తెలిసినట్లుంది. గోడలు అడ్డం లేవు, ఇప్పుడు నిన్ను వదలిపెట్టి వుండగలనేమోనమ్మా!

**ఓం సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।**
**స భూమిం విశ్వతో వృత్వా । అత్యతిష్ఠ ద్దశాంగులమ్ ॥**

భగవంతుడు వేలాది తలలు గలవాడు, వేలాది కన్నులు గలవాడు, వేలాది పాదాలు గలవాడు; భూమండలం యావత్తూ వ్యాపించి పది అంగుళాలు పైన నిలిచాడు.

- పురుష సూక్తమ్

అమ్మ : నిన్నటికి, ఈ రోజుకూ వచ్చిన మార్పేమిటి మౌలాలీ?

మౌలాలీ : నిన్న ఈ స్థితి లేదు కదా, నీకు తెలీకుండానే నాకు తెలుసునా అమ్మా? యిదయినా నువ్వు ప్రసాదించిందే గదా!

అమ్మ : నాకేం తెలియదు నాయనా.

మౌలాలీ : పాపం, నీకేం తెల్సు చిట్టితల్లివి. అనేక రూపాలతో ప్రపంచం చుట్టుముట్టేశావు.

అమ్మ లేచేటప్పటికి తెల్లవారు ఝామున నాలుగు గంటలు అవుతుంది. నాగజెముడు పళ్ళు కోసుకొచ్చి మౌలాలీకి పెడుతుంది. మౌలాలీ ఆ పళ్ళు చూసి, నాకు ఇప్పుడేమీ తినాలని లేదమ్మా. ఈ దృశ్యాలు చూడక ముందు యీ పళ్ళు తిందామనుకున్నా, ఈ తోటలోనే వుండి యీ పళ్ళు తింటూ కాలం గడుపుదామనుకున్నా అంటూ చేతికి తీసికుని తింటాడు.

అమ్మ : ఈ రోజు ఇంటికి వెళ్ళి వస్తా మౌలాలీ.

మౌలాలీ : నేను ఇక్కడే వుంటానమ్మా, సరే పోయిరా.

అమ్మ ఇంటికి వెళుతుంది. అమ్మ ఇంటికి వేళ్ళే ఒక గంట ముందు తాతమ్మ గారు వచ్చి వుంటుంది. నల్లఖాసిం, తాతమ్మగారు, సీతాపతి తాతగారు కూర్చొని పెళ్లికబుర్లే చెప్పుకుంటుంటారు. అమ్మను జూచి నల్లఖాసిం యేం అమ్మా 20 రోజుల క్యాంపు కొట్టావు. తాతమ్మగారితో కూడా తిరుగుతున్నావా?

తాతమ్మ : నే తీసికెళ్ళలేదురా, ఇక్కడే వదలిపెట్టి వెళ్ళాను.

తాతగారు : నాకూ తెలియదు, మీతో వచ్చిందనుకుంటున్నా.

తాతమ్మ : అయ్యో తల్లీ, ఎక్కడ తిరుగుతున్నావే?

అమ్మ : ఎక్కడకీ వెళ్ళటంలా.

తాతగారు : యెక్కడికి పోతుందిలే, చింతలపూడి నరసింహంగారి ఇంట్లో వుందో, వాళ్ళ పిన తండ్రి అంబారావుగారి ఇంట్లో వుందో?

నల్లఖాసిం : నేను వెళ్ళానయ్యా మొన్న, ఎక్కడా కనబడలేదయ్యా.

తాతగారు : మన ఆలోచన లెందుకు? ఫలానాచోట వున్నానని అది చెప్పకూడదూ?

అమ్మమ్మ : నీవు వెళ్ళిన తరువాత రెండ్రోజులు కన్పించింది. సుబ్బమ్మోదినా వాళ్ళు వెళ్ళిన తరువాత అసలే కనిపించలా, వాళ్ళతో వెళ్ళిందనుకున్నాం. అని తాతమ్మతో అంటుంది.

తాతమ్మ : ఇంత పట్టించుకోకపోతే ఎలా నాయనా ? పసిబిడ్డ కదా, నేను మీరంతా వున్నారని కదా, వదిలి వెళ్లింది?

తాతగారు : ఇంట్లో ఉంటే సరిపోయేది. ఎక్కడో ఉంటే ఎవరు కనిపెట్టి ఉంటారు?

అన్నం తిందువుగాని రా అంటుంది అమ్మమ్మ.

ఉదయం 11 గం॥ అవుతుంది. పిలవంగానే అమ్మ వెళ్లి అన్నం తింటుంది. అందరూ అన్నాలు తిని పడుకుంటారు.

అమ్మ అన్నం తీసుకుని తోటలోకి వెళుతుంది.

మౌలాలి భోం చేస్తాడు. ఇంకా చాలా జంతువుల క్కూడా ఆహారం వేస్తుంది.

'నీ వాలకం చూస్తే కాశీ అన్నపూర్ణమ్మ తల్లి వలె వున్నావమ్మా, ఒకరికి అన్నం తెచ్చి ఇంతమందికి పెట్టావు. ముందు ముందు ఇలాగే చేస్తావనుకుంటా.' అని అంటాడు మౌలాలి.

అమ్మ : నీకే నయం మౌలాలి, రాబోయే సంగతులు తెలుస్తున్నాయి.

మౌలాలి : నీ దయ ఉంటే తెలియకేం అమ్మా!

అమ్మ : నా దయేమిటి.

మౌలాలి : నీ దయే లేకపోతే ఎక్కడో తోటలో కూర్చొని భగవంతుడితో అన్నం తెప్పించుకుని తింటానా అమ్మా? నిన్ను గుర్తింప చేసావు గదా. అసలు యదార్థం చెప్పమంటావా? నిన్ను చూడక ముందు నాకు బాగా దృష్టి దోషం కూడా ఉండేది.

అమ్మ : దృష్టి దోషమంటే చూచేదా? చూచి గ్రహించే దృష్టా?

మౌలాలి : చూచేది వేరు, చూచి గ్రహించేది వేరా, అమ్మా?

అమ్మ : చూచేది కళ్ళు, చూచి గ్రహించేది మనస్సు.

మౌలాలి : చూచేదే లేదమ్మా, నాకు మధ్యలో స్ఫోటకం పోసింది, అందులో చూపు మందగించింది.

అమ్మ : మందగించింది అంటే అసలు లేదనా? తగ్గిందనా?

మౌలాలి : అప్పట్నుంచి దాదాపు అసలు లేదనే చెప్పాలి.

అమ్మ : యెట్లా కనిపించదంటావు. నీకు కళ్లే కనబడకపోతే బజార్లమ్మట ఎలా తిరుగుతున్నావు?

మౌలాలి : కనబడి కాదమ్మా, సంజ్ఞతో తిరుగుతున్నా, పిచ్చి తల్లీ ఇంత సంభాషణెందుకు, నీ కరుణ నీకు తెలియకుండానే ప్రసరించిందామ్మా? ఆ అమ్మగా అంటే పోలేరమ్మ రూపంలో వచ్చి కళ్లు తీసేసావు. జగదీశ్వరి రూపంతో వచ్చి కళ్ళిచ్చావు. నీలోనే కలుపుకుంటివిగా తల్లీ. శరీరాన్ని వేరు చేసావుగాని, శరీరాన్ని కూడా తొందరగా కలుపుకో తల్లీ. నీకు తెలియకుండా నాకు వచ్చిన అనుభవాలు ఉన్నాయా తల్లీ?

సరేగానమ్మా, మొన్న నీ నెత్తిన గొడుగల్లె పామున్నదే ఎందు ని?

అమ్మ : ఏమో మౌలాలి, మొన్నీమధ్య నాక్కూడా, మధ్యాహ్నమప్పుడు కూర్చొని నిద్రలేచి. కళ్లు తెరిచేటప్పటికి నా నెత్తిన నాకూ అలాగే కనబడ్డది. పక్కకు తిరిగితే పక్కన, ఎదురు చూస్తే ఎదురు అలా యెటు చూస్తే అటల్లా కనబడ్డది. చింత చెట్టు వేపు చూస్తే చింత చెట్టంతా అదిగానే కనబడ్డది. అయినా యిదేంటో చూద్దామని రోడ్డున బయలుదేరితే రోడ్డునే నే నడిచినట్టే నడుస్తున్నది. చివరకు శివాలయం వాకిలి ముందర నించుని ధ్వజం వైపు చూస్తే ధ్వజం పొడుగునా కనబడ్డది. నా పాదాల దగ్గిర నుండి గుడి వాకిలివరకు ఉన్నది.

ఇదేమిటని భావనారాయణస్వామి దేవాలయానికి వెళ్ళాను. అక్కడా ఉంది. అక్కడ కూర్చున్నాను. చివరకు ఇదంతా నాలోదేననిపించింది.

పాము చుట్టలు చుట్టుకుని పడగెత్తి నించునప్పుడెట్లా ఉంటుంది - మనిషి కూర్చున్న ఆకారంగా ఉంటుంది. దాన్నే "బ్రహ్మదండి" అంటారు. వెన్నెముక క్రిందుగా వుంటుందా నాడి - అదే "సుషుమ్న" - అదే బ్రహ్మంగారి తత్వాల్లో వచ్చేది, నీకు తెలియదా? ఓ మనిషి జుట్టును పూర్తిగా తీసేయించి, నించోబెట్టి, వెనుక నుండి ఆ తలని చూస్తే పడిగాకారంగా తోస్తుంది. పాము ఆకారం ఎలా ఉంటుందో మన శరీరంలో ఉండే "సుషుమ్నా నాడి" అలా ఆపాదాంతము ఉంటుంది. దాని కేంద్రస్థానము - నడుము దగ్గర్నుండి శిరస్సు వరకని చెప్పారు. అంత మాత్రం చేత శరీరమంతా లేదని కాదు.

కొందరు సాధకులు ఉచ్ఛ్వాస నిశ్వాసాల ద్వారా గుర్తిస్తారు. కొంతమంది రెండు కనుబొమ్మల మధ్య దృష్టిని నిలిపి దాని ద్వారా గుర్తిస్తారు. అదే " కుండలినీ ప్రచోధము"- పడుకున్న పామును కొడితే తలెత్తి బుసకొట్టినట్లుగా. కొంతమంది సాధకులు దాన్ని హఠయోగమని చెబుతారు. అదే "సహస్రారానికి" వెళ్తుందంటారు. నాడీ స్థానాల్లో కేంద్రీకరణ ఎందుకంటే - విగ్రహారాధన లాంటిది. అనేకమంది అనేక రకాల విగ్రహాలు పెట్టుకుని ఒక విషయం కోసమే కృషి చేయటంలా? ఒకే స్థితికి అనేక సదుపాయాలు, ఒ మేడకు నాలుగు వైపులా మెట్లు వేసినట్లు.

మౌలాలి : అయితే బయట సర్పమల్లే కనబడటమెందుకమ్మా?

అమ్మ : లోపల యేదో వెలుపలా అదేనని. రెండూ వేరు. ఇందాక నువ్వు అనలా?

మౌలాలి : యేమన్నానమ్మా?

అమ్మ : బ్రహ్మనైనానంటివే. ఎట్లా అయినావని అడిగితే బ్రహ్మను చూసి బ్రహ్మనైనానన్నావు, చూపించింది, చూసింది ఒకటైందిగా?

మౌలాలి : ఎమో! ఇవన్నీ నాకొద్దమ్మా. నీవు దేవుడివి, కాదు కాదు, నీవు అమ్మవు, నేను బిడ్డను. అన్నీ నీవు చేయిస్తున్నావు, నేను చూస్తున్నాననేది చాలా హాయిగా వుంటుంది. ప్రతిదీ దానంతటదే కలుగుతుందన్నారుగా అమ్మా! సరేగాని అమ్మా, నా చేతిట్లా గుర్తింపచేశావు. మరి నిన్ను ఇలా గుర్తించని వాళ్ళూ ఉన్నారుగా. ఎవరు ఎలా ఉన్నా నీ కరుణ ఒకటేగా అమ్మా? అందరూ నిన్ను నిన్నుగా గుర్తించే రోజు వస్తుందా అమ్మా? అది నే చూస్తానా.

అవునమ్మా, ఆ బ్రహ్మదండిని కూడా నీవే సృష్టించావు గదా! మరి అది నీకు కనబడటమేమిటి? బహుశా మాకు తెలియజేయడం కోసమే వీటన్నిటిని ఆధారం జేసుకున్నావేమో! సామాన్యురాలిగా ఒ రూపంలో వచ్చావు గాని సూదిమోప సందు లేకుండా ఉన్న అమ్మవు నువ్వు సూదై కూర్చుంటివి, మొద్దుబట్టలు, సన్నబట్టలు, సిల్కులు - అన్నీ కుట్టాలి. సూదిగా నిన్ను సరిగా వాడటం చేతకాక విరగదీసి పెడతాం. ఎందుకు పెట్టుకున్నావమ్మా యింత యాతన, యింత కార్యభారం?

అమ్మ : భరించలేనప్పుడేగా బాధ - "భరించలేనిదే బాధ"

మౌలాలి : అమ్మా! నీక్కూడా పెళ్ళి అవసరమా?

అమ్మ : ఇప్పుడేగా చెప్పావు, సూదినయి కూర్చున్నానని, సూది నయిన తరువాత అన్నీ కుట్టాలన్నావు కదూ?

మౌలాలి : యేమిటోనమ్మా నావన్నీ పిచ్చి ప్రశ్నలు. అమ్మా, నీ పెళ్లి ఏ ఆదర్శం కోసము, పెళ్లి నీకు ఆదర్శమే కావచ్చు, చూసేవాళ్లకి బాధే. మొన్న మీ యింటికి మధూకరానికి వచ్చినప్పటి నుండి పెళ్లితో బాధల్ని సృష్టించుకున్నావేమోననిపిస్తున్నదమ్మా. అమ్మా, ఎంత సత్యం నీవయినా నన్ను మాత్రం రాబోయే నీ బాధలు చూడనీక నీలో కలుపుకో. ఎంత అన్నీ నీవనుకున్నా మొన్న మీ మేనత్తగారు నిన్ను తిట్టి, గడపలో నెట్టి పడేసిన సంఘటన గుర్తుకొచ్చినప్పుడల్లా బాధగానే ఉంటుందమ్మా. అమ్మ తన బంధువులని ఇలా సృష్టించుకున్నదే, తన కోసం బాధపడే తనతల్లిని ముందుగానే పంపించిందే అని దిగులుగా ఉంటుందమ్మా. నేను మెట్రిక్యులేషన్ చదువుకునేటప్పుడు ఓ రోజున స్కూలుకెళ్ళి వస్తుంటే నువ్వు కన్పించావమ్మా మళ్ళీ ఎంత చూదామనుకున్నా నువ్వు కనుపించలేదు. నాకు తెలియకుండానే "అమ్మా" అనే నామం ఆ రోజు నుండి జపిస్తూనే ఉన్నాను. ఆనాడే కనబడి మంత్రోపదేశం చేసి అదృశ్యమైనావు ఆ నా జపం యీనాడు ఫలించింది.

అమ్మ : బాగా ప్రొద్దుగూకింది. తాతమ్మ కూడా వచ్చింది. ఇంటికి వెళ్తాను మౌలాలి.

మౌలాలి : నువ్వు రమ్మంటే వస్తానమ్మా, రాకపోయినా వుండగల్గును ఇప్పుడు, ఇది వరకల్లె కాదు, ఎప్పుడూ సాన్నిధ్యమే కనుక సాన్నిధ్యాన్ని సాధించాను నేను వస్తానమ్మా, నిన్ను సాధించే పనిలేదు.

అమ్మ : నన్ను సాధించకుండానే. నా సాన్నిధ్యం నీకు సాధ్యమైందా?

మౌలాలి : లేదు లేదమ్మా! యేదో వక్రంగా మాట్లాడితే నీ మాటలు వినొచ్చును గదా అని..

అమ్మ : ప్రతిదీ నీకు తెలిసే మాట్లాడతావన్నమాట?

మౌలాలి : అయ్యయ్యో లేదమ్మా, ఏదో అట్లా వచ్చింది, బయల్దేరమ్మా అంటాడు.

అమ్మ ఇంటికెళుతుంది, రాత్రి 7-30 అవుతుంది, అంతా భోంచేస్తారు.

తాతమ్మ : ఎక్కడ తిరుగుతున్నావు?

అమ్మ : చింత చెట్ల క్రింద చల్లగా వుంటే కూర్చున్నా

తాతమ్మ : ఇరుగు పొరుగు ఇంతమంది పిల్లలున్నారు ఆడుకోరాదామ్మా?

అమ్మ : రేపు అట్లాగే ఆడుకుంటా!

తాతమ్మ : అన్నం పెడతా పదా, తిందువుగాని.

అమ్మ అన్నానికి వెళ్తుంది. తాతమ్మగారు దగ్గర కూర్చోబెట్టుకుని అన్నం కలిపి పెడుతుంది. అన్నం తిని అమ్మ తాతమ్మ పక్కలో పడుకుని నిద్రపోతుంది.

మరునాడు సాయంత్రం 4.30 గంటలకు అమ్మ తోటలోకి వెళుతుంది. మౌలాలి పడుకునుంటాడు. అమ్మ వెళ్ళి మౌలాలి దగ్గిర కూర్చుంటుంది. నిద్రపోతున్నాడులే, అని ఇవతల కొచ్చి కూర్చుంటుంది.

ఒక చండీ ఉపాసకుడు, కొల్లిమర సూరయ్యగారు చింత చిగురు కోసం తోటకొస్తారు. అక్కడ అమ్మను చూస్తారు. ఎందుకో అమ్మ దగ్గర కూర్చుంచదామనిపించి, వచ్చి కూర్చుంటారు. అమ్మను చూస్తూ వచ్చిన పని మర్చిపోతాడు. ఆయనకు శ్రీవిద్య, తంత్ర విద్యల మీద మంచి అభిమానం. ఎవర్నీ సామాన్యంగా ఒప్పుకోరు. ఎందుకో అమ్మను చూస్తే తన ఇష్టదైవమనిపిస్తుంది. ఆయన అట్లా చూస్తుండగానే అమ్మ శిరస్సు నుండి రక్తం చిచ్చుబుడ్డిలా ఎగజిమ్ముతుంది. అదే సమయంలో భ్రుకుటి నుండి కూడా వస్తుంది. యీ రెండూ సూరయ్య గారు చూసి ఆశ్చర్యపడి, ఆ రక్త ధారకు ఆయన చెయ్యి అడ్డం పెడతారు. ఆ చేతిలో పడ్డ రక్తం చక్కటి సువాసన గల భస్మమవుతుంది. ఆ భస్మాన్ని ఆయన సేవిస్తారు.

సూరయ్య : అమ్మా నీ పేరేమిటి?

అమ్మ : అనసూయ.

సూరయ్య : ఇక్కడ తోటలో ఎందుకున్నావమ్మా?

అమ్మ : ఇంటి దగ్గర తోచక ఎప్పుడన్నా వచ్చిపోతూ వుంటా.

సూరయ్య : నీకీ రక్త ప్రవాహం ఎప్పట్నుంచి?

అమ్మ : ఫలానాప్పట్నుండి అని తెలియదు, ఇప్పుడు మాత్రం వున్నదనుకున్నానా నేను?

సూరయ్య : నీకు తెలియదా అమ్మా?

అమ్మ : యెవరో నీ బోటి వాళ్ళు చూసి చెప్తే తప్ప నాకు తెలియదు.

సూరయ్య : ఈ విషయం ఇంతకు ముందు నీకెవరన్నా చెప్పారా?

అమ్మ : ఒకసారి కొండలరావు స్వాములవారు - భజన చేస్తుంటే దగ్గిరకు పిలిచి, కూర్చోబెట్టుకొని తల నిమురుతూ ఇంత మెత్తగా ఉన్నదే అని, బ్రహ్మకపాలం దగ్గిర వత్తి చూసి చేతికి నెత్తురయిందనుకుంటారు. అప్పుడు 'ఇదివరకు ఎన్నడైనా యిలా జరిగిందా అమ్మా?' అని నన్ను అడిగారు. మీకు చెప్పిన మాదిరిగానే నాకు తెలియదని చెప్పాను. ఆయన అక్కడ వాసన చూస్తూ ఎంత సువాసనో అని అనుకుంటారు, మళ్ళీ ఇప్పుడు మీరన్నారు.

సూరయ్య : ఇది సామాన్యమైన స్థితికాదు. తపస్సు ఫలించిన వారికి గానిరాదు. దీని కోసం ఆరేళ్ళు ప్రయత్నించా. చివరకు పొట్టకూటి కోసం ఉద్యోగానికి పోయి అన్నీ మరిచాను. నా ఏడో యేట నుండి యెంతో భక్తితో అన్నీ చేసే వాడిని. అలా 23 యేళ్ళ వరకు సాగింది. ఇప్పుడైనా ధ్యాసపోలేదు, క్రియ మాత్రము లేదు.

అమ్మ : ధ్యాస క్రియేగా?

ఇంతలో మౌలాలి లేచి వస్తాడు.

సూరయ్య : ధ్యాస కూడా క్రియేనంటావామ్మా.

అమ్మ : తప్పకుండా.

సూరయ్య : ఉద్యోగం మానుకొని ఇక్కడ కొస్తానమ్మా.

అమ్మ : నన్ను నమ్ముకుని రావద్దు నాయనా, చివరకు అసహ్యం వేస్తుంది. ఫలానా అమ్మాయి కోసం వచ్చావంటే నవ్వరూ? నా మీద ఎవరికీ సదుద్దేశం లేదు. నేనేదయినా మీకు చెపుతానా అంటే నా స్థితే నాకు తెలియదు. మీరు గుర్తు పట్టి ఇది అని చెప్పిందాక నా స్థితే నాకు తెలియదు. మీరీ విషయం ఎక్కడైనా అన్నారంటే నాకేదయినా దెబ్బ తగిలిందేమో అంటారు. నా కంటే ముందు మిమ్మల్ని ఎగతాళి చేస్తారు. నా రోజులు ప్రస్తుతం ఇటువంటివి.

సూరయ్య : నీ మాట చెప్పనమ్మా, ఎందుకో వచ్చాను అని చెప్పుకుంటాను. యీ వూరు కాపురం వచ్చా, నాకు చాలా సంతానం కలిగి నష్టమైంది, ఇద్దరున్నారు. ఇద్దరూ మూగ పిల్లలే. ఒక మగ పిల్లవాడు, ఒక ఆడపిల్ల. ఒక ఎకరం పొలమున్నది, ఐదువేల రొక్కమున్నది. ఆడ పిల్లను ఎవరు చేసుకుంటారు. ఎవరో పేదవాడికిచ్చి చేయాలి. కుటుంబ చిక్కులకేం లెండి, యేవేవో వుంటుంటాయి. మిమ్మల్ని వదిలిపెట్టి పోలేకుండా వున్నాను. నేను కొలిచే దేవతే మీరనిపిస్తున్నది.

అమ్మ : యెందుకు? నన్ను మీరు అంటున్నారు. అమ్మాయి అనక.

సూరయ్య : అట్లా అనాలనిపిస్తుందమ్మా.

మౌలాలి వింటూ కూర్చుంటాడు. విని, ఆమెకు తపస్సేమింటడీ, తపస్సు అంటున్నారు. ఎవరికి ఏ రూపం ఇష్టమో, ఎవరికి ఏ స్థితి వుందో దానికి తగినట్లు దర్శనమిస్తుంది. ఎందుకు ఇవ్వగలుగు తున్నదంటే - వీటన్నింటికి మూలం, మూలానికే మూలం. అమూల్యమైన ఆదరణ, ఆదరణగల అవతారం. అమృత తత్వమయిన అవతారమని కూడా అనవచ్చు. ఇది నా అభిప్రాయం పంతులు గారు.

సూరయ్య : నాకు అంత అర్థం చేసుకునే శక్తి లేదు. తమదేవూరు?

మౌలాలి : ఒక వూరని ఏముందిలేయ్యా? ప్రస్తుతం ఈ వూరు.

అమ్మ : సరే, నే వెళ్ళి వస్తా మౌలాలీ. బహుశ ఇంక మూడు రోజులలో నంబూరు ప్రయాణం తప్పదు.

మౌలాలి : నంబూరు ఎక్కడ?

అమ్మ : గుంటూరు దగ్గిర నంబూరు. నంబూరు వచ్చి కరణంగారి ఇల్లెక్కడ అంటే చెప్తారు. ఈ మూడు రోజులు నేను ఇటురాను.

మౌలాలి : నేను రేపు బయలుదేరుతానమ్మా.

అమ్మ : సరే.

సూరయ్యగారు ప్రతి చింత చెట్టు దగ్గర గుప్పెడు, గుప్పెడు చింతాకు కోసుకుంటూ వుంటారు. అమ్మ బయలుదేరి వెళ్తూ వుంటుంది. సూరయ్యగారు చింతాకు కోసుకునే వాడల్లా అమ్మ దగ్గిరకు పరిగెత్తుకు వస్తారు.

సూరయ్య : అమ్మా, నేనూ తప్పకుండా వస్తా మీ వూరు.

అమ్మ : నన్ను నమ్ముకొని మాత్రం రావద్దు. నేను ఒక వూళ్ళో వుంటాననే నమ్మకం లేదు.

సూరయ్య : పోనీలే అమ్మా! ఏదో ఊళ్ళో ఉండే బదులు ఇక్కడే ఉంటాను.

అమ్మ : సరే, వుండండి మీ ఇష్టం.

సూరయ్యగారు వెళ్ళొస్తానమ్మా అని నమస్కారం చేస్తారు అమ్మకు.

అమ్మ : నా కెందుకు నాయనా నమస్కారం? నీకు నీవు చేసుకో. అచ్చగా నీకు నీవు చేసుకున్నా భగవంతుడికి చేసినట్లే. అట్లాగే ప్రతి వస్తువుకు అంటే అన్నానికైనా, అశుద్ధానికైనా సరే, నే వెళ్ళొస్తా.

అని ఎవరిదారిన వారు వెళ్లారు. అమ్మ ఇంటికి వస్తుంది. ఇంటికి వచ్చేటప్పటికి దాదాపు ఏడవుతుంది. రాఘవరావు మామయ్య నంబూరు లోనే వుంటారు. అమ్మ తెనాలి వారితో కలిసి వెళుతుంది నంబూరు. వడుగయిన తరువాత ఇంకా ఇరవై రోజులు అక్కడే వుంటారు. మౌలాలి అమ్మ కంటే ముందే నంబూరు చేరతాడు.

ఒక రోజు సావిత్రమ్మగారు (అమ్మ పినతల్లి భాగ్యమ్మ గారి కుమార్తె)

అమ్మతో మాట్లాడుతూ -

సావిత్రమ్మ : ఏమిటి, ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ కూర్చుంటావు?

అమ్మ : "ఏమీ లేదమ్మా, ఒకదాని గురించిన ఆలోచనంటూ ఏమీ ఉండదు. ఆలోచనలు వాటంతటవే వస్తాయి." (పాపం యీ మాట అర్థం చేసుకొనేశక్తి లేదు)

సావిత్రమ్మ : ఎంత పిల్చినారావు. రాకపోతే పోన్లే, రావా?

అమ్మ : (లేచి వెళుతుంది) ఎక్కడకు?

సావిత్రమ్మ : గోపాలరావు గారింటికి పోదాం.

(సామిత్రమ్మ గారికి పెదతండ్రి వరస) అయనకు భార్య, పిల్లలు లేరు. యీపిల్లల్నే ఆయన పిల్లలుగా చూసుకుంటారు. అన్నం ఆయనే వండుకుంటారు. కూరలు భాగ్యమ్మగారు పంపిస్తుంది. పిల్లలందరకు కలిపి

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే ॥

ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

భగవంతుడు పూర్ణుడు. ఈ ప్రపంచం పూర్ణమైనది. పూర్ణుడైన ఆ భగవంతునినుండే పూర్ణమైన ప్రపంచం ఉద్భవించింది. పూర్ణం నుండి పూర్ణాన్ని తీసిన పిదపసైతం పూర్ణమే మిగిలి ఉంది.

- శాంతి మంత్రం

ముద్దులుపెడ్తుండేవారు. ఆయన దేవీ పూజ దురంధరుడు. నిత్యమూ కుంకుమార్చన. అఖండం వెలుగుతూనే వుంటుంది. ఉన్న ఇరవై రోజుల్లో అమ్మ పది రోజులు అన్నం ఆయన దగ్గరే తింటుంది. ఒక రోజు అన్నం విస్తట్లో పెట్టగనే - నాయనా ఈ రోజు అన్నం నేను కలిపేదా? అన్నట్లు గోపాలరావుగారికి వినబడుతుంది. వులిక్కిపడి ఎవరు ఆ మాట అన్నది? ఎవరు? ఆ మాట అన్నది? అని మూడుసార్లు అంటారు.పెద్దపెద్ద కళ్ళు చేసి ఎవరు ఆ మాట అన్నది మిరేనా, మీకు వినపడ్డదా అంటారు.

సావిత్రమ్మ : నోరు తెరవలేదు కాని అనసూయ గొంతులో నుండి వచ్చినట్లున్నదా ధ్వని! ధ్వని యీ గొంతులో నుండే వచ్చింది గాని, అనసూయ గొంతు ధ్వనిగాదు. శబ్దం మార్పుగా వుంది.

"శబ్దము ఒకటే ధ్వనులు అనేకం" - అమ్మ.

గోపాలరావు గారు బిత్తరపోయి, బిత్తర చూపులు చూసుకుంటూ నాలుగు మూలలా వెతుకుతారు. నాలుగు మూలలా వెతికితే ఎప్పుడో ఒకప్పుడు తేలకపోతుందా? ఆ తల్లే ఈ రూపంలో వచ్చిందేమో? అన్నం కలుపమ్మా, కలుపు. అసలు అమ్మాయిని చూసినప్పట్నుండి అనుకుంటూనే ఉన్నా దైవకళ వుట్టిపడుతున్నదని. ఆ జడ, ఆ పరికిణీలు గుమ్మటమల్లె, బాలత్రిపురసుందరిలా వున్నది. నా కెందుకో నిన్ననే అందామనిపించింది, దిష్టి తగులు తుందేమోనని వూరుకున్నానమ్మా, అని చెయ్యి పట్టుకుని ఒళ్ళోకి లాక్కుంటారు, లాలనతో అమ్మని అక్కునచేర్చుకున్న క్షణాన గోపాలరావు గారు తన్నుతాను మరచిపోయి ఓ అనిర్వచనీయమైన తన్మయస్థితిలోకి వెళతారు. సమయము గడుస్తున్నకొద్దీ జనం ఆదుర్దాతో, ఆశ్చర్యంతో చుట్టూ గుమికూడి, ఆయన స్థితిని అర్థం చేసుకోలేక అయోమయంలో పడిపోతారు. అలా అయిదు గంటలు గడిచాక దిక్కుతోచక గోపరాజుగారు డాక్టరు గారిని పిలిపిస్తారు. డాక్టరు గారు చూసి 'శ్వాస లేదు, నాడి కూడా అందటం లేదు' అని అంటారు.

గోపరాజుగారు - 'గుంటూరన్నా తీసికెళదాం పిల్లను మెల్లిగా విడదీయండి'. డాక్టరుగారు అమ్మను పిలుస్తారు. అమ్మ పలుకుతుంది.

డాక్టరుగారు గోపరాజుగారితో "తేజస్సు చూస్తే ప్రాణం పోయినట్లు లేదు, నాడి అందటంలేదు" అంటారు.

మౌలాలి వాళ్ళ గందరగోళం చూసి తనలోతను 'ఆ తల్లి మాయ ఎవరు కనుక్కోగలరు? ఏ బిడ్డకు ఎలా దర్శనం కావాలో అలా ఇచ్చి తరింప చేస్తుంది. తెలిసి తెలిసి తరించే వాళ్లు కొందరైతే తరిస్తున్నామన్న స్పృహ కూడా లేకుండా తరించే వాళ్లు మరికొందరు. ఆ తల్లి మాయని ఎవరు మాత్రము కనుక్కోగలరూ ...' అనుకుంటాడు.

"అంతటా శక్తిమంతంగా ఉండి అర్థం కానిది ఆత్మ" - **అమ్మ**

## "పరిమితమైన మమకారం మానవత్వం,
## అపరిమితమైన మమకారం మాధవత్వం" - అమ్మ

మమకారం సర్వప్రాణిసహజం. ఇక, మానవుల మనస్సులు మమకారంతో నిండి ఉంటాయని వేరుగా చెప్పనక్కరలేదు. చాల సందర్భాల్లో ఈ మమకారం మానవుణ్ణి అకృత్యాల వైపుకూడా ప్రోత్సహిస్తుంది. అలాగని, మానవుడు మమకారాన్ని చంపుకోగలడా? సగటు మనిషి - మమకారానికి అతీతంగా నిలబడగలడా? మరి, ఏం చేయాలి మనం-

ఒక చక్కని వెలుగుదారిని చూపించింది అమ్మ. మమకారాన్ని చంపుకోవడం మామూలు మానవులకు సాధ్యం కాదని అమ్మకు తెలుసుకదా! అందుకని, ఆ మమకారాన్ని చంపుకోమని ప్రబోధించడం లేదు అమ్మ. తన వారు, పరాయి వారు అనే భేదభావం లేకుండా, మమకారం పరిధిని పెంచుకోమని హితబోధ చేస్తోంది. అప్పుడు మానవుడు మాధవుడు కాగలడని, వివరిస్తూ, దివ్యత్వానికి దారిచూపుతోంది విశ్వజనని. మహాత్ములు ప్రబోధించే తీరు ఇంత సరళసుందరంగా, ఆచరణాత్మకంగా ఉంటుందని 'మహాభారతం' కూడ వివరించింది.

జూదంలో ఓడిపోయిన పాండవులు అరణ్యాలకు వెళ్ళిపోయారు. వ్యాసమహర్షి ధృతరాష్ట్రుణ్ణి సమీపించి, హితోపదేశం చేయసాగాడు. బద్ధజీవులైన సామాన్య మానవులు ఎలా ఆలోచిస్తారో తెలిసి, ఉపదేశిస్తున్నాడు వ్యాసమహర్షి.

పాండవుల దైన్యాన్ని గుర్తుచేశాడు. పాండవుల పట్లజాలి కలగడం లేదా? అని ప్రశ్నించాడు. పాండవుల పట్ల ప్రేమచూపడానికి పుత్రమమకారం ధృతరాష్ట్రుడికి అడ్డువస్తోందని గుర్తించాడు వ్యాసమహర్షి. అందువల్ల ఆ మమకారాన్ని నిందించలేదు. తప్పుపట్టలేదు. అలా మమకారం ఉండటం సహజమే కాని, దోషంకాదని ప్రేమతో పలికాడు. అయితే, ఆ మమకారాన్ని పాండవులవరకు పెంచుకోమని హితవు పలికాడు. "నేను - నిన్నూ, పాండురాజునీ, విదురుణ్ణీ ఒకే విధంగా చూస్తున్నట్లే - నీవు నీ బిడ్డలు నూరుగురినీ, పాండవులను ఐదుగురినీ ఒకే ప్రేమతో ఆదరించు." అని ప్రబోధించాడు.

భేదదృష్టిని వదలి, ప్రేమైక దృష్టిని అలవరచుకోమని ప్రబోధించే మహాత్ముడు వ్యాసమహర్షి. మమతానురాగాల విలువలెరిగిన మానవతామూర్తి మన మాతృశ్రీ.

- మల్లాప్రగడ

---

యుస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవా భూద్విజానతః।
తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః ॥

'సర్వభూతాలు తన ఆత్మే అని తెలిసికొని, ఏకత్వాన్ని మాత్రం చూసే వ్యక్తికి మోహ మెక్కడిది. శోక మెక్కడిది?'

- కఠోపనిషత్తు



**యతశ్చోదేతి సూర్యో అస్తం యత్ర చ గచ్ఛతి ।**
**తం దేవా సర్వే అర్పితాః తదు నాత్యేతి కశ్చన ॥** ఏ తద్వైతత్ ॥

'ఎందు నుండి సూర్యుడు ఉదయిస్తాడో, ఎందు అస్తమిస్తాడో, ఎందు సకల విశ్వశక్తులు ఉన్నవో, దానిని ఎవరూ అధిగమించలేరు. **ఇదే అది**'.

- కఠోపనిషత్తు

## "మానవుని నడక నవగ్రహాల మీద ఆధారపడి లేదు, రాగద్వేషాలనే రెండే గ్రహాల మీద" - అమ్మ

సాధారణంగా మానవుడు తన అభ్యుదయానికి, పతనానికి కూడా నవగ్రహాల ప్రభావమే కారణ మని భావిస్తూ ఉంటాడు. ఆ గ్రహాల్లో కొన్ని పాపగ్రహాలని, వాటి చూపు తనపై పడినప్పుడు తాను కష్టాలపాలు కావలసి వస్తోందని అనుకుంటూ, వాటికి శాంతి జరిపించాలని - ఏవో జపాలు మొదలైన ప్రక్రియలను జరిపిస్తూ ఉంటాడు - ఎప్పటి కప్పుడు గ్రహాల స్థితిగతులను తెలుసుకుంటూ, తనపై అనుకూల ప్రతికూల ప్రభావాలను బేరీజువేసుకుంటూ, అవసరమైన శాంతి కలాపాలను నిర్వహించుకుంటూ, "హమ్మయ్య!" అనుకుంటూ ఉంటాడు.

అయితే, అమ్మ ఒక కొత్త ఆలోచనను ఈ అంశంపై ప్రసరింప చేసింది. మానవుని జయాపజయాలకు నవగ్రహాలు కాదు, రాగద్వేషాలే కారణం అన్న సత్యాన్ని ఒక సందేశంగా వివరించింది. మానవుడు ఏపని చేసినా, రాగంతోనో, ద్వేషంతోనో చేస్తాడని, తాత్కాలికంగా ఆ పనులు కొన్ని తనకు అనుకూలంగా ఉన్నట్లు పైకి కనిపించినా, రాగద్వేషాలతో కలుషితమైన అతని మనస్సు అశాంతిని అనుభవించక తప్పదని అమ్మ తెలియ చేస్తోంది.

మహాభారత గాథలో ధృతరాష్ట్రుడున్నాడు. అరణ్యవాసం, అజ్ఞాతవాసం ముగించుకొని వచ్చిన పాండవులకు వారి రాజ్యం వారికి ఇచ్చి, ధృతరాష్ట్రుడు హాయిగా మనశ్శాంతిని అనుభవించవచ్చు. రాజ్యం తిరిగి ఇచ్చేందుకు కాదు గదా, జూదమాడింది. పాండవుల రాజ్యభాగాన్ని వారికివ్వడం ధృతరాష్ట్రుడికి సుతరామూ ఇష్టంలేదు. వాక్చాతుర్యం గల సంజయుణ్ణి రాయబారిగా పాండవుల వద్దకు పంపాడు. సంజయుడు ఎంత ధర్మాత్ముడైనా, రాయబారిగా వెళ్ళినపుడు రాజు గారి మనోగతభావాలనే తాను వ్యక్తీకరించాలి తప్ప, తన వ్యక్తిగత అభిప్రాయాలను రాయబార సందేశంలో చొప్పించకూడదు కనుక, ధృతరాష్ట్రుడి కుటిలనీతిని చతుర సంభాషణలో పొదిగి అందించాడు పాండవుల ఎదుట. సంజయుని రాయబారం ఒక విశాలమైన ఘట్టం. కాని, ఆ ఘట్టం మొత్తాన్ని అలా పిండితే, రాలిపడే చుక్కలు రెండే రెండు. "ఒకటి : పాండవులారా! మీరాజ్యం మీకివ్వడం లేదు. రెండు : మీరు మంచివాళ్ళు కనుక, యుద్ధానికి రాకుండా, శాంతికాముకులై బిచ్చమెత్తుకుని బ్రతకండి" - అని మాత్రమే సంజయుని రాయబార సారాంశం. ఇంతటి చేదు ఆలోచనను అందంగా అందించగల నైపుణ్యం గలవాడు కనుకనే - సంజయుణ్ణి రాయబారిగా ఎన్నుకున్నాడు. ధృతరాష్ట్రుడు.

కాని, ధృతరాష్ట్రుని పాచిక పారలేదు. తిరిగి వచ్చినసంజయుడు పాండవుల మనోగతిని వివరించగా, ధృతరాష్ట్రుడు అశాంతిని అనుభవించసాగాడు. ఆ రాత్రి నిద్రపట్టలేదు. విదురుణ్ణి పిలిపించుకున్నాడు. మంచిమాటలుచెప్పుమని కోరాడు. కొంతసేపు కొన్ని నీతులు వివరించిన విదురుడు అసలు సంగతి ప్రస్తావించనే ప్రస్తావించాడు. "అన్నయ్యా! పాండవుల రాజ్యం అపహరించాలన్న ఆలోచనే నీ అశాంతికి కారణం. నువ్వు ఎన్ని నీతులు విన్నా, వారి రాజ్యాన్ని వారికి తిరిగి ఇచ్చినప్పుడు మాత్రమే నీకు శాంతి కలుగుతుంది". అని స్పష్టంచేశాడు.

ఒక వంక తనమనస్సుకు తెలుస్తూనే ఉన్నది. అభావాన్నే విదురుడూ వివరించాడు. అయినా, ధృతరాష్ట్రుడు ఆపని చేయడానికి సంసిద్ధుడు కాలేకపోయాడు. కారణం కౌరవులపై రాగం. ఆరాగం వల్ల పాండవుల రాజ్యన్ని అపహరించి, 'తనవారికి' కట్టబెట్టాలన్పించింది. ఇంత కాలంగా సాగిన ధృతరాష్ట్రుని కథకు ఈరాగమే మూలం. ఈ రాగం పాండవులపై ద్వేషంగా మారింది. అది మహాభారత కథను కురుక్షేత్రం దాకా నడిపించింది. ధృతరాష్ట్రుడికి దుర్భరమైన గర్భశోకాన్ని మిగిల్చింది.

రాగద్వేషాలమీదనే మానవుని నడక ఆధారపడిందన్న ఇతిహాస ధర్మాన్ని చిన్న మాటల్లో పొదిగి అందించిన "వాఙ్మయస్వరూపిణి" అమ్మకు ప్రణమిల్లుదాం.

– మల్లాప్రగడ

# ఆబ్రహ్మ కీటజనని

**[అంఆ జీవిత మహోదధిలో ఓ తరంగము]**

[ ఈ సంఘటన జరిగే నాటికి అమ్మకి పధ్నాలుగో సంవత్సరం నడుస్తుంటుంది.

అమ్మని తమింట్లో కొన్నాళ్లపాటు ఉంచుకుంటామనే జానకమ్మ, సుబ్బారావు గార్ల (అమ్మకి అమ్మ తరపు బంధువులు) కోరిక మేర సీతాపతి తాతగారు (అమ్మకి నాన్నగారు) అమ్మని వారింటికి (తెనాలి) పంపుతారు. నాలుగు నెలల తరువాత, ఓ రోజున సీతాపతి తాతగారు తెనాలి వచ్చి, అమ్మని కూడా తీసికుని మన్నవ చేరేటప్పటికి సమయము రాత్రి గం॥ 7-00 లు. తెనాలి ముచ్చట్లు చెప్పుకుంటూ అందరూ భోంజేసి పడుకునేటప్పటికి రాత్రి గం॥ 11-00 లవుతుంది.]

అమ్మ తోటలోకి వెళుతుంది.

అమ్మ తోటలో అడుగు పెట్టగనే చెట్లన్నీ ఇంతకాలం ఎక్కడికి పోయినావన్నట్లుగా అలిగిన పసిపిల్లలల్లె ఒక్క ఆకునైనా కదల్చకుండా మూతి ముడుచుకు కూర్చుంటై. ఒక అర గంట గడుస్తుంది. చూస్తున్న కొద్దీ సంతోషం ఆగక చెట్లన్నీ ఒక్కసారిగా కదిలి కౌగలించుకుంటై. చెట్లతో పాటు, చెట్ల మొదళ్లల్లో వుండే చీమలు, గాజు పురుగులు, యింకా అనేక రకాల పురుగులు శరీరమంతా పాకి, యిన్నాళ్లకు కనపడ్డావని ముద్దుపెట్టి పోతాయి, అవి ముద్దు పెట్టుకున్నప్పుడు శరీరం మీద యేదో తడి అవుతుండేది. వుసుళ్లు అమ్మ శరీరమంతా మూగి, వాటిరెక్కలు శరీరం మీద వదిలి ప్రాణాలు విడుస్తుంటాయి మిడతలు వాలి, కరుచుకుని వదిలేవి కావు. అమ్మకు తీసెయ్యాలనిపించేది కాదు, వాటికెంత మమకారమో ననుకుంటుండేది. పక్కన మాగాట్లో నుండి ఎలకలు అమ్మ ఒడిలోకొచ్చి కూర్చుంటాయి. ముంగిసలు, పాములు కలిసి ఒడిలోకొచ్చి వాటి గుణాలను మర్చిపోయి అమ్మను చూస్తూ ఆడుకుంటుంటాయి. అట్లా తెల్లవారు ఝాము నాలుగవుతుంది. జోరున వర్షం. పొలంలోని నీళ్లు వెళ్లగొట్టుకోవటానికి కొట్టా పాపయ్య అనే రైతు వస్తాడు. పాపయ్య, అమ్మ ఒకటి రెండు సంవత్సరాల వయస్సప్పుడు, అప్పుడప్పుడు ఎత్తుకుంటుండేవాడు. అమ్మ పెద్దదయిన తరువాత ఇదే చూడటం. అతన్ని అమ్మ గుర్తించింది గాని అతను అమ్మను గుర్తించడు. అతను పోతరాజు దేవస్థానానికి (గ్రామదేవత) రోజూ వెళ్లి బియ్యం, బెల్లమూ కలిపి నివేదన చేస్తుండేవాడు. అమ్మ రోజూ తోటలో నుండి వచ్చే సమయం, అతను పోతరాజుకు నివేదన చేయటం రెండూ ఒకేసారి జరుగుతుండేవి. ఓ రోజున అమ్మ పోతరాజు దేవస్థానంలోకి వెళుతుంది. ఆ సమయానికి పాపయ్య నివేదన చేస్తుంటాడు. అతను కళ్లు తెరచి చూసేసరికి అమ్మ పోతరాజు విగ్రహం దగ్గర నుంచునుంటుంది. పోతరాజే ఇట్లా దర్శనమిచ్చాడనుకుని అమ్మను కౌగలించుకుని, భుజమ్మీద పడుకోబెట్టుకొని, నాకు స్వామి దొరికాడని, పోతరాజు దొరికాడని కేకలు పెట్టుకుంటూ యింటికి తీసికెళతాడు. పాపయ్య భార్య అతని భుజమ్మీద పడుకునున్న అమ్మని జూసి, యెందుకీ అమ్మాయిని తీసికొచ్చావు, అని కిందికి దించుతుంది. పాపయ్య భుజం తడువుకుంటాడు. ఎదురుగా నున్న అమ్మని తనెప్పుడూ చూస్తుండే పిల్లే కదా ననుకుంటాడు. చిన్నప్పుడు తను ఎత్తుకుని తిప్పిన పిల్లే యీ అమ్మ అని గుర్తించడు.

సుబ్బలక్ష్మి : (పాపయ్య భార్య) ఆ అమ్మాయిని ఏడాది పిల్లప్పుడు ఎత్తుకోలా - కరణంగారి అమ్మాయి.

పాపయ్య : కరణంగారి అమ్మాయిని నేనెరగనూ? పసిపిల్లైతే.

సుబ్బలక్ష్మి : ఎప్పుడూ అట్టాగే వుంటుందా? పెరగలా?

పాపయ్య : నీకు తెలిదులే వూరుకో, ఆ పిల్లవేరు.

సుబ్బలక్ష్మి : పెద్దదయిన పిల్ల ఎట్లా వుంటుందేం? యిప్పుడు దాదాపు పదకొండు సంవత్సరాలుంటాయి.

అమ్మ : నాకు పదకొండు సంవత్సరాలు కాదమ్మా, ఇప్పుడు పద్నాలుగు సంవత్సరాలు. యింకా కొద్ది రోజుల్లో పదిహేను వస్తాయి.

సుబ్బలక్ష్మి : పధ్నాలుగు సంవత్సరాల పిల్లల్లే లేవమ్మా!

పాపయ్య భార్యతో నా భుజం మీద దేముణ్ణి దించావు, యేమైనాడు?

సుబ్బలక్ష్మి : నేను దించింది ఈ అమ్మాయినే, నమ్ము నమ్మకపో.

పాపయ్య : కాదంటుంటే.

సుబ్బలక్ష్మి : నీకు మతిపోయినట్టుంది. దేముడో, రాముడో అని రోజా పావలా ఖర్చు పెట్టి నివేదనలు మొదలెట్టావు. నీ మతి చెడిపోయింది.

అమ్మ : నీ భుజమ్మీద పడుకుంది నేనే పాపయ్యా.

పాపయ్య : నీవు కరణంగారి అమ్మాయినంటున్నావుగా.

అమ్మ : నీ యిష్టదైవం నా మాదిరిగా కనిపించాడు. (ఆ మాట పాపయ్యకు అర్థం కాదు) నన్ను మళ్లీ భుజం మ్మీద పడుకోబెట్టుకో, ఎట్లా వుంటానో చూడు.

పాపయ్య భుజం మీద పడుకోబెట్టుకుంటాడు. అప్పుడు మొదట కనిపించినట్టుగా పోతరాజు స్వరూపంతో కనిపిస్తుంది - అమ్మ. అమ్మను గట్టిగా చేతులతో వత్తి నువ్వేనా, అమ్మ నువ్వేనా, అమ్మ నా పోతరాజువు నువ్వేనా అని అడుగులేసుకుంటూ భజన చేస్తాడు. యిట్లా ఒళ్లు తెలీకుండా మూడు గంటలపాటు భజన జేస్తాడు.

పాపయ్య - అమ్మా, నన్ను కన్నతల్లీ అంటాడు.

సుబ్బలక్ష్మి, యేమిటీ ఈ బిడ్డనన్యాయంగా చంపుతావేమిటి? అంటూ పాపయ్య చేతులూడదీస్తుంది, అమ్మను దింపటానికి. ఆ సమయంలో ఆమెక్కూడా అమ్మ చిన్న ఆకారంగా కనపడుతుంది. ఆయనకే మతిపోయిందను కున్నా, నిజంగా యేమిటి యీ అమ్మాయి పరిస్థితని అనుమానపడుతుంది.

పాపయ్య కదలకుండా నుంచునిపోతాడు. కదిలించినా కళ్ళు తెరవడు, కొయ్యబారి నుంచు నుంటాడు.

సుబ్బలక్ష్మి పాపయ్య భుజమ్మీదనున్న అమ్మని కిందికి దించి, పోదాం పద మరిడమ్మగారి దగ్గిరికి, ఈ సంగతేమిటో తెలుసుకుందాం. పెద్దతల్లి, దేముడంతది, అని, అమ్మను తాతమ్మగారి దగ్గరకు తీసికెళుతుంది.

తాతమ్మగారు మడికట్టుకోను స్నానానికి వెళ్లబోతుంటుంది, అప్పుడు ఉదయం గం॥ 9-00లు. అమ్మని జేత బట్టుకు రావటం చూసి ఏమిటే దాన్ని తాకావు? (అమ్మతో)

అమ్మ : ఎప్పుడూ తాకే వున్నానుగా.

తాతమ్మ : ఎప్పుడూ తాకటమేమిటే, నీ ముఖం.

అమ్మ : యీ సుబ్బలక్ష్మిని చేత్తో తాకటం కాదు. 'నేను' అనేది అందరిలో వున్నది గదా, అందుకే ఎప్పుడూ తాకే వున్నానన్నాను.

విసుగు ముఖంతో అడిగిన తాతమ్మ ఈ మాట వినగానే పకపకా నవ్వుతుంది.

సుబ్బలక్ష్మి ఆదుర్దాతో, నే వచ్చిన పనికాస్త వినండి మరిడమ్మగారు.

తాతమ్మ : ఏమిటే, ఇంకా వడ్లు ఎండబోయలా, వడ్లు ఎండబోసి కబురు చేస్తా.

సుబ్బలక్ష్మి : అది కాదమ్మా నేవచ్చిన పనివేరు, నామాట ఆలకించు.

అదేలేవే, నాకు తెలుసు, వడ్లు యొండబోసి కబురు చేస్తా. యొండెక్కుతున్నది. సీతాపతి ప్రొద్దెక్కితే ఆకలికి వుండలేడని తాతమ్మ స్నానానికి బావి దగ్గిరకు వెళుతుంది.

సుబ్బలక్ష్మి వెంబడి పడుతుంది. నా పెనిమిటి ప్రాణం మీదకు వచ్చింది మరిడమ్మగారు అని కేకేస్తుంది.

తాతమ్మ : ఏమిటి నేనక్కడ ఉన్నంత సేపు ఊరుకుని యిప్పుడు కేకలేస్తావు.

సుబ్బలక్ష్మి-నేను యిందాకటి నుండి కొట్టుకుండేది ఇదే తల్లీ, అని పాపయ్య అమ్మను భుజానేసుకునొచ్చిన దగ్గర్నుండి అంతా చెబుతుంది.

తాతమ్మ అమ్మను చూచి ఏమిటమ్మా? అని అడుగుతుంది.

అమ్మ పకపకా నవ్వి నాకేం తెలియదంటుంది.

తాతమ్మ : అది అట్లా చెపుతుంటే పకపకా నవ్వుతావు, నాకేం తెలియదంటావు, యేమిటో చెప్పు. తెలియకపోతే నవ్వెందుకొస్తుంది?

అమ్మ : ఆ! ఏమీ తెలియని నవ్వు!

తాతమ్మ : నీకా తెలియంది, నవ్వుకా?

అమ్మ : నేనెవరో నవ్వుకు తెలియదు, నవ్వెవరో నాకు తెలియదు.

తాతమ్మ : నువ్వెవరో నీకు తెలియదేం, మరేం తెలుసు?

అమ్మ : ఏమిటి నాకు తెలిసింది?

తాతమ్మ : నవ్వు అంటే సంతోషం, సంతోషానికి సూచన తెలియపర్చటమేగా.

అమ్మ : యివి రెండూ మనసుకు సంబందించినవే.

తాతమ్మ : అప్పుడు నువ్వెవరో నీకు తెలుసు గాని నువ్వు ఎవరో నవ్వుకు తెలియదు.

## "నేను నేనైన నేను" - అమ్మ

"నేను నేనైన నేను" అని చిత్రమైన ఒక మాట చెప్పింది 'అమ్మ' - ఈ వాక్యానికి "అన్ని నేనులూ నేనైన నేను" అని వివరణ కూడా ఇచ్చింది.

నేను, నువ్వు అనే పదాలు భాషలో చాల చిత్రమైనవి. నేను మాట్లాడుతున్నంతసేపూ ఎదుటివాడు 'నువ్వు'- ఆ ఎదుటివాడు సంభాషణ ప్రారంభించగానే అతడే 'నేను' అవుతాడు. ఇప్పటివరకూ 'నేను' గా మాట్లాడిన 'నేను' ఉన్నపళంగా 'నువ్వు' అయిపోతాను.

భగవద్గీతలో విభూతియోగంలో కృష్ణుడు ఒక చమత్కారం చేశాడు. తేజస్సుగా తాను వ్యక్తమవుతున్న రూపాలవివరాలు తెలియచెప్పాడు. రాక్షసుల్లో ప్రహ్లాదుణ్ణి అనీ, సర్పాలలో వాసుకిని అనీ, దేవతల్లో ఇంద్రుణ్ణి అనీ - ఈ విధంగా వివరిస్తున్నాడు. పరవశించి వింటున్నాడు అర్జునుడు. ఆ వరుసలో "పాండవుల్లో ధనంజయుణ్ణి నేను" అన్నాడు పరమాత్మ. అర్జునునికి ఒళ్ళు జలదరించే మాట అది. వక్తగా ఉన్న శ్రీ కృష్ణుడు శ్రోత అయిన అర్జునునితో అంటున్నాడు. "నీవు నేనే" అని. నీవు, నేను వేరువేరుగా కనిపిస్తున్నా, యథార్థం గుర్తిస్తే "నీవే నేను" అని తెలుస్తుంది అని పరమాత్మ ప్రబోధిస్తున్నాడు.

అంతకు ముందే జ్ఞానయోగాన్ని అర్జునునికి ప్రబోధిస్తూ, పరమాత్మ అన్నాడు - అర్జునా నీకు, నాకూ చాల జన్మలు గడిచిపోయాయి. అవి నేను ఎఱుగుదును. నీవు ఎఱుగవు" - అని. ఇక్కడ స్వామి ఏమంటున్నాడో గమనిద్దాం. 'నాకు తెలుసు. నీకు తెలియదు' అని షష్ఠీ విభక్తిని కాక, "నేను ఎఱుగుదును, నీవు ఎఱుగవు" (అహం వేద, న త్వం వేత్థ) అని ప్రథమావిభక్తిని ప్రయోగిస్తున్నాడు. "తెలుసుకోనివాడు 'నువ్వు'. తెలుసుకున్నవాడు 'నేను' -" అని స్వామి సూచిస్తున్నాడన్నమాట. "తెలుసుకోనంతవరకే 'నువ్వు', పరమార్థాన్ని గుర్తిస్తే 'నువ్వూ' 'నేనూ' ఒకటే, 'నువ్వు' - 'నేను' అయిపోతావు. 'నువ్వు'గా ఉన్నది కూడ 'నేను' మాత్రమే అని గుర్తించగలుగుతావు." అని గీతాచార్యుడు 'నరుడి'కి (మానవుడికి) ఇస్తున్న సందేశం.

అన్ని వేదాంతగ్రంథాలూ సంస్కృతంలోనే ఉన్నాయి. తెలుగులో ఉన్న వేదాంత శాస్త్రం ఒక్కటే. అది 'సీతారామాంజనేయ సంవాదం'. ఆగ్రంథంలో ఒకమాట ఉంది. "నేనన్న పదమునకు అర్థములు రెండు. ఒకటి 'మేను', రెండవది 'మేను' లోపలి అసలైన 'నేను' -" అని. 'మేను' లే వేరుగాని, అన్ని 'మేను'లలోనూ ఉన్నది ఒక్కటే 'నేను' - వేర్వేరు ప్రమిదల్లో వెలుగుతున్న ఒకే జ్యోతివలె-" అని ఆగ్రంథం ప్రబోధిస్తోంది.

మన భాషలో ఒక చిత్రమైన సంగతి ఉంది. 'వాడు' అనే పదానికి బహువచనం 'వారు', 'నీవు' అనే పదానికి బహువచనం 'మీరు' అని తెలుసు మనకు. "మరి, 'నేను' అనే పదానికి?' అని ఎవరైనా అడిగితే,

-"ఒకటేమిటి? రెండు బహువచన రూపాలు ఉన్నాయ"ని ఎగిరి గంతులు వేసి చెబుతాం మనం. 'మేము' , 'మనము' అనే రెండు బహువచనరూపాలు చూపిస్తాం. కాని, నిదానించి చూస్తే, నిజం తెలుస్తుంది. బహువచనం అంటే ఏకవచనంలో ఏమి ఉన్నదో, అది బహురూపాలుగా ఉండాలి. వాడు, వాడు, వాడు కలిసి 'వారు' అవుతోంది. నీవు, నీవు, నీవు కలసి 'మీరు' అవుతోంది. కాని, నేను, నేను, నేను కలసి - 'మేము' కావడం లేదు, 'మనము' కావడం

లేదు. 'నువ్వు-నేను' కలసి 'మనం', 'వాడు - నేను' కలిసి 'మేము' అవుతున్నాయి తప్ప, నేను, నేను, నేను - ఇలా ఎన్ని నేనులు కలసినా 'నేను' మాత్రమే. 'నేను' ఎప్పుడూ ఏకవచనం మాత్రమే అనీ, 'నేను' అన్న పదానికి అసలైన బహువచన రూపం లేదనీ గుర్తిస్తాం మనం. ఎందుకంటే "నేను" ఒక్కటే కనుక.

ఆ 'నేను' నే ఆత్మతత్త్వంగా, పరబ్రహ్మగా వేదాంతులు వివరిస్తున్నారు. వేదవాఙ్మయంలోని "అహం బ్రహ్మాస్మి" అన్న మహావాక్యం ఏ సత్యాన్ని నిరూపిస్తోందో, ఆ సత్యాన్ని నిరూపించడానికే, అమ్మ "నేను నేనైన నేను" అని - "తెలుగులో మహావాక్యం" ప్రవచించిందని వేదాంత 'వీధు'ల్లో విహరిస్తున్న పెద్దలు వివరించారు.

- మల్లాప్రగడ



అమ్మ : **ఒక నువ్వే కాదు మీరందరెవరో నాకు తెలుసు, నేనెవరో మీకు తెలియదు.**

తాతమ్మ బావి గాడి మీద కాలు పెట్టి, వంగి చేద వెయ్యబోతూ, నువ్వెవరో చెప్పు పోని, మాకు తెలియకపోతే మానె, నువ్వు చెప్పు అని అడుగుతుంది.

**అమ్మ బావి దగ్గర్లోనున్న మల్లె పందరి క్రింద నుంచుని పరికిణి రెండు చేతులతో రెండు వైపుల చూపుడు వ్రేలు, బొటన వ్రేళ్లతో పట్టుకుని, గిరగిరా గిరగిరా అల్లీ బిల్లి తిరుగుతూ, మీరంతా నేనే, మీరంతా నేనే, యిందతా నేనే, యిదంతా నేనే నని ఆ ముక్కలతో పాట పాడుతూ తిరుగుతుంది.**

ఒక్కసారి మా ఇంట్లో అడుగుపెట్టి ఆయనేమిటో చూచిరా మరిడమ్మ తల్లీ. కాసేపు పోతరాజు అనుకుంటాడు, కాసేపు ఆయన తల్లి అనుకుంటాడు, నీకు దణ్ణం పెడతా అని సుబ్బలక్ష్మి ఎడుస్తుంది.

అమ్మ : ఏంలేదు తాతమ్మా, అతను పోతరాజు గుళ్లో నివేదన జేస్తున్నాడు. అప్పుడే నేను ప్రసాదం కోసం లోపలకెళ్లాను, పోతరాజు విగ్రహం దగ్గిర నుంచున్నాను. అప్పుడు నన్ను భుజానేసుకుని తీసికెళ్లాడు. ఇంతకు తప్ప నాకేం తెలియదు.

సుబ్బలక్ష్మి : ఆయన రోజూ నైవేద్యం ఎత్తుకు పోతూనే వున్నాడు గదా! యీ రోజే ఇట్లా ఎందుకయిపోవాలి?

అమ్మ : నేను రోజూ ఆయన్ని చూస్తూనే వున్నా, ఈరోజూ ప్రసాదానికెళ్లా.

తాతమ్మ : నువ్వు రోజూ అసలు అటెందుకెళుతున్నావు?

అమ్మ : పున్నయ్యగారి తోట లోనికి బైటికి వెళ్లినప్పుడు గుడి మీదుగా వస్తా.

తాతమ్మ : అతి భక్తిలో ఒళ్లు తెలియక అతను నిన్ను భుజానేసుకెళ్లాడన్నమాట.

అమ్మ : అంతే, అంతే.

సుబ్బలక్ష్మి : ఇదేం ఖర్మో, మా ఖర్మ ఎట్లావుందో. ఆయన ఏపాపం, పుణ్యం తెలిసినోడు కాదు.

అమ్మ : ఆయనకు పాపం పుణ్యం తెలియకపోయినా భగవంతుడు తెలుసు కదా.

సుబ్బలక్ష్మి : భగవంతుణ్ణి తెలుసుకుంటే బాధేముందమ్మాయిగారు, నిన్ను జూచి భగవంతుడని భ్రాంతి పడ్డాడు గాని.

అమ్మ : అటువంటి భ్రాంతి చేత నన్ను భగవంతుడనుకున్నాడు. భ్రాంతి పోతే తానే భగవంతుడయ్యే వాడు.

వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన ॥

'ఓ అర్జునా! భూత వర్తమాన భవిష్యాల్లోని జీవులన్నిటిని నేనెరుగుదును. కాని నన్నెవరూ ఎరుగరు.'

– భగవద్గీత

సుబ్బలక్ష్మి : ముందు ఆయన్ని లేపే సంగతి చూడమ్మా మరిడమ్మ తల్లి, ముందు ఆయన మత్తు వదిల్తే చాలు, ఇవన్నీ నాకెందుకు?

అమ్మ : ఆయన మత్తు వదిలే వుంది. మనకే మత్తుంది.

తాతమ్మ స్నానం చేసి నీళ్లు యింట్లో బెట్టి సుబ్బలక్ష్మి గారింటికెళ్తుంది.

ఈ గోల విని మన్నవ హనుమంతయ్యగారూ వస్తారు.

సుబ్బలక్ష్మి, తాతమ్మ వెళ్ళేటప్పటికి పాపయ్య పడుకునుంటాడు.

హనుమంతయ్యగారు చూసి, సుబ్బలక్ష్మి ఏం జరిగిందనడిగి తెలిసికొని, యిది బహుశా సవికల్ప సమాధయి ఉంటుందనంటాడు.

తాతమ్మ : అది సవికల్ప సమాధి కాదురా నాయనా, నిర్వికల్ప సమాధనుకుంటా.

హనుమంతయ్య గారు : ఇది నిర్వికల్ప సమాధయితే పిల్లని భుజమ్మీదేసికొచ్చిన స్థితేమిటి?

తాతమ్మ : అది తన్మయావస్థ.

అమ్మ : తన్మయం అంటే తన్ను తాను మర్చిపోయిన స్థితా?

హనుమంతయ్య గారు : ఆ - నీకెందుకు, చిన్నపిల్లవు, అవతలకు ఫో - అని కసురుకుంటారు.

అమ్మ : యిది ఎన్ని సంవత్సరాల వాళ్లు వినాలి తాతయ్య.

తాతమ్మ : దీనికి వయస్సెందుకమ్మా.

అమ్మ : తాతయ్య వుద్దేశమేమిటో, ప్రహ్లాదుడెన్ని యేళ్లవాడు? ధ్రువుడెన్ని సంవత్సరాల వాడు?

హనుమంతయ్య గారు : పిల్ల చిన్నదైనా పెద్ద ఎక్కాలు చదువుతుందే!

అమ్మ : అసలు ఒంట్లే రాని వాళ్లకు ఎక్కాలేం వొస్తాయి.

పాపయ్య లేచి కూర్చుని అమ్మకు నమస్కారం చేస్తాడు. యెవరు పిల్చినా పలక్కుండా అమ్మ వైపుకే చూస్తుంటాడు.

యీ స్థితి చూచిన హనుమంతయ్య గారు, తాతమ్మగారు యే సమాధయిందీ, యేమయిందోనని నిర్ణయించుకోలేక 'ఆ అమ్మాయిని చూస్తే నీకు ఎట్లా వుందేమిటి' అని పాపయ్యని అడుగుతారు.

పాపయ్య : నేనేమి చెప్పలేను, చూడబుద్ధవుతున్నది, దణ్ణం పెట్టాలనిపిస్తున్నది.

హనుమంతయ్య గారు : ఇప్పుడేనా, మొదటనుండి అట్లాగే వుండేదా.

పాపయ్య : అట్లా అంటే నాకేం తెలియదు మొదులు, చివరా చూడాలనిపిస్తున్నది చూస్తున్నా.

హనుమంతయ్య గారు : భుజం మీద పడుకోబెట్టుకొచ్చింది యీ అమ్మాయినేనా?

పాపయ్య : అప్పుడు పడుకోబెట్టుకొచ్చింది పోతరాజునే యిప్పుడు చూచేది పోతరాజునే.

హనుమంతయ్య గారు : అదీ సంగతి, ఇప్పుడు తేలింది. పోతరాజు అనే మూర్తిని తను చిత్రించుకుని లగ్నమయ్యే సమయంలో అమ్మాయి కనబడి ఉంటుంది. అదే యిదిగా భ్రమపడుంటాడు. అంత కంటే మరేం

లేదు. భయపడాల్సిన పనేం లేదు. అతనే కుదుటపడతాడు. ఏ రకంగా ఆలోచించినా అతని స్థితి మంచిదే, మానవుల్ని భగవంతుడుగా గుర్తించాడు.

అమ్మ : మంచిది కాకపోవటమేమిటి, మంచిదే, మానవుల్ని భగవంతుడుగా భ్రమ పడ్డాడు గాని, భగవంతుణ్ణి మానవునిగా భ్రమ పడలా. మన కంటే అతను ధన్యుడే యేదయినా భావమే గదా?

తాతమ్మ : హనుమంతయ్యగారితో, యేమోరా అబ్బాయి నాకు యీ సాకార పూజలు అలవాటు లేదు.

హనుమంతయ్య గారు : సాకారమే నిర్వికారంలోకి తీసికెళుతుంది.

తాతమ్మ : నిజమే, నాకలవాటు లేదు, వూరికే ధ్యానం జేయడం తప్ప.

అమ్మ : ధ్యానం ఎవరిని చేస్తావు, ఎట్లా చేస్తావు, ధ్యానం అంటే ఏమిటి?

తాతమ్మ : దృష్టిని, మనస్సుని ఏకం చేసి చూస్తాను.

అమ్మ : దృష్టిని, మనస్సుని ఏకం చేసేది మనస్సే కదా, అప్పుడు నీవెక్కడుండి చేస్తావు?

హనుమంతయ్యగారందుకుని విసుగుతో, నీకెన్నిసార్లు చెప్పాలి, చిన్న పిల్లవు నీకెందుకు?

తాతమ్మ : చిన్నపిల్లైనా ఆత్మ జ్ఞానం కలిగిన పిల్లే. అంత తెలియని పిల్లేం కాదులేరా. నాకు ఇప్పుడు సమయం కాదు యింటికెళ్ళి వంట చేసుకోవాలి, యింటికి వెళ్ళి మాట్లాడుకుందాంలే అమ్మా.

అమ్మ, తాతమ్మగారు యింటికొస్తారు.

అమ్మ ఎదురుగా లేకపోయినా పాపయ్య అదే దృష్టితో ఒక వారం, పది రోజులు నీరు, ఆహారం, నిద్రా లేకుండా - నడుస్తున్నా, యే పన్జేస్తున్నా తన ఇష్ట దైవాన్నే చూస్తుంటాడు. మొదలు, తన దున్నలకు జబ్బు చేసినప్పుడు మొక్కుతాడు. వాటికి వెంటనే బాధ నివారణవుతుంది. రెండు సంవత్సరాలు నియమంగా ఆరాధించగా కలిగిన ఫలితమిది.

తోటలో అమ్మకు పాపయ్య కనబడే నాటికి ఇది జరిగి తొమ్మిది నెలలు.

నీళ్లు వెళ్లగొట్టటానికి చేనుకు వచ్చిన పాపయ్యకు అమ్మను జూసి ఎవరో తెలుసికుందామనే ఆసక్తితో, చేలో వుండే, ఎవరక్కడ అని కేకేస్తాడు.

అమ్మ పలకదు.

పాపయ్య : (గట్టిగా) ఎవరంటుంటేను.

అమ్మ అప్పుడూ పలకదు.

పాపయ్య, దగ్గరికెళ్లి తెలుసికుందామని కఱ్ఱ నేలకు కొట్టుకుంటూ వస్తాడు. ఆ కఱ్ఱ చప్పుడుకు అమ్మఒడిలోకి రాగా మిగిలిన జంతువులన్నీ కిచకిచలాడుతూ, యే జంతువు గొంతు ధ్వనితో ఆ జంతువు అరుస్తూ - యేం చేస్తారొ చూస్తాం - మా అమ్మ దగ్గిరకు పోతున్నాం అన్నట్టు పరుగెత్తుకొస్తాయి. పాపయ్య, జంతువులు పరిగెత్తటం చూసి, ధైర్యం చేసి రాలేక మధ్యలో నుంచునుంటాడు. లోగడ వున్నవి, అప్పుడు వచ్చినవి అమ్మతో వాటి వాటి భాషలో మొరపెట్టుకుంటుంటాయి.

అమ్మ : రా నాయనా, ఎందుకు అక్కడే నుంచున్నావు?

ఎవరో, ఎక్కడో మనిషి మాట్లాడినట్టు వుంది గాని అమ్మ పిలిచందనుకోడు, నాలుగు వైపులా చూస్తాడు.

అమ్మ : నేనే నాయనా పిల్చేది. (అమావాస్య ముందు త్రయోదశినాడు తెల్లవారు ఝామున నాలుగున్నర, తెల్లని చీర మీద కొద్ది వెన్నెల పడుతుంటుంది. కాకులు కావు కావుమని అరుస్తుంటాయి. కాని అవి కేకేసేది అమ్మా, అమ్మా అనే. ప్రతి జంతువు వాటి వాటి గొంతులో వుండే ధ్వనితో అమ్మా, అమ్మా అని కేకలేస్తుంటాయి. అది మనకు అర్థం కాక రకరకాలుగా అనుకుంటాం) రా నాయనా - అవి వాటి అమ్మ దగ్గరకు వచ్చినవే, ఎందుకు భయపడ్తావు.

పాపయ్య : మెల్లిమెల్లిగా అడుగులేసుకుంటూ దగ్గరకొస్తాడు. ఎవరమ్మా నువ్వు?

అమ్మ : నేనెవరైతే యేమిలే, కూర్చో నాయనా.

పాపయ్య : ఇంత చిన్నపిల్లవు ఇంత అర్ధరాత్రి వేళ ఇక్కడ కూర్చున్నావు, అలిగి వచ్చి కూర్చున్నావా?

అమ్మ : అవును, అలిగాను.

పాపయ్య : ఎవరి మీద తల్లి, ఆడపిల్లవు యిట్లా రావచ్చునా. మంచి బుద్ధి కలిగివుండాలి గాని, ఇదా పని. అసలు నీది ఏ ఊరు, ఏ కులం, యేమిటి కత, ఏమన్నా తప్పు చేసావా?

అమ్మ : ఆ చేసా నాయనా, చెప్పరాని తప్పు నే చేసాను. చేయరాని తప్పు నువ్వు చేసావు.

పాపయ్య : అంటే నిన్నడగటమే తప్పనా? నీ కులం యేమిటంటే చెప్పలేదే.

అమ్మ : నా కులమే నాయనా.

పాపయ్య : నీ కులానికోకపేరు లేదా?

అమ్మ : మీ అందరి కులాలు నా కులమే. నాకు వేరే కులం లేదు నాయనా.

పాపయ్య : నీకు వేరే కులం లేదన్నమాట. ఒక్క భగవంతుడికేగా కులం లేంది.

అమ్మ : ఆ సంగతి నాకు తెలియదు నాయనా.

పాపయ్య : మెడ వంచి చూసి - ఈ జంతువులేమిటి, ఈ పిట్టలేమిటి, నువ్వెవరివసలు? ఈ పాములు కరిస్తే చావవూ, భయం లేదూ నీకు? అసలు నీవెవరివంటే...?

అమ్మ : అసలు 'నేనే' నాయనా, ఇవన్నీ నావే, 'నేనే'.

పాపయ్య ఇంకొక కాలు ముందుకేసి, కనబడక కర్ర ఒళ్లో వేస్తాడు. ఆ కర్ర పాము నడుమ్మీద పడుతుంది. పాము తలపైకెత్తి అటూయిటూ తిప్పుతుంది, పాపయ్య అర్థం చేసుకోడు.

అమ్మ : కర్ర పైకెత్తు నాయనా, తమ్ముడి నడుమ్మీద పడ్డది.

పాపయ్య : తమ్ముడెవరమ్మా?

ఎక్కడ అని పాపయ్య కర్ర పైకెత్తుతాడు. కప్పలు ఒకటి రెండు పాపయ్య మీదకు ఎక్కి కిందపడతాయి.

పాపయ్య : ఈ పాడు జంతువుల్లో ఎట్లా కూర్చున్నావమ్మా? యేం కర్మమొచ్చింది నీకు? ఎంత కోపం వస్తే మాత్రం నీకు చోటే దొరకలా?

అమ్మ : పాడు జంతువులు కాదు నాయనా, ఎంతసేపు నించునుంటావు కూర్చో అన్నయ్యా అని పిల్చాయి. వాటి భాష మనకు అర్థం కాక యీ భాష.

పాపయ్యకు తెల్లవారుతున్న కొద్దీ అమ్మ ఒడిలో నున్న జంతువులన్నీ స్పష్టంగా కనబడి భయపడతాడు.

పాపయ్య : ఏం అమ్మా, నీవెవరవూ? మాంత్రికురాలివా? ఎవరికయినా చాతబడి చేయటానికొచ్చావా? కనికట్టు విద్య ఏమైనా నేర్చావా? ఏమిటి నీ సంగతి, నిజం చెప్పమ్మా భయమేస్తున్నది. నేను పోతున్నా. పోవటానికీ భయమేస్తున్నది. నేను లేనిపోనిది వచ్చానే?

అమ్మ : నీకేం భయంలేదు నాయనా.

పాపయ్య : సరేగాని, ఏందమ్మా ఇంతకు ముందన్నావు, ఆ అన్నమాటేంటి - చెప్పరాని తప్పు చేసాను, చేయరాని తప్పు నువ్వు చేసావు అన్నావే - యేంటది?

అమ్మ : పోతరాజుకు నివేదన మానుకున్నావే, అది చేయరాని తప్పు.

పాపయ్య : మరి, నువ్వు చేసిన తప్పేమిటమ్మా?

అమ్మ : పిలుస్తున్నది నీవని తెలిసి నేను ఫలానా అని చెప్పకుండా నిన్ను తిప్పలు పెట్టటమే చెప్పరాని తప్పు.

పాపయ్య : నేను నివేదన చేయటం నీకు యెట్లా తెలుసు తల్లీ!

అమ్మ : నువ్వెందుకు మానుకున్నావో చెప్పితే....

పాపయ్య : పోతరాజు ఎక్కడపడితే అక్కడ కనపడుతున్నాడు, ఇంక నివేదన ఎక్కడని చేసేది.

అమ్మ : పొలంలో కనపడ్డాడా?

పాపయ్య : కాస్త తల్పుకుంటే చాలు కరణంగారి అమ్మాయిలాగ కనపడతాడు. నీవు నమ్మో నమ్మకపో, ఇందాకట నుంచి లేదుగాని ఇప్పుడు నీదగ్గిర కూడా కనపడుతున్నాడు.

అమ్మ : ఇంతకు ముందు మాంత్రికురాలినంటివే.

పాపయ్య - అప్పుడు అట్లా కనపడ్డావు, క్షణ క్షణానికి నీ రూపం మారుతున్నదమ్మా, ఆ తండ్రి నాకు యిన్ని రూపాల్లో కనపడుతున్నాడా - అని ఒక్కొక్క అక్షరమే నిమ్మళంగా అంటాడు.

ఇన్ని రకాల జంతువుల్ని ఒళ్లో కూర్చోబెట్టుకుని యిట్టా ఈ రూపంగా - మనుషులు, విష జంతువులు, పిపీలికాది ... - ఆపై మాట నోరు తిరగదు. అన్నీ నేనేనని యిట్లా చూపిస్తున్నావా నాయనా, అని అమ్మను కౌగలించుకుంటాడు. అప్పుడైనా అందరికీ కరణంగారి అమ్మాయల్లే వుందిగాని, నకేమిటో చెప్పలేని పరిస్థితి. చూడగా, చూడగా ... - నీవెరమ్మా, కరణంగారి అమ్మాయివా? కరణంగారి అమ్మాయల్లే వున్నావే?

అమ్మ : నీకెట్లా కనబడితే అట్లా చూడు నాయనా.

పాపయ్య : అట్లాగే వున్నావమ్మా, కరణంగారి అమ్మాయల్లేనే వున్నావు. పోతరాజు నీమీద పూనికై వున్నాడన్నమాట.



పతిం విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతమ్ ।
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ ॥

విశ్వానికి నాథుడూ, జీవులకు ఈశ్వరుడూ, శాశ్వతుడూ, మంగళరూపుడూ, వినాశం లేనివాడూ, విశిష్టంగా తెలుసుకోవలసినవాడూ, సమస్తానికీ ఆత్మయై ఉన్నవాడూ, శరణు పొందదగిన ఉత్కృష్టుడూ అయిన నారాయణుని ధ్యానిస్తాను.

- నారాయణ సూక్తమ్

అమ్మ : అంటే యేమిటి పాపయ్యా?

పాపయ్య : పోతరాజు ఎవరికి దర్శనమివ్వాలన్నా నీ రూపంతో ఇస్తాడన్న మాట.

అమ్మ - తెల్లారింది నాన్నా అంటూ పాము తల నిమురుతుంటుంది. అలాగే మిగతా జంతువులను బుజ్జగిస్తూ ... మీరాడుకుంటుండండి, నే వెళ్లొస్తానని లేచి నుంచుంటుంది.

జంతువులన్నీ ఒక్కసారిగా కాలికి చుట్టేసుకుని మేముండం. నీతో వస్తామని మారాం చేస్తాయి.

పాపయ్య విచిత్రంగా చూస్తుంటాడు.

అమ్మ - వదమ్మా మీరిక్కడే వుండండి. మిమ్మల్నెవరన్నా చంపుతారు. మీకూ మనస్సుంది. అది మనుషులు గుర్తించనంత వరకు మీరెక్కడ కనబడ్డా చంపబోతారు. మీ శరీరానికి వత్తిడి తగిలి, ప్రాణం పోతున్నది, తప్పని సరి అనుకున్నప్పుడే మీరు కరుస్తారు, ఈ మనుష్య జాతి అలా కాదు, వాళ్ల మనస్సుకు కష్టం తోచినా చాలు, ఇష్టం లేకపోయినా చాలు. ఒక రకమైన మనస్సు ఒకరిదై, ఇంకొక రకమైన మనస్సు ఇంకొకరిదై, వారి వారి మనస్సును బట్టి ఒకరినొకరు అర్థం చేసికునీ, చేసుకోలేక, కలహాలు పెంచుకుని అనుక్షణం కరుచుకుంటూనే వుంటారు. (అంటే అనుక్షణం ద్వేషించుకుంటూనే ఉంటారు) పాపయ్యతో - కదూ పాపయ్యా? అంటుంది.

పాపయ్య : మంచి మాట చెప్పావమ్మా, కానీ, నీవిప్పుడు మాట్లాడినవన్నీ వాటికి అర్థమైనాయా?

అమ్మ : ఇంతకు ముందు నే చెప్పిందదేగా, వాటికి అర్థమయిందో లేదో మన˘ర్థం కాదు.

పాపయ్య : అయితే అమ్మాయిగారు, వాటి భాష నీకర్థమవుతుందా, అమ్మా?

అమ్మ : పోతరాజును పట్టుకుని అమ్మాయిగారు అంటున్నావే?

పాపయ్య : ఎందుకో అమ్మ, ఇప్పుడు అలా అనిపించింది. ఇప్పుడు ఈ జరిగేవన్నీ తీసికెళ్లి వూళ్లో ఎప్పుడెప్పుడు చెపుదామా ననిపిస్తున్నది.

అమ్మ : నీవు చెప్పినా ఎవ్వరూ నమ్మరు. ప్రత్యక్షంగా చూస్తేనే కాని నమ్మరు. నీకు 9 నెలల నుండి పిచ్చెక్కిందని వాడుక, నీ మాటనెవరు లెక్క చేస్తారు పాపయ్యా? నీకెందుకు నీవు చూచిందాన్ని గుర్తుంచుకుని ఆనందపడు.

పాపయ్య : అంటే తేళ్లను, పాములను, జంతువులను పక్షులను, చెట్లను గుర్తు పెట్టుకోమంటావా.

అమ్మ : అవును, అవన్నీ పోతరాజు స్వరూపమని గుర్తుపెట్టుకో.

పాపయ్య : ఇవన్నీ పోతరాజల్లే కనబడితే గుళ్లోకెళ్లి దణ్ణం పెట్టుకోవటమెందుకు?

అమ్మ : మరెందుకు మానుకున్నావు?

పాపయ్య : అప్పటి నుండి యెప్పుడు జ్ఞాపకమొస్తే అప్పుడు నీ రూపంలో కనపడుతుంటాడమ్మా.

అమ్మ : యేంటో రకరకాలుగా చెపుతావు.

పాపయ్య : నాకు మాట్లాడటం చేతకాకపోయినా ఒ గురి కలిగిందమ్మా, ఇవన్నీ పోతరాజల్లే కనబడకపోయినా, ఇవన్నీ ఆ తండ్రి చే యేర్పడ్డవనే నమ్మకం కలిగింది.

యెట్లాగైనా ఒకటే, వూళ్లో మాత్రం చెప్పకు, పోతరాజ కోప్పడతాడు, ఏం - అని అమ్మ నవ్వుతుంది.

పాపయ్య : సరేలే అమ్మ సరేలే! ఆయనకు కోపం రాకుండా చేయి.

అమ్మ, పాపయ్య కట్ట మీదనున్న రావిచెట్టు క్రిందకొస్తారు. బాగా తెల్లారుతుంది. కొంగలు, నీటి బాతులు చెరువులో అప్పుడే కదులుతుంటాయి. పాపయ్య యింటి వైపు వెళ్లబోతూ చెరువు చూడమ్మా ఎంత ఉరవడిగావుందో అంటాడు. నిన్న సాయంకాలం యింత చెరువు లేదమ్మా.

అమ్మ : చెరువు ఎప్పుడూ వుంది. నీళ్లు నిండినై.

పాపయ్య : నీళ్లు వుంటేనే కదా అమ్మా చెరువయ్యేది.

అమ్మ : నీళ్లు నిలపటానికి త్రవ్వి, పారుదల లేకుండా నాలుగువైపులా చదరంగా యేర్పరచిందాన్నే చెరువంటారు. బావిలో నీళ్లుంటే చెరువంటారా? నీళ్లున్న చోటల్లా చెరువంటున్నారా? నేను చిన్నపిల్లను కదూ? మా తాతనడిగి చెరువంటే ఏమిటో చెపుతాలే.

పాపయ్య - అదేమిటమ్మా అదేమిటి అని పెద్ద పెద్దగా అరుస్తూ నీళ్లు పరిగెత్తుకొస్తున్నాయి. నీళ్లు, పక్షులు పరిగెత్తుకొస్తున్నట్లున్నాయి, చూడమ్మా ఎన్ని రకాల పక్షులో. ఆ ధ్వని ఏమిటమ్మా? - నీళ్లక్కూడా ధ్వని ఉంటుందా?

కోయిలలు, పాలపిట్టలు, గోరిం˘లు, పావురాలు, ఒక రకమేమిటి - చిలకలు ఎనెన్ని రకాలున్నాయో - అన్ని రకాలు, గుడ్లగూబలతో సహా అమ్మ చుట్టూ ప్రదక్షిణం చేసినట్టుగ తిరిగి చెట్లెక్కుతాయి. యేం అమ్మా, యేమిటీ పక్షుల లోకం - మానవ లోకంలోనే తిరుగుతున్నాయి.

అమ్మ : పక్షులు మానవుల కొరకు యేర్పడ్డాయి, మానవులు పక్షుల కోసం యేర్పడ్డారు. ఒక మానవులేమిటి, ఒక దానికొకటి అవసరం. ఆ అవసరం యెట్లా వుంటుందంటే విస్తరి కావాలి, బాదం చెట్టుతో అవసరం. చింతపండు కావాలి, చింత చెట్టుతో అవసరం. మిరప కావాలి మిరప చెట్టుతో అవసరం. ఉప్పు కావాలి, సముద్రంతో అవసరం. ఉప్పు అవసరం కదా అని ఒట్టి ఉప్పును తినలేం. విస్తరి అవసరమని ఒట్టి విస్తరి తింటామా? ఒకటి అవసరమైనా ఇంకొకదాన్తో కలిస్తే కాని ఆ వస్తువు ఉపయోగపడదు. ప్రొద్దుకూకిందాక దీపం గుర్తుకు రాదు. దీపంతో అవసరం కలగాలంటే చీకటి రావాలి. అట్లాగే ఇంట్లాంటివెన్నో. ప్రపంచమంతటా యీ ద్వంద్వాలతోనే ఉంది. అన్నీ మనకవసరం, మనం అన్నింటికీ అవసరం.

అమ్మ చెరువు వైపు రెండడుగులు ముందుకేస్తుంది. ఈ జనం అప్పుడే చెంబులు చేతబట్టి కట్ట వైపుకు వస్తుంటారు. అరుణోదయమవుతున్నది, అమ్మ చెరువులో కాలుపెడుతూ, రా పాపయ్య చెరువు లో స్నానం చేసి పోదాం, రా అంటుంది.

పాపయ్య, నాకు ప్రొద్దున్నే .... అని, సరే వస్తాలేమ్మా అని అతను చింతపుల్ల విరిచి నోట్లో పెట్టుకుని అమ్మకు ఒక పుల్ల తీసికొస్తాడు.

కాకి రావి చెట్టు మీద తన బిడ్డలకై కట్టుకున్న గూటి నుండి ఒ పుల్ల తెచ్చి అమ్మ పాదాల ముందు పడేస్తుంది.

పాపయ్య పుల్లతెచ్చి ఇదిగో నమ్మా అంటాడు.

అమ్మ : ఎందుకులే నాయనా, కాకి తెచ్చిచ్చిందిలే.

పాపయ్య : ఇవ్వటం కాదమ్మా, అది కరుచుకు పోతూ, పోతూ వదిలి పెట్టింది, అదేం పుల్లో, పాడుపుల్ల.

అమ్మ : నేను యింతకు ముందే చెప్పాను కదా నాయనా, వాటి భాష మనకర్థంకాదని.

పాపయ్య : అయితే - మాకర్థం కాదు, నీకర్థమవుతున్నదనేగా నీవు చెప్పటం!

అమ్మ : నేను చెప్పేదేముంది, మీతో కాలం గడుపుతున్నట్లే వాటితోను కాలం గడుపుతున్నా.

పాపయ్య : నీ దృష్టిలో మనుషులు, జంతువులు ఒకటిగానే ఉన్నాయమ్మా!

అమ్మ : ఆ - అవును, అవి యితరమనిపించటం లేదు, అన్నీ "నేనే" ననిపిస్తుంది.

పాపయ్య : అన్నీ నీవేననిపిస్తే ఎట్లా చేస్తుంటావీ పనులన్నీ?

అమ్మ : నేను అన్ని రూపాలై అన్నింటిని వాడుకుంటున్నాననుకుంటా.

పాపయ్య : ఏదోలే అమ్మ, అడుగుతానే కాని నాకేం తెలియదమ్మా, శూద్ర ముండా కొడుకుని, ఆ ఒక్క పోతరాజు తండ్రిని కొల్చుకోవటమే తప్ప యితర మేమీ తెలియదు. మీ మారు తల్లి పొలం నేనే చేస్తుంటానమ్మా.

అమ్మ : ఏదీ తెలీకుండా వాడొక్కడ్నే తెలిసుకోవటం కంటే కావలసినదేముంది. అందరూ చేసే ప్రయత్నం అదే. నీవు చాలా ధన్యుడివి పాపయ్యా. ఇద్దరం ముఖం కడుక్కొని స్నానం చేద్దాం, చెరువు లోకి రా.

కట్ట మీద వచ్చేవారు పొయ్యేవారు అమ్మను చూచి కార్తీక స్నానాలు చేయటానికొచ్చినట్లుంది, మరిడమ్మగారు కూడా లేకుండా వచ్చిందే? ఊళ్లో లేదుగా, ఎప్పుడొచ్చిందోనని మెల్లిగా అనుకుంటూ, పలకరించబోయి ఇప్పుడెందుకులే ననుకుని వెళ్లిపోతారు.

పాపయ్య : అమ్మా! చెరువు సంగతి అడిగితే చెప్పలేదేం? యేమిటీ ధ్వని?

అమ్మ : ఏమీ లేదు నాయనా, ఆ జంతువులల్లనే చెరువు కూడా యేప్పుడొచ్చావమ్మా అని పలకరించి నవ్వుతున్నది.

పాపయ్య : చెరువు కూడా నిన్ను అమ్మవనే అనుకుంటుందా అమ్మా!

అమ్మ : ఆ అనుకుంటుంది.

భయానాం భయం భీషణం భీషణానాం
గతిః ప్రాణినాం పావనం పావనానం ।

'నువ్వు సకల భయాలకు భయానివి. భీషణమైన వాటన్నిటికి భీషణం; **సమస్త ప్రాణికోటికి ఆశ్రయస్థానం;** పావనాలకెల్ల పావనం.'

- మహానిర్వాణ తంత్రం

పాపయ్య : యీ తెల్ల కలువ పూలు, యీ యెర్ర కలువ పూలు, యీ ఆకులు, తీగలెందుకు యిట్లా వుత్సాహంగా కదులుతున్నాయి!

అమ్మ : మార్గశిర మాసం కదూ నాన్నా.

కళకళలాడుతూ అన్నీ అమ్మ దగ్గిరకు చేరి ఆడుకోవాలనే కోరికతో ఉవ్విళ్లూరి, ఊగిఊగి, ఒక్కసారి అమ్మఒడిలో వాలతాయి.

మరిడమ్మ తాతమ్మగారు, మరి కొంతమంది కలిసి స్నానాలకు వస్తారు. కట్ట మీద నుండి కాకుమానుల లక్ష్మాయమ్మగారు చెరువులోకి దిగుతున్న మరిడమ్మగార్ని - యేం మరిడమ్మాక్కా తెల్లగా తెల్లారి స్నానాలకొచ్చారు, కృత్తికా స్నానాలు యిప్పుడా చేసేది?

తాతమ్మ (మరిడమ్మ) : జోరున వర్షం యేం జెయ్యమంటావమ్మా.

లక్ష్మాయమ్మ గార : నీ కంటే ముందే వచ్చి ఆ చెర్లో దిగుతున్నది. పక్షులతో, పూలతో యేదో మాట్లాడుతున్నట్లున్నది. మీ మనుమరాలు అనసూయ యెప్పుడొచ్చిందేం?

తాతమ్మ : ఊ - రాత్రే వచ్చిందమ్మా. ఎప్పుడొచ్చిందో చెరువుకు, నేను చూడలేదు. యింటి దగ్గర కనిపించకపోతే గదిలో పడుకుని నిద్రపోతున్నదేమోననుకున్నా. యేది, యెక్కడున్నది?

లక్ష్మాయమ్మ గారు: అదే ఆ రేవు దగ్గర పున్నయ్యగారి తోట వైపున, అదిగో దిగుతున్నది. ఇప్పుడిప్పుడే తామరపూలకు పై యెత్తున నుంచునుంది, కూడా ఒక మొగ మనిషి వున్నాడు. దూరానికి మన కొట్టా పాపయ్య మాదిరిగా వున్నాడు.

తాతమ్మ : లక్ష్మాయమ్మా, ఎటూ యింత దూరం వచ్చావుగా, స్నానం చేసి పోదాం, దిగరాదు.

దాదాపు 40 మంది జనం చెరువు నిండా స్నానాలు చేస్తూ సూర్యుడికి అర్ఘ్యం యిచ్చుకుంటూ పాటలు పాడుతూ స్నానాలు చేసి దీపాలు వెలిగించి నీళ్లల్లో వొదిలిపెడతారు. కొందరు నారింజకాయ డిప్పల్లో, కొందరు కొబ్బరి చిప్పల్లో, కొందరు అరిటాకు డిప్పల్లో జ్యోతులు వెలిగించి నీళ్లల్లో ఒదిలిపెడతారు. ఆ గ్రామంలో మార్గశిర మాసంలో కూడా స్నానాలు చేసి దీపాలు పెడతారు.

అమ్మ వీళ్లకు ఎదురుగా తూర్పు ముఖం పటమట దిక్కున రేవులో దిగుతుంది. అమ్మ రేవులో అడుగు పెట్టగనే పూలనెవరో ఊపినట్టుగా ఊగుతుంటై.

**మహతః పరమవ్యక్త అవ్యక్తాత్ పురుషః పరః ।**
**పురుషాన్నపరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః ॥**

'మహత్తు (మహాన్ ఆత్మ) కంటె అవ్యక్తం గొప్పది. అవ్యక్తంకంటె పురుషుడు (పరబ్రహ్మం) శ్రేష్ఠం. పురుషుని మించినది ఏదీ లేదు. అదే పరాకాష్ఠ. అదే పరమపదం'.

- కఠోపనిషత్తు

అమ్మ వస్తున్నా, వస్తున్నా నని పూల దగ్గిరకు వెళుతుంది. ప్రతి పువ్వు అమ్మ గుండెలకానుకుని, పెద్ద సుడిగాలిలో కొట్టుకొని తల్లి ఒడిలో వ్రాలామన్నట్లు నిద్రిస్తాయి. అమ్మ, చెరువులో వున్న ప్రతి పువ్వును, ఆకును, తీగను తాకి వాటిని గుండెలకు హత్తుకుని ఓదారుస్తుంది.

పాపయ్య : అమ్మా! యీ పూలు, ఆకులు తీగలు నిన్ను చూచినప్పు డొకరకం, నీవు దగ్గరకు పోయినప్పు డొకరకం, నీవు తాకినప్పు డొకరకం - యిన్ని రకాలుగా వుంటాయెందుకమ్మా! ఆ పూలలో కూడా తాకినప్పుడు అన్నీ ఒక రకంగా లేవు, నేను చూస్తూనే వున్నాను, ప్రతి పూవుకూ మార్పొచ్చింది కానీ, ఒకే రకంగా కాదు. రకరకాల మార్పులతో కనబడ్డాయి. ఎందుకనమ్మా, నాకు అట్లా కనిపించినాయా? లేక వాటికలా మార్పులొచ్చాయా?

అమ్మ : నీవింత శ్రద్ధతో ఎలా కనిపెట్టావు, నీ కెందుకొచ్చిందీ అనుమానం?

పాపయ్య : తెల్లవారు ఝామున జంతువుల్ని నీ ఒడిలో చూచినప్పటి నుండి యిదేమిటో తెలుసుకుందా మనిపించింది. అప్పుడు నీవు చెప్పినా ఆ మాట మీద నాకు నమ్మకం కలగల. నువ్వు కాకి పుల్ల తెచ్చి యిచ్చిందన్నప్పటి నుండి, పక్షులన్నీ నీ చుట్టూ తిరిగినప్పటి నుండి అసలదేమిటో తెలిసుకోవాలని గట్టిగా అనిపించింది. చెరువులో నీటి ధ్వని యెన్నడూ విననిది. నువ్వు అడుగు పెట్టగనే పూలు వాలటం కళ్ల యెదుట కనబడ్డది. దాని తరువాత ప్రతిదీ శ్రద్ధతో గమనించాను. యిది అంతా యెట్లా వున్నా, నాకు పోతరాజుగా దర్శనమిచ్చిన తల్లివి అబద్ధం యెట్లా చెబుతావు. నీవేది చెప్పినా నిజమే, కాదు కాదు, పొరపాటు, నిజం నువ్వు చెప్పటం కాదు, నీవు చెప్పింది నిజమవుతుంది తల్లీ.

అమ్మ : ఇంత బాగా మాట్లాడటం ఎప్పుడు నేర్చుకున్నావు, పాపయ్యా?

పాపయ్య : అంతా నీ దయే తల్లీ, గంపెడంత కన్ను పెట్టుకొని కాపాడే తల్లివి, నీకు తెలియందేముంది.

అమ్మ : అది సరే కాని, చూడు చూడు పై వరస చూడు, ఆ దీపాలన్నీ బారులు తీరి ఒక్కటిగా వస్తున్నాయి, యెంత బాగుందో, చూడు - ఆకాశాన నక్షత్రాలెట్లా ఉన్నాయో, యీ చెరువులో దీపాలు అట్లా వున్నాయి, వస్తున్నాయి చూడు.

పాపయ్య : వాటి చూపు నీ వైపే ఉన్నదమ్మా. చూడు, దీపం పైకొన నీవైపే చూస్తున్నది. యిటే వస్తున్నట్లున్నాయి. దగ్గిరకు పోదామా అమ్మా, వద్దులే అవి ఎటొస్తాయో చూద్దాం, యిది గూడ కనిపెడదాం.

అమ్మ : యెప్పుడో కని, పెంచాను. యిప్పుడు కనుపించాను.

పాపయ్య : యేమిటమ్మా మళ్లీ అను.

అమ్మ : ఏం లేదు నాయనా.

పాపయ్య : నాకర్థం కాలేదు, ఇంకోసారి వినాలని ఉంది.

అమ్మ : నువ్వా అను - నీ నోటంట పలుకుతుందేమొ చూస్తాను.

పాపయ్య : అంటే, యేనాడో కని, పెంచి యీనాడు కనుపించావా, దీని అర్థమేమిటమ్మా?

అమ్మ : యేమీ లేదు - నిన్నూ, ఇంకో పిల్లాడ్ని కన్నాననుకో, అయిదేళ్లో, ఆరేళ్లో పెంచాను, యెవరికో పెంపుడిచ్చాను, పాతిక సంవత్సరాలో, నలభై సంవత్సరాలో గడిచిన తరువాత నేవెళ్లి - మీ అమ్మన్నేనంటే ఎలా వుంటుంది? ఇదే స్థితి.

పాపయ్య : ఇంకా అర్థమయ్యేటట్టు చెప్పమ్మా.

అమ్మ, ఇంకా యింత కంటే యేం చెప్పేది అంటుండగానే దీపాలన్నీ ఒక్కసారిగా, లైనుగా ఉన్నవల్లా వంపు తిరిగి, గుండ్రంగా మెలికలేసుకుని, అమ్మ దగ్గరకు వస్తాయి.

పాపయ్య : ఆ మెలికలు చూడమ్మా, ఎలా ఉన్నాయో, 'అమ్మా'! అని రాసినట్లున్నాయి. నీ దగ్గరకు అవి 'అమ్మా' అని తలవంచి నీ ఒళ్లోకి వస్తున్నాయి. 'అమ్మా' అంటూ గుండెలు కొట్టుకుంటూ - ఆహా ఎంత చిత్రం, నా పోతరాజు ఎన్ని రూపాల్లో దర్శనమిస్తున్నాడో, అమ్మే పోతరాజు, పోతరాజే అమ్మ - యీ ఊరంతా యీ అమ్మకు కొబ్బరికాయలు కొట్టకూడదూ, యింకా వేరే గుళ్లెందుకు, దేవుళ్లెందుకు - ఎవరో చిన్నపిల్లవనుకుంటున్నారు. యీ ఊరికంతా ఇట్లా కనపడేటట్టు చేయమ్మా, ఏనాటికైనా యీ ఊరంతా నీకు కొబ్బరి కాయలు కొడతారా తల్లీ?

అమ్మ : ముందు తలకాయ పగలగొట్టి పంపిస్తారు, తరువాత కొబ్బరికాయ మాట.

పాపయ్య : ఛీ, అయ్యో, అదేమిటి తల్లీ, అట్లా అంటావు.

అమ్మ, రెండూ వింటావుగా, అంటూ చెరువులోపలకెళ్లి, పావుగంట కనబడకుండా, పది గజాల దూరం పోయి తలెత్తి, పాపయ్య రా, ఇక్కడున్నానని కేకేసి మళ్లీ తల ముంచుతుంది.

పాపయ్య అమ్మ తలెత్తిన చోటికి ఈత కొట్టుకుంటూ వస్తాడు.

అమ్మ పాపయ్య బయలుదేరిన చోటికెళ్లి, పాపయ్యా నేనిక్కడున్నా, రా - అంటుంది.

పాపయ్య, యెందులో చూసినా యేదో గొప్పతనమే కనపడుతున్నది, పాము తల బైటకు పెట్టినట్లు ఎప్పుడో ఒకసారి తల బైటకు పెడుతున్నది. పామే నయం తల బైటకు పెట్టి ఈత కొడుతుంది, తల ముంచితే చస్తానేమోనని దానికి భయం. యీ తల్లికి భయమేముంటుందనుకుని అమ్మున్న వైపుకు ఈత కొట్టుకొంటూ వెళతాడు.

అమ్మ తల పైకెత్తి పాపయ్యా ఆడుకుందాం రా అని చెరువుకు నాలుగు మూలలా ఈతకొడుతూ, పాటలు పాడుతూ, గంటా గంటన్నర సేపు ఆడుకుని గట్టెక్కుతుంది...

తాతమ్మ : స్నానం చాలిందా, ఇప్పుడైనా ఇంటికి వస్తావా?

అమ్మ - నేనూ స్నానానికే వచ్చా, యెందుకు రానంటూ, ఆ తడి గుడ్డలతో తాతమ్మ గారి కంటే ముందు ఇంటికి వెళుతుంది.

"పూసలన్నీ ఒక దారంలో గుచ్చినట్లుగా ఈ జీవులన్నీ ఆత్మ మీదనే ఆధారపడి ఉంటాయి. పూసలన్నీ వేరు వేరుగా ఎట్లా ఉంటాయో ఈ జీవులన్నీ అంతే." - **అమ్మ**

## "నా దయ ఒడి దుడుకులే" - అమ్మ

లోకంలో సాధారణంగా ఒక అభిప్రాయం ఉంది. దైవాన్ని ఆరాధిస్తే, దైవానుగ్రహం పొందితే, మనకు కష్టాలు రావని, వచ్చిన కష్టాలు తొలగిపోతాయని. అమ్మ దగ్గరకు వచ్చే సోదరులలో కూడా చాలా మందికి ఇలాంటి అభిప్రాయమే ఉంది. కాని, వారందరి ఆలోచనలను తారుమారు చేస్తూ, అమ్మ ఒక మాటచెప్పింది - "నా దయ ఉన్నంత మాత్రాన ఒడిదుడుకులు లేకుండా పోవు. నా దయ ఒడిదుడుకులే" - అంది.

మనకు ఆశ్చర్యం కలుగుతుంది. "కష్టాలు పోగొట్ట లేకపోతే దేవుడు దేనికి? మన పురాణాల్లో దేవుళ్ళు ఎందరెందరి కష్టాలను తొలగించలేదూ? అమ్మ ఇలా విడ్డూరంగా చెబుతుందేమిటి?" అనిపిస్తుంది. చూద్దాం.

మహాభారత యుద్ధానికి మొదటి పదిరోజులూ సర్వసైన్యాధ్యక్షుడుగా వ్యవహరించి, జగదేకవీరుడైన అర్జునుణ్ణి హడలగొట్టి, ఆయుధం చేతపట్టనని ప్రతిజ్ఞ చేసిన కృష్ణుడి చేత ఆయుధం పట్టించి, భక్తుడి ముందు భగవంతుడు ఓడిపోతాడని నిరూపించిన భీష్ముడు, పదవ రోజు యుద్ధంలో అంపశయ్య మీదికి ఒరిగిపోయాడు. మరికొన్నాళ్ళకు కురుక్షేత్ర సంగ్రామం ముగిసింది. ధర్మరాజు సింహాసనం స్వీకరించటానికి నిరాకరించాడు. తన కారణంగానే రక్తపాతం జరిగిందని, అయిన వారిని చంపి దక్కించుకున్న నెత్తుటికూడైన రాజ్యాన్ని పాలించలేనని, పట్టాభిషేకం వద్దని - విలపించాడు. శ్రీకృష్ణుడు, ధర్మజుని చేత మూడు అశ్వమేధ యాగాలు చేయించాడు. అయినా, ధర్మజునికి మనశ్శాంతి కలుగలేదు. తాము ఎంతగా చెప్పినా దారిన పడలేకపోతున్న ధర్మరాజును, భీష్ముడి సన్నిధికి తీసుకువచ్చారు వ్యాసుడు, కృష్ణుడు. కుంతీపాండవులను వెంటబెట్టుకొని తనను చేరవచ్చిన వ్యాసకృష్ణులను చూచి పరవశించి పోయాడు భీష్ముడు. విషయమంతా వివరంగా తెలుసుకున్నాడు. ధర్మరాజునకు నచ్చ చెప్పవలసిన బాధ్యత భీష్మునిపై పడింది. భీష్ముడు ధర్మరాజు వంక చూస్తూ, 'నిన్ను ఓమాట అడుగుతాను. సమాధానం చెప్తావా?' అన్నాడు. ధర్మజుడు తలవంచి, "ప్రయత్నిస్తాను" అన్నాడు. భీష్ముడు ప్రారంభించాడు. "ఏమీ లేదు నాయనా! కష్టాలు ఎవరికి వస్తాయి? అసమర్థులకు. సమర్థులకు ఎన్నడూ కష్టాలు రావు. సమర్థులే అయినా, దైవానుగ్రహం పొందలేని వారిని కష్టాలు చుట్టిముట్టి బాధిస్తాయి. అంతే కదా! మీరు ఎంతో సమర్థులు. పరాక్రమ సంపన్నులు. శ్రీకృష్ణుడి నీడలో ఉన్న మీకు దైవానుగ్రహం లేదనడానికీ అవకాశం లేదు. కానీ, మీరు పడినన్ని బాధలు ఎవ్వరూ పడలేదు. ఎందువల్లనంటావు?' అని అడిగాడు.

అందరూ కుతూహలంగా చూస్తున్నారు - ధర్మరాజు ఏమి చెబుతాడో అని. "తాతా! మంచి ప్రశ్న అడిగావు. నీవు చెప్పినట్లు మేము సమర్థులమే. అయితే, ఆ సామర్థ్యం మా సొంతం కాదు. అదీ దైవానుగ్రహమే. శ్రీకృష్ణుని అనుగ్రహం మాకు పరిపూర్ణంగా లభించింది. ఎన్నో సందర్భాలలో మేము ఎంతో రక్షణ పొందాము. అయితే, కొన్నికొన్ని సన్నివేశాలలో మేము బాధలు పడ్డమాటకూడా యథార్థం. మానవజీవితంలో అన్ని సన్నివేశాలూ దైవలీలలు అని, మానవుడు చేసే పుణ్యాపాపకర్మలకు, అతడు పొందే సుఖదుఃఖాలకు ఏమీ సంబంధం లేదని నేను గ్రహించాను. కష్టాలు వచ్చినంత మాత్రాన దైవం కరుణించ లేదనుకోవడం మానవుల బలహీనత తప్ప యథార్థం కాదని మా జీవితాలు ఆధారంగా మేము తెలుసుకున్నాం. కష్టాలు, సుఖాలూ రెండూ స్వామి అనుగ్రహమేనని భావించి, కష్టం వచ్చినప్పుడు క్రుంగిపోక, సుఖం లభించినప్పుడు పొంగిపోక, ఆయా సన్నివేశాల చాటున సందేశాన్ని గుర్తించి, మానవుడు తన విధ్యుక్తధర్మాన్ని నిర్వర్తించాలని మేము తెలుసుకోగలిగాం" అన్నాడు ధర్మరాజు.

ఈ సన్నివేశం మనకు కనువిప్పు కలిగిస్తోంది. "నా దయ ఒడిదుడుకులే" అని చెప్పిన అమ్మమాట అసంబద్ధం కాదని, అది ఒక జీవన సూత్రం అని మనం గుర్తించవచ్చు.

– మల్లాప్రగడ



**యః పూర్వం తపసో జాతం అద్భ్యః పూర్వం అజాయత ।**

**గుహాం ప్రవిశ్య తిష్ఠంతం యో భూతేభి ర్వ్యపశ్యత ॥** ఏ తద్వైతత్॥

'ఎవడు మొదట్లో -సృష్టి ప్రారంభంలో తపస్సు మూలంగా జనించాడో, ఎవడు నీరుకు - పంచభూతాలకు పూర్వం జనించాడో, ఎవడు హృదయంలో ప్రవేశించి వసిస్తాడో, ఎవడు పంచభూతాలలో కనపడతాడో, **ఇది అదే.**'

- కఠోపనిషత్తు

# సర్వానుల్లంఘ్య శాసనా

[అంత జీవిత మహోదధిలో ఓ తరంగము]

బాపట్లలో వివాహం కాగానే రేటూరు వెళ్లి మూడునిద్రలు పూర్తి చేసికుని అమ్మ, నాన్నగారు, బామ్మగారు బాపట్ల చేరతారు. నాన్నగారికి జ్వరం వస్తుంది. బాపట్లలో మూడు నిద్రలకు ఏర్పాటు జరగదు. డాక్టరు శ్రీరామమూర్తిగారు రోజూ వచ్చి నాన్నగారిని చూసి మందులు యిచ్చిపోతుంటారు.

ఇట్లా జ్వరం మామూలుగా వస్తూనే వుంటుంది. ఒక వారం గడుస్తుంది. ఎవరికి తోచినట్లు వారు అంటూ వుంటారు - లగ్నబలమని, గొడ్డొచ్చినవేళ బిడ్డ వచ్చిన వేళ అని - ఎవరిరికి తోచినట్లు వారు ఏదో ఒకటి అనిపోతూ వుంటారు. అది అట్లా వుండగా, నాన్నగారి మేనత్తకు రేటూరులో జ్వరం తగులుతుంది. జ్వరమొచ్చిన ఆరో రోజున ఆమెను బాపట్ల తీసికొస్తారు. తీసికొచ్చిన మూడో రోజుకు సంధి వచ్చి ఆమె మరణిస్తుంది.

అందరూ లగ్న బలమనే అనుకుంటారు.

యిది జరిగిన తరువాత అమ్మను ఎక్కడ చూసిన వారక్కడ మాటలంటుంటారు.

రెండో వారం వస్తుంది. నాన్నగారికి జ్వరం తగ్గదు. ఏ వ్యక్తికా వ్యక్తి ఆందోళనతో కుమిలిపోతుంటాడు.

అంతలో పదహారోజుల పండగొస్తుంది.

ఆ రోజున కూడా అమ్మను పలకరించే వారు ఉండరు. బామ్మ అమ్మ దగ్గిరకు వచ్చి, ఈ జబ్బు నీకొచ్చి నీవు పోయినా బాగుండేది. వాడు కళకళలాడుతూ మళ్ళీ పెళ్లి చేసుకునేవాడు, లేకపోతే మొద్దల్లే నిన్ను చూస్తూ కూర్చోవాలనగానే - అమ్మ వెంటనే బామ్మ రెండు పాదాలూ పట్టుకుని ఆ పనే జరిగితే నీవు నన్ను అట్లా చూడాల్సిన అవసరముండదు అత్తయ్యా, నీ నోటివెంట ఆ మాట రాకూడదు, మా యిద్దరినీ తల్లివై చూడాలి. తల్లి దీవెన ముఖ్యమంటారు గదా - అంటూ రెండు పాదాల మీద తల పెట్టి అట్లా అనకు అత్తయ్యా అని మూడుసార్లు అంటుంది.

ఆ ధ్వని విని పక్కింటి తాసిల్దారుగారి భార్య శారదాంబగారు, తాతగారు, హనుమాయమ్మగారు - ఏమిటో ఈ ధ్వని అన్నట్లుగా వస్తారు. ఎక్కడ ఏకాస్త పెద్దగా మాట్లాడటం విన్నా ఎవరికి వారు ఏమిటోనని భయంతో ఏ కబురు వింటామోననే ఆదుర్దాతో ఉంటారు.

శారదాంబగారు: ఎవరిప్పుడు కేకేసింది?

బామ్మగారు : ఎవరూ లేరండి.

శారదాంబగారు: పాపం అట్లా కాళ్ల మీద పడి ఏడుస్తుందెందుకు? తల్లి లేని పిల్ల. ఈ రోజు పదహారోజుల పండుగ కదూ, ఆ అమ్మాయికి మాత్రము దిగులుండదూ? అందరూ తలోమాట అంటే ఏం చేస్తుంది. తల్లి లేనట్లుగానే అన్నీ ఈ అమ్మాయికే ఇలా జరుగుతున్నాయి. పెళ్లి - ఆగాలు, జాతర్లతో అయింది. కొంచెం బిడ్డకు తలంటు పోసి గోధుమరవ్వతోనన్నా పరమాన్నం కాచి ఒ చెంచా పెళ్ళికొడుకు నోట్లో వెయ్యకూడదూ?

## "నాకు చెడ్డ వాళ్ళను చూస్తే జాలేస్తుంది
## మంచి వాళ్ళను చూస్తే ఏడుపొస్తుంది" - అమ్మ

మనలో ఎవరికైనా మంచి వాళ్ళను చూస్తే గౌరవం కలుగుతుంది, చెడ్డవాళ్ళను చూస్తే ఒళ్ళు మండుతుంది. ఇందులో మళ్ళీ ఏది మంచి, ఏది చెడు అనే నిర్ణయం కూడా మనిషి మనిషికీ మారిపోతూ ఉంటుంది. ఒకే మనిషి ఒక వ్యక్తిని ఈవేళ మంచివాడని భావిస్తాడు. వాడికన్న చెడ్డ వాడు లేడని రేపు ప్రచారం చేస్తాడు. ఇదంతా మన సంగతి.

మరి, మహాత్ముల ఆలోచనా దృక్పథం విచిత్రంగా, విలక్షంగా, విశిష్టంగా ఉంటుంది.

శ్రీకృష్ణుడంతటి వాడు స్వయంగా వచ్చి, రాయబారం నడిపి, పాండవులకు అర్ధ రాజ్యం కాకపోయినా, ఐదుగురికీ ఐదు ఊళ్ళిస్తే చాలని వివరించాడు. సూది మొన మోపినంత నేల కూడా ఇచ్చే ప్రసక్తి లేదని దుర్యోధనుడు ఖండితంగా చెప్పాడు. ధృతరాష్ట్రుడు కొడుకుని అదుపు చేయలేక పోయాడు. రాయబారం విఫలమైంది.

ఇక, రేపోమాపో యుద్ధం ప్రారంభమవుతుందనగా, వ్యాసమహర్షి ధృతరాష్ట్రుణ్ణి సమీపించాడు. "ఇప్పటికీ జనక్షయం కాకుండా ఆపగలిగే అవకాశం నీకున్నది. రక్తపాతం జరగకుండా చూడు. నీ కొడుకులను శాసించు. ధర్మం పాటించు. యుద్ధం నివారించు. పాండవుల రాజ్యం వారికి ఇచ్చేసెయ్. కౌరవ పాండవులు కలిసి మెలసి రాజ్యమేలుతుంటే నూట అయిదుగురికి పెద్దగా నిలిచి, గౌరవం పొందు. ప్రశాంతంగా హాయిగా జీవించు" అని హితవు చెప్పాడు.

అన్నీ విని, ధృతరాష్ట్రుడన్నాడు "తండ్రీ! మీరు చెప్పింది హితము. ధర్మము. ఈ సంగతి నాకూ తెలుసు. నేను ఇంతకు ముందుగానే నా బిడ్డలకు చెప్పి చూశాను. వాళ్ళు నా మాట విన్పించుకోరు. నేను వృద్ధుణ్ణి, అంధుణ్ణి. వాళ్ళని అదుపు చేయగల అవకాశం నాకు లేదు. నాలో ఏ తప్పూ లేదని మీరు గుర్తించండి.

'పాండవులతో మైత్రి' అనే ప్రసక్తి ఇంక తీసుకు రావద్దు. పనులు పాకం తప్పాయి. నేను చేయగలిగింది ఏమీ లేదు. "

ఈ సన్నివేశంలో ధృతరాష్ట్రుడు దుర్మార్గమంతా కొడుకుల మీదకు నెట్టివేసి, తనలో ఏ తప్పూ లేదని, సామాన్య ప్రజలతో పాటు మహాత్ములైన పెద్దలు కూడ భావించాలని పన్నిన పన్నాగం స్పష్టంగా తెలుస్తోంది.

అయినా, వ్యాసమహర్షి ఆగ్రహించ లేదు. ధృతరాష్ట్రుడికి కర్తవ్యాన్ని గుర్తు చేశాడు. పాటించడానికి అతడు సిద్ధంగా లేడు. ఇక, తన కర్తవ్యం ఏమిటి? ధృతరాష్ట్రుడికి ఏమి కావాలో, అది సమకూర్చడం - అనుకున్నాడు వ్యాసుడు. "సరే, నాయనా! నీకో వరం ఇస్తాను. ఏమి కావాలో కోరుకో" అన్నాడు. ధృతరాష్ట్రుడి కోరిక ప్రకారం యుద్ధ విశేషాలు వినే అవకాశాన్ని వరంగా ఇచ్చాడు. సమరగాథను వినిపించే సాధనంగా సంజయుణ్ణి తీర్చి దిద్ది, అంతర్థానమైపోయాడు. వ్యాసుడు.

వ్యాస మహర్షి ధృతరాష్ట్రుడి పై కోపగించలేదు. అతణ్ణి అసహ్యించుకోలేదు. అతని పట్ల జాలి చూపించాడు. అందుకే, 'వరమిస్తాను కోరుకో' మన్నాడు. మంచి వాళ్ళయిన పాండవుల దైన్యాన్ని తలచుకొని దుఃఖిస్తూ, పొత్తు పొసగడానికి అవకాశం ఉంటుందేమో అని తన వంతు ప్రయత్నం చేశాడు.

ఈ సన్నివేశంలో వ్యాసమహర్షి ప్రవర్తించిన తీరు అమ్మ వాక్యానికి వ్యాఖ్యానంగా కనిపిస్తోంది.

"చెడ్డవాళ్ళని నేనైనా చేరదీయకపోతే ఎలా?", "మీ బురద కడగడం కుదరకపోయినా, బురదతోనే మిమ్మల్ని ఒడిలోకి తీసుకుంటాను" అన్న అమ్మ మాటలు ఈ సందర్భంగా మనం గుర్తు చేసుకోదగినవి.

ప్రేమించటం, క్షమించటం తప్ప ఇంకేమీ తెలియని అమ్మ ఈ యుగంలో అవతరించిన మహనీయమూర్తి.

- మల్లాప్రగడ

బామ్మగారు : నా కీళ్లు విరిగిపోయి కూర్చున్నాను. నేనేం చేస్తాను.
శారదాంబగారు: అని ఏమి మానుకున్నారు. అన్నం తినటం లేదా? నిద్రపోవటం లేదా?

బామ్మ వెళ్ళిపోతుంది.

అమ్మ : అవి తప్పవు కదా. ఒక రోజు కారణాలతో కట్టుబడ్డా, మరో రోజు మేమున్నామంటూ పరిగెత్తుకొస్తాయి. మనతో కూడానే వచ్చినాయి కదా, మనను విడిచి ఎక్కడుంటాయి? మనల్ని అవి వదిలిన నాడు మనం మానవులం కాదు మాధవులమే.

శారదాంబగారు : గబగబా అమ్మను దగ్గిరకు తీసికుని తల పొట్టలో ఆనించుకుని యింత మంచి బిడ్డకు ఎందుకంత కష్టం -

తలను పొట్టకేసి గట్టిగా అదముకుంటూ కళ్ళనీళ్లు పెట్టుకుంటుంది. రెక్క పట్టుకుని నేనైనా మా యింట్లో తలంటి పోస్తా రామ్మా అని లోపలకు తీసికెళ్తారు. వంట మనిషి హనుమాయమ్మ గారితో "చూడు యింత చిన్నబిడ్డకు ఎన్ని ఇబ్బందులో" అని అమ్మను చూసి చెపుతారు. "మనమీంట్లో ప్రవేశించి మూడు సంవత్సరాలు, ఈ మూడు సంవత్సరాలనుండి ఈ అమ్మాయి పెళ్ళి గొడవే, ఎప్పుడు విన్నా ఈ అమ్మాయి పెళ్ళి గురించే, విని విని రామాయణ, భాగవతాలు చాలటంలా ఈ పెళ్ళి చరిత్ర ముందర! ఎవరూ తక్కువ వారు కాదు.

హనుమాయమ్మ గారు : అదే వచ్చిన తిప్పలు.

శారదాంబగారు: ఒక తల్లే లేదుగాని, అందరూ వున్నారు కదా?

హనుమాయమ్మగారు : బాగా వుంది. నిట్టాడే పుచ్చిపోతే ఇల్లే మునుంటుంది. ఇంకోటి పోటీ పెట్టినా మొదటి ఇల్లల్లే వుండదు గదా?

ఇదేమి ఉపమానం? ఎందుకు ఇంటితో పోల్చారు. తప్పకుండా తగ్గుతుంది - జ్వరం - అని తలవంచి అమ్మ భూమిని చూస్తూ అంటుంది.

శారదాంబగారు : జ్వరం మాట కాదమ్మా, మా సంభాషణంతా వినలేదా నువ్వు. మేమనుకున్నది అతని జ్వరం మాట కాదు. మీ అమ్మ గురించి చెప్పుకున్నాం. ఎంతమంది వున్నా ఆమె లేకపోవటాన యిలా జరిగిందనుకున్నాం. నీ ధ్యాస అటే వుండటాన అలా వినపడ్డది. ఎందుకు తగ్గదు? అతనికి తగ్గిపోతుంది. వీళ్ల ఆదుర్దాగాని, యింత తేజస్సు నీలో వుంటే, నీ తేజస్సు నీకు తెలియదుగా?

అమ్మ : నాలో అధైర్యం కనబడుతున్నదా?

అధైర్యమూ లేదు, ధైర్యమూ లేదమ్మా. కాని నీ కళ్లల్లో దాన్ని ఏమనాలో తెలియదు. ఎట్లా వర్ణించాలో తెలియదు. అటువంటి నీ చూపును ఏమంటారో కవులు. అని శారదాంబగారు అంటుండగా ఆమె మూడో కోడలు రాజ్యలక్ష్మమ్మ (ఆ అమ్మాయి పుట్టిల్లు తంజావూరు) లోపలకు వస్తూనే నవరసాలు ఆ చూపులో వున్నాయంటుంది.

శారదాంబగారు : నీవు చదువు కున్న పిల్లవు, కనుక వర్ణిస్తావు. నా మొఖం నాకేమి తెలుసు అమ్మణ్ణి చూట్టం తప్ప.

రాజ్యలక్ష్మి : ఈ చూపు చదువుతో అర్థమయ్యేది కాదు. ఆ అమ్మాయి పేరు అమ్మణ్ణా?

శారదాంబగారు : అమ్మాయి పేరు అనసూయ, నాకే తోణికొచ్చింది అమ్మణ్ణీ అని.

రాజ్యలక్ష్మి : అలవాటు కదూ నీకు అమ్మణ్ణి అని పిలుచుకోవటం, మీరు ఉపాసించే దేవత పేరేమిటి?

శారదాంబగారు : పేరు ఏదన్నా కాని నేను అమ్మణ్ణి అంటాను. మన పిల్లలందరిని నిద్ర లేపు అమ్మాయికి తలంటుపోద్దాం.

అందరినీ నిద్రలేపుకొస్తారు. వారింట్లోనే ఇరవయిమంది ముత్తయిదువులు వుంటారు. కోడళ్ళు, కూతుళ్లు, మేనకోడళ్లు, మనవరాలు అంతా - శీకాయ, నూనె అన్నీ తలంటుకు సిద్ధం చేస్తారు.

అమ్మ ఇప్పుడే వస్తానని చెప్పి నూనె గ్లాసులో వేలుముంచి నాన్నగారింటికి వెళుతుంది.

బామ్మగారు ఇంట్లో గదిలో పనిచేసుకుంటూ వుంటారు.

అమ్మ ఇటు వస్తుంది. తాతమ్మగారు అటు వెళుతుంది.

తాతమ్మగారిని అమ్మ చూచి కూడా చూడనట్లు, కనపడితే రానీయరేమోనని ప్రక్కగా వచ్చేస్తుంది.

నాన్నగారికి రోజూ కంటే జ్వరం తగ్గి వుంటుంది. పడుకుని వుంటారు. గ్లాసులో ముంచి తీసుకొచ్చిన వేలుకున్న నూనె మాడుకు పెట్టి ఆ చెయ్యే అరికాలుకు రాస్తుంది. రాచి, అమ్మ మాడుకు అరికాళ్లకు అద్దుకుంటుంది.

నాన్నగారు నీరసంగా ఎక్కడో ఏమిటి రాస్తున్నావు అంటారు. ఎంత జబ్బు చేసినా ధ్వని చక్కగా వినబడుతుంది.

అమ్మ : ఈ రోజు పదహార్రోజుల పండుగ.

బామ్మగారు దొడ్లో నుంచి వస్తుంది. (నాన్నగారితో) యేం నాయనా ఈ పూట ఎట్లా వుందంటూ ఇంట్లోకొచ్చి కాళ్లకట్ట వద్దనున్న అమ్మను చూడకుండా నాన్నగారితో మాట్లాడి వెళుతుంది.

నాన్నగారు : అమ్మా, ఎందుకో అనసూయ వచ్చి నుంచుంది. ఎందకో అడుగమ్మా.

ఏది అంటూ బామ్మ మళ్ళీ లోపలకు వస్తుంది.

యిల్లు చీకటిగా వుంటుంది. మూల నుంచున్న అమ్మ కనపడదు. ఎక్కడ, ఏది అంటుంది.

అమ్మ : ఏమిటత్తయ్యా అంటూ కొంచెం ముందుకు జరుగుతుంది.

బామ్మగారు : యేంలేదు. ఎందుకు దరిద్రపు ముఖం వేసికొని వాడి కాళ్ల దగ్గర నుంచున్నావు. అమ్మతల్లి మెళ్లో తాళి కట్టాడు. మంచమెక్కాడు. ఈ మహాతల్లి పెళ్ళి పెట్టుకున్నది మొదలు - ఆగాలు, జాతర్లు. కాస్త ఈ రోజే తగ్గిందనుకుంటున్నా - మళ్లీ తయారయినావు.

అమ్మ మాట్లాడకుండా నుంచునుంటుంది.

నాన్నగారు : ఎందు˘నవసరంగా విసుక్కుంటావు? ఎన్ని రోజుల నుండో పేరుకుని, పేరుకుని వచ్చిన జ్వరమిది, ఆ అమ్మా యేం జేసింది?

బామ్మ గారు : యేం జేయాలి నాయనా? నా ప్రాణాలన్నీ నీ మీద పెట్టుకుని వున్నాను, నిలువునా కొంప ముంచింది.

నాన్నగారు : ఆ మునిగే దానిలో అది మాత్రము లేదు.

బామ్మగారు : దానికేం?

నాన్నగారు : ఏమిటా ఆ పిచ్చిమాటలు?

బామ్మగారు : అంతేలే నాకెందుకు? యింతకూ ఏందుకొచ్చిందట?

నాన్నగారు : పోయి చెప్పు అంటారు.

అమ్మ : కొంచెం తలకు నూనె పెట్టత్తయ్యా, నీచేత పెట్టించుకుందామనొచ్చాను.

బామ్మగారు : వాడు అట్లా వుంటే నీకు తలంటేమిటి? యిది కూడా అవాచకమే. పెనిమిటి జబ్బుగా వుంటే తలంటు పోసుకుంటారా?

అమ్మ : శారదమ్మగారు పోస్తామన్నారు. పోసుకోగూడదని నాకు తెలియదు. అత్తయ్య అయినా, అమ్మ అయినా ఒకటే గదాని.

తలవంచుకుని అర్ధగంటసేపు అట్లాగే నిలిచిపోతుంది.

బామ్మ దొడ్లోకి వెళ్ళి పనుల్జేసుకుని వచ్చినా అమ్మ అలాగే నుంచునుంటుంది. అమ్మను - "యేమింకా కదలవేం? చెప్పేది నీకే, పాపం సమాధిస్థితిలో వున్నట్టుందే" అని అంటుంది.

అమ్మ : తలెత్తి చమురు పెట్టవా అత్తయ్యా?

బామ్మగారు : చమురు గ్లాసు తీసుకుని విధవ ముండను నేను పెట్టడమేమిటి అంటూ వేలు ముంచి మాడున పెడుతుంది.

నాన్నగారు : ఆ మాటంటూ పెట్టటమెందుకమ్మా?

బామ్మగారు : ఓహో? నీకు ఇప్పటి నుండే రోషము వస్తున్నట్టుందే నాయనా?

నాన్నగారు : సరే, నీ ఇష్టమొచ్చినట్లు అనుకో, ప్రతిదీ తప్పేటమ్మా.

అమ్మ బామ్మకు నమస్కారం చేస్తుంది.

బామ్మగారు : నాకెందుకు తల్లీ?

అమ్మ : నీకు నమస్కారము చెయకపోతే నేను మరొకరికి నమస్కారం చేయవలసినవసరం లేదు.

అని మెల్లగా అనుకుంటూ వాకిట్లోకి వెళతూ వుండగా అనసూయా అని నాన్నగారు కేకేవేస్తారు.

అమ్మ వెనక్కొచ్చి పిల్చారా? అంటుంది.

నాన్నగారు : నేను పిలవలేదే అంటారు.

వెనక్కుతిరిగి వెళుతుంది. మళ్ళీ చిన్నగా పిలుస్తారు.

అమ్మ కొంచెంసేపు నిలబడి ఆలకిస్తుంది. పిలిచినట్టుగానే వినబడుతుంది. మళ్ళీ లోపలకొచ్చి అడుగుతుంది.

నాన్నగారు : నేను పిలవలేదు, మనసులో అనుకున్నా వినబడుతుందా ఏమిటి?

అమ్మ : వినిపించింది.

నాన్నగారు : నేను పిలవందే నీకు వినిపించిందంటావేమిటి?

అమ్మ : **నాకు వినిపించాలని మీరు సంకల్పించారేమో.**

నాన్నగారు : **నాకు సంకల్పం రాగానే నీకు వినబడుతుందేమిటి?**

అమ్మ : **మీ సంకల్పమే నా నడకకు ఆధారము.** మీరు ఎలా నడిపిస్తే నేను అలా నడుస్తాను, మీరు పిలవకపోయినా వినిపించాలని తప్పక అనుకుంటాను.

యింతసేపు రాలేదని శారదాంబగారు జవాన్ని పంపిస్తుంది.

అమ్మ : (నాన్నగారితో) శారదాంబగారు మనిషిని పంపించింది, వెళ్లి తలంటు పోసుకోమంటారా?

నాన్నగారు : పోసుకో.

అమ్మ : తలంటుపోసుకుని మీకు పూజ చేసుకోవాలని వుంది, చేసుకోమంటారా?

నాన్నగారు : నాకు పూజేమిటి? నేనేం దేవుడ్నా?

అమ్మ : ఎవరికి మీరనేది, ఎవరి సంగతి?

నాన్నగారు : నా సంగతి, నీ సంగతి.

అమ్మ : అయినప్పుడు యింకా సందేహమేముంది?

నాన్నగారు : ఏదన్నా పటం పెట్టి పూజచేసుకో.

అమ్మ : ఏదయినా పటం దేవుడు కాదుగా? మిమ్మల్ని సర్వత్రా చూడొచ్చుగా? కాని, నాకు ఆ స్థితి మీరివ్వవలసినదేగా? నా చేత యిన్ని మాట్లాడించేది కూడా మీరే.

నాన్నగారు : అంత మొద్దల్లే వుండేదానివి ఇన్ని మాటలెక్కడి నుండొచ్చాయి?

అమ్మ : మీ దయ - మాటలు, ధైర్యం, భావం, అంతా మీ ఇష్టప్రకారం జరుగుతాయి.

జవాను వచ్చి నాన్నగారి మంచమెదురు నుంచుని అయ్యా! పడుకున్నారేమని నమస్కారం చేస్తాడు.

నాన్నగారు : కొద్దిగా సుస్తిగా ఉన్నది.

జవాను : మా అమ్మగారు అమ్మాయిగారిని పిలుచుకు రమ్మన్నారయ్యా.

నాన్నగారు : వస్తుంది పద.

అతను వెళ్ళిపోతాడు.

బామ్మ : ఇంకా ఇక్కడే ఉన్నావు. వెళ్ళాలా? నీకు తలంటు పోసేదాకా మనుష్యుల్ని పెట్టి పిలిపించాల్నా? ఏం, ఇప్పుడే వదల్లేకుండా ఉన్నావు. నీకయినా తెలియదట్రా, వెళ్ళమని చెప్పకూడదూ.

అమ్మ : **ఎప్పుడూ వదిలి పెట్టను. ఇది వరకు వదలి పెట్టలేదు. మిమ్మల్ని వదిలి నేను వుండను. నన్ను వదిలి మీరు లేరు.**

బామ్మ : చాలా గట్టిగా మాట్లాడుతున్నదే, ఇది వరకు లేదు.

అమ్మ : యిది వరకు లేనిదొచ్చింది కాదు, ఇక ముందు రాబోయేది కాదని అమ్మ తలొంచుకుని చిన్నగా అనుకుంటుంది.

నాన్నగారు : ఏమిటి నసగా మాట్లాడుతున్నావు. ఏమిటో సాధిస్తున్నావే?

అమ్మ : నాక్కావలసింది మీరే. **నేను సాధించేది మిమ్మల్నే. మిమ్మల్ని సాధించాలంటే ఎంతో శోధించాలి. మిమ్మల్ని శోధించితే సర్వం సాధించినట్లే.** ఆనాటికి సర్వం సామాన్యమవుతాయి.

నాన్నగారు : సరే పోయి తలంటు పోసుకో. ఆ మనిషి నుంచున్నాడు.

చిదంబరరావుగారు నాన్నగార్ని చూద్దామని బయలుదేరతారు. దారిలో అమ్మ కనబడుతుంది.

చిదంబరరావుగారు : ఎక్కడికమ్మా పిచ్చితల్లీ వెళ్తొస్తున్నావు? అంటూ అమ్మ వంక చూస్తారు.

అమ్మ : మీరెక్కడికి వెళుతున్నారు?

చిదంబర్రావుగారు : వాడికి జ్వరం యెట్లా వుందో చూద్దామని వెళుతున్నా.

అమ్మ : జ్వరం లేదనుకుంటాను. చాలా బలహీనంగా వున్నారు.

ఆ మాటలు అమ్మ నోటెంట వచ్చేటప్పుడు తాతగారు అమ్మ ముఖం వంక యేదో సర్వం మునిగిపోయినట్లు ఆవేదనతో చూస్తారు. కొంతసేపు యేమీ మాట్లాడరు.

చిదంబరరావుగారు : ఏమిటా రేగిపోయిన జుట్టు, చింపురు చింపుర్లుగా. నూనె కళ్ళలోకి కారిపోతున్నది, నీ అంత బొట్టు, పెద్ద ముత్తయిదువలె, వోణి పమిట తిప్పి దోపి, నూనె గ్లాసు చేతిలో పట్టుకుని, గుప్పిడి పట్టి సమస్త ప్రపంచాన్నంతా గుప్పిట్లో పెట్టినట్లుగా, గంభీరంగా నులుచున్నావే, కాని కళ్లల్లో యేదో బాధ వ్యక్తమవుతున్నదమ్మా. నేనెరుగను గాని చిన్నప్పుడు మా అమ్మమ్మ - అమ్మాయమ్మగారు యిట్లాగే వుండేదట.

అమ్మ : బాధేమి లేదులే.

తాతగారు : నిన్ను జూస్తే మాకు బాధగా ఉంది. మా బాధను బట్టి నీవు బాధపడుతున్నట్లుగా కనపడతావు. అంతే గాని నీకేం బాధ?

అమ్మ : నీకేం బాధంటే అర్థమేమిటి తాతగారూ?

తాతగారు : నీకు బాధ వుండొచ్చు గాని నీవు బాధ పడవు.

అమ్మ : అంటే నాకు అర్థం కాలా?

తాతగారు : నీకు తేలు కుట్టొచ్చు, నీవు బాధపడవు.

అమ్మ : అంటే ఏడవననా?

తాతగారు : కాదమ్మా - నీ మనస్సుకే బాధ ఉండదు.

అమ్మ : అని మీకేమిటి గుర్తు?

తాతగారు : నాకట్లా అనిపిస్తుందమ్మా. యిక్కడెందుకులే విచారణ. నువ్వెళ్లు, నేనెళ్ళి తిరిగి వస్తా అని నాన్నగారింటికి వెళతారు.

అమ్మ శారదాంబగారింటికి వస్తుంది.

శారదాంబగారు : యిదిగో వస్తానని చెప్పి యింతసేపు యెక్కడికెళ్ళావమ్మా?

అమ్మ మాట్లాడకుండా తలొంచి చూపిస్తుంది.

శారదాంబగారు : యెవరిచేత పెట్టించుకొచ్చావు?

అమ్మ : మా అత్తయ్య పెట్టింది.

శారదాంబగారు : యెవరో పిల్చినట్లుగా పరిగెత్తావు. వారు పిలిపించారా, నీ వెళ్ళావా?

అమ్మ : మీరన్న మాటలోనే వుంది గదా అర్థం, పిలిపించకుండా పిలిచినట్లుగా వుండి వెళ్ళాను.

శారదాంబగారు : యెవరు పిలిపించారు, అబ్బాయిగారు జబ్బులో వున్నారు గదా?

అమ్మ : **యిక్కడ నుంచుని మాట్లాడేదె అక్కడ పిల్చింది, పిల్చిందే వెళ్ళింది.**

శారదాంబగారు : అంటే యేమిటమ్మా?

అమ్మ : **పిల్చినట్లుగా తోచింది నాకు, పిల్చినట్లుగా విన్నది నేను. వెళదామనిపించింది నాలో - అన్నీ నాకే కలిగాయి. ఒకవేళ వారు పిలిచినా నేను వినక పోతే నాకేమి లేదుగా. విన్నది, భావించుకున్నది, ఆ భావనలో ఒ నిర్ణయానికొచ్చింది నేనే.**

శారదాంబగారు : నీ మాటలర్థం చేసికునే శక్తి ఉండొద్దమ్మా?

అమ్మ : నా మాటల్లో అర్థం వద్దులే, నా భావం తెలిస్తే చాల్లే.

శారదాంబగారు : నీ భావం యెట్లా తెలిసేట్టమ్మా, మాటల్లేకుండా?

అమ్మ : క్రియల్లో తెలుస్తుంది.

శారదాంబగారు : క్రియలు - కూడా వుండి చూడొద్దమ్మా.

అమ్మ : చూసినంత వరకు అర్థం చేసికుంటే చాలు.

శారదాంబగారు : యేదయినా అమ్మణ్ణి దయే, నీకు చమురెవరు పెట్టారమ్మా?

అమ్మ : మా అత్తయ్య పెట్టింది.

శారదాంబగారు : మంచి పని చేశావమ్మా.

అమ్మ : నేను చేసేదేముంది?

మాటలకేంలే, కూర్చో అమ్మా, అని కుర్చీ మీద కూర్చోపెట్టి అందరూ హారతిస్తారు. శారదాంబ పాట పాడుతుంది. "పార్వతి బ్రోచుగాక యీ దంపతులను" అని పాడుతుంది. యెవరికి తోచిన పాటలు వాళ్ళు పాడతారు. చివరకు చమురు పాదాలకు రాస్తుంది శారదాంబగారు.

సుభద్ర : (శారదాంబగారి కూతురు) అదేంటమ్మా, తలంటుకుంటే పాదాలకు రాస్తావు?

శారదాంబగారు : ముందు అమ్మణ్ణి పాదాలే మనకు ముఖ్యం.

సుభద్ర : ఆ అమ్మాయి అమ్మణ్ణి ఎట్లా అవుతుంది?

శారదాంబగారు : యే భావంతో చూస్తే అదవుతుంది.

సుభద్ర : యీ అమ్మాయేనా ఎవరయినా అట్లాగే కనబడతారా.

నలుగు పెట్టండి, నేను పాడతాను అని నలుగుపెడుతూ హనుమాయమ్మగారు పాట పాడతారు.

శారదాంబగారు : మీరెందుకు లెండి, నలుగు నే పెడతాలె.

హనుమాయమ్మగారు : యేంమ్మా, నాకు అర్హత లేదా?

అమ్మ : అందరికీ వుందమ్మా, అర్హత ఒకరిచ్చేదా?

అంతేగా అమ్మా అని నలుగు పాట పాడుతూ హనుమాయమ్మ గారు ఆనందిస్తుంటుంది. యింత మెత్తని శరీరముమెట్లా నలిచేటట్టు. గులాబి పువ్వు కన్నా సున్నితంగా ఉంది. మన కర్కశమైన చేతులతో నలుస్తుంటే శరీరం కందిపోతున్నదమ్మా, చేతిలోకి వూడి వస్తుందేమో ననిపిస్తుంది.

అమ్మ : నేను లోగడ యెప్పుడూ నలుగు బెట్టి నీళ్లు పోసుకోలేదు. యిదే మొదలు, ఈ నలిగిడి ఆ నలిగిడిని వోర్చుకునే గట్టితనాన్నన్నా శరీరానికిస్తుందేమో? మీరే నలపండి.

శారదాంబగారు, అందరూ తలోప్రక్క నలుస్తూ యిదంతా దేవతా శరీరమల్లే ఉందను కుంటారు.

అమ్మా : మీరు దేవతల శరీరం పట్టుకు చూచారా?

శారదాంబగారు : పుస్తకాల్లో వర్ణించి ఉందిగా అమ్మా, ఆ వర్ణనకు తగ్గట్లుగా వుందీ శరీరం.

అమ్మ : శరీరమేనా, మనస్సు కూడా అట్లాగే వుందా?

శారదాంబగారు : నేను యీ దేవతను తప్ప యే దేవతలను చూడలేదమ్మా, మనస్సునెట్లా కనుక్కుంటామమ్మా?

అమ్మ : మనుస్సుతోనే!

శారదాంబగారికి తలంటు పోయడం త్వరగా అయిపోతున్నదేననిపిస్తుంది. యీ శరీరం స్పృశించేందకు వుండదేమోననుకుంటూ నిదానంగా పోద్దాం తొందరేముంది? అంటారు.

హనుమాయమ్మగారు : తలంటు పోసయినా ఒళ్లో కూర్చోబెట్టుకోవచ్చుగా, కాదంటుందా?

శారదాంబగారు : రేపటి నుండి దేవతార్చన మానుకుని, యీ బిడ్డకు చేసికుంటే చాలు. ఆ విగ్రహాలను తోముతుంటే గుచ్చుకుంటుంటాయి. ఈయమ్మ చేతులకూ మనస్సుకూ కూడా మెత్తగా అనిపిస్తుంది. యీ మెత్తదనాన్ని అందరూ అర్థం చేసుకుంటారో, లేరో?

అమ్మ తలంటు అయిపోతుంది. పట్టాభిరామయ్యగారు వచ్చి శారదాంబగారితో మాట్లాడతారు.

పట్టాభిరామయ్య : నేను క్యాంపుకెళ్ళాలి, త్వరగా - ఓహో, యీ అమ్మాయి మన యింటి కొచ్చిందే?

శారదాంబగారు : యీ రోజు పదహారోజుల పండుగ. ఆ అబ్బాయికి జ్వరంగా వుంటేను తీసికొచ్చి పోస్తున్నాం.

పట్టాభిరామయ్య : నేను, యెందుకు పోస్తున్నావని అడుగ లేదుగా? మన సుందరేశాన్ని చేసికోమంటే వల్లగాదన్నది. యీ రూపంగానయినా మనయింట్లో తలంటు పోసికుని కల్యాణం బొట్టు పెట్టించుకుంది, అంతేచాలు

నని లోపలకెళ్ళి నూటపదహారు రూపాయలు తీసికొచ్చి శారదాంబగారి చేతికిస్తారు, ఆ అమ్మాయి కివ్వు - యేమయినా చేయించుకుంటుంది.

శారదాంబగారు : మాకు కోడలవు కాకపోతే మానె, అమ్మా, ఎక్కడున్నా నీవు సుఖంగా ఉండమని చేతిలో పెడుతుంది.

శారదాంబగారు కల్యాణం బొట్టు పెట్టి, పాదాలకు పారాయణబెట్టి, బుగ్గన చుక్క పెట్టి, క్రొత్త పరికిణి, చొక్కా యిస్తుంది. సుభద్రా అని కూతుర్ని పిలిచి నీ కొత్త వోణి తెచ్చి నీ చేతులమీదుగా యివ్వమ్మా, నీకు కూడ త్వరగా పెళ్లవుతుంది.

సుభద్ర : వెళ్లి వోణి తీసికొచ్చి అమ్మ కిచ్చి నమస్కారం చేస్తుంది.

అమ్మ ఆ వోణీ వేసికోగానే శారదాంబగారు వెక్కి వెక్కి ఏడుస్తుంది. సుభద్ర నమస్కారం చూసి అందరూ ముక్కు మీద వేలేసుకుని కొందరు ఆనంద బాష్పాలు కారుస్తారు. మరి కొందరు ఆశ్చర్యపడతారు. కోవెలకెళ్ళి దణ్ణం పెట్టమన్నా పెట్టని సుభద్రకు యేంజూసి దణ్ణం పెట్టాలనే బుద్ధి పుట్టిందోనని శారదాంబగారు తల్చుకుని తల్చుకుని ఆనందభాష్పాలు కారుస్తుంది.

లలిత, శారదాంబగారి చిన్నకూతరు, అయిదు సంవత్సరాల పిల్ల వచ్చి అమ్మ రెండు కాళ్లు వాటేసుకొని కామాక్షక్కయ్యా యెత్తుకోవూ అంటుంది.

హనుమాయమ్మ గారు : కామాక్షక్కయ్య యెవరమ్మా?

లలిత : కంచి నుండి మా కామాక్షక్కయ్య వచ్చింది.

హనుమాయమ్మగారు : ఒకే సమయంలో అమ్మ యింతమందికి యిన్ని రూపాల్లో దర్శనమిచ్చింది, యేమిటీ విశేషం. యీ దినం యెంత సుదినం. శారదాంబగారి అమ్మణ్ణి పూజ ఫలించింది. నేటికి నా జన్మ గూడా తరించింది. యీ రోజు యీ అమ్మాయి యిక్కడికి స్నానానికి రావటం, యీ రోజే యీ దర్శన భాగ్యం కలగటం, ఊరుకెళదామనుకున్న దాన్ని నేను ఆగిపోవటం, ఈ దర్శనాలకు, అమ్మాయికి యేదో సంబంధం వుండి వుండాలి, తప్పదు. నాకు నమస్కారం చేసికోవా లనిపిస్తుంది. అన్నిటిని మించి - యే మాహత్యాలు, గొప్పతనాలు చూపించక సామాన్యురాలిగా ఉంటున్న ఈ పిల్లకు నమస్కరించాలని పించటమే దైవత్వం. మూర్తిని చూడగా, చూడగా స్పష్టంగా మాతృత్వం కనపడుతుంది.

ఈ హనుమాయమ్మగారు వినుకొండ తాలూకా లో రెవిన్యూ యినస్పెక్టరు గారి భార్య. ముగ్గురు బిడ్డలు, భర్త. ఒకే రోజున స్ఫోటకం పోసి చచ్చిపోతారు. అప్పటికామెకు 18 సంవత్సరాలుంటాయి. చిన్నప్పటి నుండి చాలా భక్తి శ్రద్ధలున్నాయి. ఎక్కువగా సీతారామాంజనేయం, పంచదశి, యోగవాసిష్టం, ఉపనిషత్తులు చదువుకుంటుండేది. ఈమె చాల ఆస్తి గల వ్యక్తి. విరక్తితో కొంతమంది బీదలకు, కొన్ని దేవ స్థానాలకు ఆస్తి నిచ్చింది. అయినా, భోజనానికి కొరతేమీలేదు. ఆమెకు చిన్నతనంనుండి మాతృపూజ అలవాటు. మాతృపూజ అంటే ఆమెను కన్నతల్లినే ఆమె పూజిస్తుంది. ఎక్కువ సిరిసంపదలు గల కుంటుంబంలో వంట చెయ్యాలని

**యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి ।**
**తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహమ్ ॥**

భక్తుడు శ్రద్ధతో ఏయే రూపమును అర్చించుటకు ఇష్టపడుతున్నాడో, ఆ రూపములో అతని శ్రద్ధను అచలంగావుండేటట్లు అనుగ్రహిస్తాను.

**- భగవద్గీత**

**అగ్ని ర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ ।**
**ఏక స్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

**వాయు ర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ ।**
**ఏక స్తథా సర్వ భూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ ॥**

**ఏకో వశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి ।**
**త మాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం సుఖం శాశ్వతం నేత రేషామ్ ॥**

అగ్ని ప్రపంచమున ప్రవేశించి తాను దహించే వివిధ వస్తువుల ఆకారముల కనుగుణమైన రూపమును ధరిస్తున్నది. అదేవిధంగా ఆత్మకూడ తాను ప్రవేశించే భిన్నవస్తువుల కనుగుణంగా భిన్నాభిన్న ఆకారములతో భాసిస్తూ, వానికి అతిరిక్తముగానున్నది. వాయువూ ఇట్లే. సర్వమును తన వశమందుంచుకొని సకలప్రాణులకు అంతరాత్మయైన ఆత్మ ఏకైక రూపమును బహువిధముల భాసింపచేస్తున్నది. తమ ఆత్మలో నున్న ఈతత్త్వమును దర్శించే జ్ఞానులకు మాత్రమే శాశ్వత సుఖము. ఇతరులకు కాదు.

- కఠోపనిషత్తు

ఆమె కోర్కె. జీతం లేకుండా చెయ్యాలని ప్రారంభిస్తుంది. అన్నలు, తమ్ముళ్లు లేరు. తల్లి, తండ్రి లేరు. ఈ జీతం తీసుకొని నేను యెవరికి చెయ్యాలి? యెవరికోసం ఈ సంపాదన అనుకుంటుంది. అనుకుంటుంది గాని జీతానికే దిగుతుంది. ప్రధమంగా తాసీల్దారు గారింట్లోనే ప్రారంభం. ఆ రోజుకు, ఆమె అక్కడ వంటకు చేరి పదిహేను రోజులు. అమ్మ చేతిలో యేమయినా పెట్టు కోవాలని ఇచ్ఛ కలుగుతుంది. ప్రస్తుతం చేతిలో యేమీ వుండదు. అమ్మ వంక చూసి, యెందుకూ పనికిమాలిన దానిని, యిటువంటి అమ్మ కనపడితే యేమీ యింత చేతిలో పెట్టుకోవడానికి కూడా లేకపోయె అన్నట్టుగా అమ్మ వంక చూస్తుంది. కంటికొలుకులు ముందుకు చుక్క నీరు వచ్చి ఆగిపోతుంది. అప్పుడు ఆ నీటి చుక్కలు రెండు మేము కూడ నిన్ను చూట్టానికి వచ్చామని మెరుస్తూ వుంటాయి. ఆమెకు ఆ సంకల్పం తోచగానే అమ్మ తన చేతిలో వున్న 116 లలో యిరవై రూపాయలు ఆమె చేతిలో పెట్టి పెట్టమ్మా అంటుంది.

అమ్మ : నా మొఖాన బొట్టుపెట్టి నా కియ్యమ్మా అంటుంది.

హనుమాయమ్మగారు : తన మనసులో వున్న అభిప్రాయం అమ్మ కనుక్కున్నదని ఒక్కసారిగా ఆనందంతో పాదాల మీద పడుతుంది.పడి, అమ్మా! నాకు యిరవై ఒద్దు, ముప్పై ఒద్దు, నీ చేతిలో నే పెట్టేదేంటి అందరి చేతుల్లో పెట్టవలసిన తల్లివి నీవు, యింక నాకు యేమీ వద్దు తల్లి. నా మనసును తెలుసుకున్న తల్లివి దొరికావు.నేను నీ దగ్గరే వుంటా, నన్ను కడతేర్చు తల్లీ. అట్లా యేవేవో మాట్లాడతూ అమ్మ కాళ్ల మీద అరగంటసేపు వుంటుంది.

శారదాంబగారు అమ్మ పాదాలకు బరువేమోనని ఆమెను వెనక్కి తీస్తుంది. లేవదీసి - కూర్చోబెట్టినా యేనాడో చచ్చిపోయిన తల్లిగా (తను ధ్యానించే తల్లి లాగా) కనుపిస్తుంది హనుమాయమ్మగారికి.

హనుమాయమ్మగారు : అమ్మా, వెనుక మాయమ్మకు యిట్లాగే బుళాకి వుండేదమ్మా. నీ వల్నె ఎంతో ప్రశాంతంగా, చల్లగా చూచేదమ్మా. ఈ అమ్మే ఆయమ్మలో చేరి పూజింపబడ్డావా? లేకపోతే నాకు పూజించాలనిపించదు. ఆ తల్లిని, కన్నతల్లిని పూజించాలని మనసురావటం సామాన్యమా, అందులో నా వంటి నిర్భాగ్యురాలికి, మంచి అంటే యేమిటో తెలియని నిర్భాగ్యురాలికి సర్వం ఒకటిగా చూడటానికే ఆనాడు అమ్మ యందు ఆ భక్తి, ఈనాడు మీ దర్శన భాగ్యం. మీరు యెప్పుడూ నన్ను కనిపెట్టి ఉన్నా నేనిప్పుడే మిమ్మల్ని చూస్తున్నా. నన్ను ప్రత్యక్షంగా కనిపెట్టే తల్లి వున్నదని ఈనాడు గుర్తించా. మానవ రూపంతో దైవం యిలా వుంటాడని ఈ రోజు గుర్తించా. కళ్లు మూసుకుని అట్లాగే మాట్లాడుతూ వుంటుంది.

శారదాంబగారు హనుమాయమ్మగారిని రెక్క పట్టుకుని తీసుకెళ్ళి చాప మీద పడుకోబెడుతుంది. అమ్మా, నీ దర్శనం అనుకోని దర్శనం తల్లి, బహు రూపాలతో దర్శనమిస్తున్నావు, ఎంత అదృష్టవంతులం - మేము అనుకుంటుంది.

పట్టాభిరామయ్యగారు భోజనానికి వస్తారు.

పట్టాభిరామయ్యగారు : ఏమిటి, యింట్లో అంతా ఒక రకంగా వున్నారు.

శారదాంబగారు : ఏమీలేదు. మన పూర్వ పుణ్యం మంచిదై మనమీ యింట్లో చేరాం.

పట్టాభిరామయ్యగారు : ఏమిటా విశేషం?

శారదాంబగారు : ఈ తల్లి ఉన్న యింట్లో మనమూ ఉండటము మన అదృష్టం.

పట్టాభిరామయ్యగారు : ఈ తల్లి యిట్లా కాకుండా కోడలయితే యెంత ధన్యులమయ్యే వాళ్ళమొ.

శారదాంబగారు : కోడలయితే ఈ భావముండేదికాదు.

పట్టాభిరామయ్యగారు : యెందుకుండదు, యిప్పుడు చూచినవాళ్లమే తరిస్తున్నాం, అప్పుడు తరతరాలు తరించేవి. కాదుగాని, ఈ అమ్మాయిని చూచినప్పటి నుండి వ్యక్తపరచలేని, అర్థంగాని ఒక జ్యోతి - అనిపించేది.

శారదాంబగారు : నాతో యెన్నడూ అన్నారు గాదే?

పట్టాభిరామయ్యగారు : మన అబ్బాయికి చేసికోవాలని వుందని చెప్పాను కదా.

శారదాంబగారు : ఇలా అనలేదు. తల్లి లేని పిల్ల, వాళ్లంతా తగాదాలాడుతున్నారు, మన అబ్బాయికి చేసుకుంటే బాగుంటుంది, పిల్ల చాలా యోగ్యురాలు అని అన్నారు కాని యిలా చెప్పలా.

పట్టాభిరామయ్యగారు : పోనీలే నీవె గుర్తించావు. అయినా నాకు యెట్లా అర్థమవుతాయి. నేనేమి పూజలు, పునస్కారాలు చేసేవాడిని కాదు కదా? నాలుగు డబ్బులు సంపాదించుకునేవాణ్ణి. యింతకూ ఈ అమ్మాయి పరిస్థితి యేమిటంటావు?

శారదాంబగారు : మనం అర్థం చేసుకోగలమా? గొప్ప గొప్ప వారే అర్థం చేసుకోలేదు. సర్వత్రా నిండివున్న శక్తిని మనము యేమర్థం చేసుకుంటాం.

పట్టాభిరామయ్యగారు : సర్వత్రా నిండి వున్నట్లుగా లేదుగా, ఒక అమ్మాయి గానే వుంది గదా?

శారదాంబగారు : అర్థం చేసుకోలేమనే ఒక రూపంతో రావటం. అందులో సామాన్య మానవ రూపిణిగా రావటం మరీ విశేషం. మన అందరినీ శబ్ద, స్పర్శ, రస, గంధాదులచేత తరింప చేయటానికై మానవ రూపం ధరించింది.

పట్టాభిరామయ్యగారు : స్పర్శంటే ఎ యెట్లాంటి స్పర్శైనా తరిస్తారా?

శారదాంబగారు : స్పర్శకు రెండు రకాలేముంది. అయినా నాకు తెలియదు. ఆ తల్లి నడిగి తెలుసికోవాలి. మనకు రెండు గాని ఆ తల్లికి రెండు లేవుగా?

పట్టాభిరామయ్యగారు : ఈమేమిటి కళ్లు మూసుకుని, యిలా కూర్చుంది తపస్సంపన్నురాలివలె.

శారదాంబగారు : నిజంగా తపస్సంపన్నురాలె. ఆమె మనింటికి వంటకు రావటం కూడ మన అదృష్టమే.

యిట్లా అంటుండగానే హనుమాయమ్మగారు కన్నుతెరిచి యిదంతా ఏమిటో కలగా వున్నదమ్మా.

శారదాంబగారు : జగత్తే కల గదా, కలలో కల.

యింతమంది యిన్ని అనుకుంటున్నా అమ్మ యేమీ మాట్లాడకుండా కూర్చుంటుంది.

పట్టాభిరామయ్యగారు : ఎందుకు ఆ అమ్మాయి యేమీ మాట్లాడకుండా కూర్చుంది.

శారదాంబగారు : ఆమె మాట్లాడే అమ్మాయి గాదు, మాట్లాడించే అమ్మాయి.

పట్టాభిరామయ్యగారు : అంటే అర్థం కావటంలా నాకు.

శారదాంబ గారు : అర్థం కూడ కానియ్యదు. అర్థం చేయ్యాల్సింది కూడ ఆ అమ్మాయే.

పట్టాభిరామయ్యగారు : యేమిటి అంత దృఢంగా మాట్లాడుతున్నావు. ఆ మాటలేమిటో నాకు గొడవగా వున్నాయి.

హనుమాయమ్మ గారు : కళ్లు తెరిచి అమ్మ వంక చూస్తూ మావారి మేనల్లుడుండేవాడు కొమ్మరాజు కోటేశ్వర్రావని, వారికి మాకు పెద్దగా రాకపోలు లేవుగాని, ఆయన పెంపుడు కూతురుకేదో సినిమాహాల్లో దర్శనయిందని యిరుగు పొరుగువారు వచ్చి చెప్పారు. వివరాలు నాకు తెలియవు. ఆ పిల్ల యెవరిపిల్లో కూడా తెలియదు. పెంచాడు. ఆ పిల్ల నట్టింటికి వచ్చినప్పటి నుండి అన్నీ యిబ్బందులే. యిప్పుడు ఆ పిల్ల యెక్కడున్నదో తెలియదు. వాడు యేమయినాడో తెలియదు.

అమ్మ : ఆ పిల్ల పేరేమమ్మా?

హనుమాయమ్మ గారు : నాకూ వివరాలు తెలియవు. తల్లీ. వారి ఊరు మాత్రం రెంటచింతల. సొంత మేనల్లుడు కూడ కాదు, మా వారికి పినతండ్రి కూతురు కొడుకు.

అమ్మ : సొంతమంటే యేమిటమ్మా?

హనుమాయమ్మ గారు : సొంత ఆడబిడ్డ కొడుకు కదనమ్మా. అంత కంటె నాకేమి తెలుసు సొంతమంటే?

అమ్మ : యింకా ఆ అమ్మాయి వివరాలు తెలిసుంటే చెప్పమ్మా?

హనుమాయమ్మ గారు : నాకేమి తెలియదమ్మా. యెందుకు మీరు యింత శ్రద్ధగా అడుగుతున్నారు?

అమ్మ : ఏమీ లేదమ్మా. సినిమాలో దర్శనమంటే, సినిమాలోనా, సినిమా హాల్లోనా నని.

హనుమాయమ్మ గారు : హాల్లోనే అమ్మా. సినిమాలో అనేకం చూపిస్తారు. అందులో ఆశ్చర్యమేముంది.

అమ్మ : యింతేనా, యింకేమయినా తెలుసునా.

హనుమాయమ్మ గారు : నేనడిగి కనుక్కు చెపుతానమ్మా, యీ నెలాఖరుకు వెళతాను.

శారదాంబగారు : మనమడిగి కనుక్కునేదేమిటి, ఆ తల్లికి తెలియందేముంది.

హనుమాయమ్మగారు : ఈ తల్లి ఈ విషయాన్ని గురించి అడగటానికి ఏదో ప్రబల కారణం వుండి వుండాలి. అదే తెలుస్తుంది నిదానంగా, తొందరెందుకు? అనుకుంటుంది.

శారదాంబగారు : బిడ్డకు పరమాన్నమిద్దాము, మళ్ళా వారు క్యాంపుకెళతారట, త్వరగా భోజనాలు చేస్తే మంచిది.

అమ్మ : శారదాంబగారు మీరిచ్చిన డబ్బు మీదగ్గరే వుంచండి. నాకు అవసరమొచ్చి నప్పుడు తీసికుంటాను. లేక మీ యిష్టమొచ్చిన వస్తువు చేయించినా సరే అని శారదాంబగారి చేతిలో పెట్టబోతుంది.

శారదాంబగారు : వద్దమ్మా, నీ దగ్గిరే వుంచుకో, నీ యిష్టమొచ్చినట్లు చేసుకో.

అమ్మ : నా యిష్టమొచ్చినట్లే చేయమంటరా. నాయిష్ట మొచ్చినట్లే చేస్తే నామ రూపం రెండూ మీకు తెలియవు. కాని వినియోగం మాత్రం సద్వినియోగం అవుతుంది.

శారదాంబగారు : అంతకంటే మాకు కావలసిందేమిటమ్మా. నీ యిష్ట మొచ్చినట్లు చేసుకో.

హనుమాయమ్మగారి చేతిలో పెట్టిన యిరవై రూపాయలు అమ్మ చేతికిస్తుంది.

అమ్మ : (ఈమాట వినగానే) యింటికి వెళ్లోస్తా నమ్మా.

శారదాంబగారు : ఆగమ్మా కొంచెం భోంచేసి వెళుదువుగాని.

అమ్మ : భోజనం అంటూ చేస్తే బాగానే చేస్తా. కొంచెం చేయటమేముంది? ఆకలి లేదమ్మా.

శారదాంబ గారు : కొంచెం పరమాన్నమన్నా తాగిపోమ్మా నీకోసమని చేయించాను. అందరం సరదాగా కూచుని భోంచేద్దాం. నీకు అంత యిష్టం లేకపోతే నీవు పరమాన్నం తాగుదువుగాని, మేము భోజనం చేస్తాము.

అందరికీ విస్తళ్లు వేస్తారు.

చిదంబర్రావుగారు కోర్టునుంచి రాగానే అమ్మాయి ఏదని అడిగి యెంతసేపటికి రాలేదని ఆదుర్దాతో వస్తారు.

అమ్మ తాతగార్ని చూడగానే తాతగారి దగ్గరకు వెళ్ళి నమస్కారం చేస్తుంది. అక్కడున్న తాసీల్దారుగారికి, శారదాంబగారికి, పెద్దలందరికి, అమ్మ నడిచినట్లుగా వుండదు, ఎక్కడవాళ్ళకక్కడే నమస్కారం చేసినట్లు వుంటుంది. కాళ్ల మీద పడ్డ అమ్మను మాకు నమస్కారమేమటమ్మా అని వంగి లేవతీద్దామనుకుంటుండగానే అమ్మ యింకొకరి కాళ్ల మీద పడుతున్నట్లుంటుంది.

శారదాంబగారు : మాట యెంత నిదానమో, మనసు అంత ప్రశాంతం, తను చెయ్యదల్చుకున్న పని అంత తొందర, మానవమాత్రులు చేస్తున్నట్లుగా మాత్రము వుండదు.

తాశీల్దారుగారు (పట్టాభిరామయ్యగారు) చిదంబర్రావు తాతగారిని "లోపలికి రండి బాబుగారూ".

తాతగారు : అమ్మాయి యింకా యెంతసేపుండాలి?

పట్టాభిరామయ్యగారు : ఏంలేదు, తాను భోజనం చేయగానే వస్తుంది.

తాతగారు : త్వరగా రామ్మా అని, ఈమెగారు భోజనం చేయడం కూడానా అనుకుంటూ వెళతారు.

ఇన్ని తెలిసిన తాతగారికి "నేను భోజనం చేయలేదని బాధే గదా" అని అమ్మ మెల్లిగ అంటుంది.

అమ్మ మెల్లిగా అనుకోవటం శారదాంబగారికి వినపడక అమ్మను, తాతగారు అన్నం తినకుండా రమ్మన్నారన్నట్టుగా అర్థం చేసుకుంటుంది. బంధువులెవరూ ఈ పిచ్చితల్లిని అర్థం చేసుకోలేదల్లే వుంది అన్ని విధాలా కష్టపడుతున్నట్లు వుంది. అని తలో తను అనుకుంటూ వడ్డిస్తుంది.

పట్టాభిరామయ్యగారు : అట్లా మనం అనకూడదు తప్పు, యింతకాలం వాళ్లు చూడకపోతే యెవరు చూసారు?

శారదాంబగారు : యెవరు చూసేదేముంది, నాకు యిది పెట్టమంటుందా?, నాకు యిది వద్దంటుందా? అయినా యివన్నీ ందుక్కాని కాని మనం ఈ వూళ్ళో ఉన్నంత వరకు ఈ బిడ్డకు లోటు లేకుండా చూద్దాం.

తాశీల్దారుగారు : ఆ అమ్మాయి ఇప్పుడు ఈ వూళ్ళో వుండదు. మన్నవ వెళుతుందట.

శారదాంబగారు : ఎక్కడన్నా వుండనివ్వండి. మన పిల్లలు ఎక్కడున్నా వుంటే వాళ్ళకి కావల్సినవి మనం చూసుకోవటంలా, అలాగే చూసుకుందాం.

తాశిల్దారుగారు : సరే, నీ యిష్టమొచ్చినట్టు చెయ్యి.

అందరూ ఒకేసారి కూర్చుంటారు. హనుమాయమ్మగారు వడ్డిస్తుంది.

అమ్మకు పరమాన్నం గ్లాసు యిస్తారు. నాన్నగారికి చూపించి తాగాలని యింటికి వెళ్ళొచ్చి తాగుతానంటుంది. అట్లా వల్లగాదని అందరూ ఒకేసారిగా అంటారు. అమ్మ సమాధానమేమీ చెప్పలేక 5 నిమిషాలు వూరుకుని పోనీలే పాదాలు నా మెడనే వున్నాయిగా అని మనస్సులో అనుకుని పరమాన్నం చల్లగా వున్నదా వేడిగా వుందా, పాదాలు కాల్తాయి అని పైకి అంటుంది.

శారదాంబగారు : పాదాలు కాల్తాయా, నోరు కాల్తుందా?

అమ్మ : ఆ పాదం కాల్తే వొళ్ళంతా కాలినట్లే. నోరు కాలినా ఫరవాలేదు.

శారదాంబగారు : పాదం నీది గాదూ, పాదం కాలితే మాత్రం నీకు కాలదూ? (యెవరి పాదమయింది అర్థం కాక.)

అమ్మ : ముందు వేడి పాదానికి తగుల్తుంది. పాదం తగిలేసరికి యెంత వేడయినా చల్లారిపోతుంది. అయినా నా చాదస్తం కాని వారి పాదాలు కాలటమేమిటి?

హనుమాయమ్మగారు, శారదాంబగారు యిద్దరూ ఒకేసారి వారెవరమ్మా?

అమ్మ తలవంచుకుని నవ్వుతూ - వారే వీరు, వీరే వారు అంటుంది.

శారదాంబగారు : అంటే అర్థం కాలేదమ్మా.

అమ్మ మీకు కాదు లేమ్మా అంటూ పరమాన్నం గ్లాసులో చెయ్యి పెట్టి చల్లబడటం చూసుకుని మంగళసూత్రాలు గ్లాసులో ముంచి పైకి తీసి నీటితో సూత్రాలను పరమాన్నంలో కడిగి ఆ పరమాన్నాన్ని కళ్ళకద్దుకుని తాగుతుంది.

ఆ దృశ్యం చూచి అందరూ కలియుగంలో పతివ్రతలు కనపట్టం లేదని అమ్మ వెలిసింద నొక్కసారిగా అందరి నోటెంట వస్తుంది. అన్నం ముందర నుంచి పట్టాభిరామయ్యగారు లేచి నమస్కారం చేస్తారు. చాలాసేపు పాదాల మీద నుండి లేవలేరు. అట్లా ఒక అరగంట గడుస్తుంది.

శారదాంబగారు : అమ్మ పాదాలు కందిపోతయేమొ లేవండని లేవదీస్తుంది.

పట్టాభిరామయ్యగారు: మనందరి నోటెంట ఈ రోజు ఏమాటొచ్చినా ఒకేసారి వస్తున్నదే, ఒకేసారి వస్తే బంధువులు వస్తరంటారే, యింకా మనకెవరు రాలేదే! ఎవరోస్తారో?

శారదాంబగారు : యింతకంటే బంధువులెవరున్నారు?

తాశీల్దారుగారు : నీవు చెప్పినట్టుగా ఈ అమ్మకు ఏ కొరతా లేకుండా మనం చూసుకోవలసిందే.

శారదాంబగారు : ఆ తల్లికి కొరత లేకుండా మనం చెయ్యగలమా? ఎవరివల్లా గాదు.

అందరూ భోజనాలు చేస్తారు. నీవు మోజువాణీలో పాడితే చాలాబాగుంది, అని, ఒకపాట పాడమ్మా అంటారు.

హనుమాయమ్మగారు : ఆ తల్లి మనసుకు కొరతంటూ తోచదు.

తాశీల్దారుగారు : ఒక పాట పాడుతల్లీ. నీవు బాగా పాడుతావంటున్నారు.

అమ్మ : నాకేం పాటలొచ్చు? మీ మేనకోడలు కామాక్షల్లే పాడగలనా?

తాశీల్దారుగారు : అదేంటమ్మా కామాక్షి కూడ సంగీతం చెప్పుకోలా?

అమ్మ : సంగీతం చెప్పుకోకపోతేనేం - సంగీత జ్ఞానం వుంది. మీ కోడలు రాజమ్మగారి వైలన్ వాయిద్యం, కామాక్షి పాట విన్న తరువాత మరొకరి పాట నచ్చదు.

శారదాంబగారు : సంగీతమే నీవయితే నీకు సంగీతమెందుకు? యెట్లా పాడినా సరే పాడమ్మా.

తాశీల్దారు గారు : రాజమ్మా, నీవు వైలన్ తీసుకురా వాయించు, అమ్మాయి పాడుతుంది. భోజనాలు అయిపోతాయి. యిస్తళ్ళ ముందరే కూర్చుంటారు. చేతులు కడుక్కోవటం కూడ మర్చిపోతారు. వైలన్ తీసికొస్తుంది.

అమ్మ మెల్లిగా "భోజనం సెయ్యావా రంగళ్ నవచిత్రమౌళి కళ్యాణకూట తెళ్ళి భోజనం సెయ్యావా" అని తమిళంలో పాడుతుంది. యెంత మెల్లిగా పాడినా అందరి చెవులల్లోను దగ్గరకొచ్చి చెవులల్లో పాడినట్లుగా యెవరికి వారికి వినపడుతుంది. ఆ ధ్వని యిలావుందని వర్ణించడానికి వీలులేదు. వాయించేది ఒక వైలన్ అనయినా అనేక రకాల వాయిద్యాలు వినబడుతుంటాయి. యెవరికి వారు తన్మయవత్వంలో పడి, కళ్లు తెరవకుండా వుంటారు.

తాశీల్దారుగారు కృష్ణుడి మురళి యిదేనా ననుకుంటారు.

శారదాంబగారు నాదబ్రహ్మం అంటే యెక్కడో లేదు ఈ స్వరూపమే, ఈ శబ్దమే అంటుంది.

అమ్మ పది నిమిషాలు పాడుతుంది.

హనుమాయమ్మగారు ప్రణవ నాదమంటే యిదే, అమ్మ ఓంకార స్వరూపిణనుకుంటుంది.

రాజమ్మకి తన వైలన్ కమాన్ తను పట్టుకున్నట్టుండదు. యెవరో పట్టుకు నడిపిస్తున్నట్టుంటుంది.

సుభద్ర, లలిత ఎక్కడి పిల్లలక్కడ నిశ్చేష్టులయి నిలబడతారు. అట్లా గంట జరుగుతుంది. ఎవరికి వారు బ్రహ్మానందంలో మునిగి తేలుతుంటారు.

యెంతసేపున్నా వీళ్లు కళ్లు తెరచి మామూలు స్థితికి వచ్చేటట్టులేరు అని అమ్మ యింటికి వచ్చేస్తుంది.

తరువాత రెండు మూడు గంటలకు లేస్తారు. యెక్కడో యే వూళ్ళోనో యేదో కలగన్నట్టుగా ఉంటుంది వారికి, క్రమంగా మామూలు స్థితికి వస్తారు. మనం అనుభవించినదంతా నిజమా, అబద్ధమా అని యెవరికి వారికి ఆలోచన. అమ్మను గురించి ఆలోచించగా, పారాణి పెట్టేంత వరకు శారదాంబగారికి గుర్తుంటుంది. తరువాత

పాతివ్రత్యమంటే పతిని ఆధారం చేసుకుని పంచభూతాలనూ జయించటం - **అమ్మ**

యేదో ఆనందం అనుభవించానని తప్ప ఫలానా అనుభవించానని వివరించలేదు. మరపురాదు యీ స్థితి, ఆ క్షణములోదె, నెలరోజులు గడిచినట్టుంటాయి.

హనుమాయమ్మగారు : పిన్నిగారు, వివేకానందకు రామకృష్ణ పరమహంస యే రకమయిన అనుభవం యిచ్చివుంటాడు?

శారదాంబగారు : ఏమో? నేనేదీ అనుకోలేదు. కలగాలనుకున్నాగాని, యిదంతా అనుకోలేదు.

హనుమాయమ్మగారు : ఏం కలగాలనుకున్నారు?

శారదాంబగారు : అడిగితే చెప్పలేని స్థితి.

హనుమాయమ్మగారు : అటువంటివి చాలా వుంటాయిగా?

శారదాంబగారు : ఏంటోనమ్మా ఏమాటకు ఏ సమాధానం చెప్పాలో తోచటం లేదు. నన్ను పలకరించకండి.

నిండుబిందెలో నీళ్లు పోస్తుంటే తొణికి కింద ఎలా పడతాయో అలాగే ఆనందంతో నిండున్న మనస్సుకు ఏమి చెప్పినా మనస్సుకు ఎక్కటం లేదు.

కూర్చుని, కూర్చుని ఎవరి పనులకు వాళ్లు లేచెళతారు.

దాదాపు సాయంకాలం 4 గంటలవుతుంది.

అమ్మ తాతగారింటికెళుతుంది. తాతగారు యింట్లో వుండరు. బజారుకెళతారు. అమ్మ తిరిగి నాన్నగారింటికి వస్తుంది.

నాన్నగారికా రోజు పత్యం పెడతారు. ఒంటరిగా కూర్చునుంటారు. బామ్మ యెక్కడికో వెళుతుంది.

అమ్మ వెళ్ళగనే నాన్నగారికి నమస్కారం చేస్తుంది.

నాన్నగారు : ప్రొద్దుట నుండి రాలేదేం?

అమ్మ : తాశీల్దారుగారింట్లో తలంటు పోసారు. అక్కడ ఆలస్యమయింది. పదహార్రోజుల పండుగ గదా యేమయినా చేయించుకో మని పట్టాభిరామయ్యగారు నూటపదహారు యిచ్చారని అమ్మ నాన్నగారి చేతిలో ఉంచబోతుంది.

నాన్నగారు : నాకొద్దు నీవేమయినా చేయించుకో. వాళ్లు నిన్ను చేయించకోమని యిస్తే అది నాకెందుకు?

అమ్మ : నీ యిష్టమొచ్చినట్టు చేసుకోమన్నారు. నాకు యిష్టమైంది యిదే గదా?

నాన్నగారు : ముందు యేదయినా చేయించుకోమన్నారంటివే?

ప్రాతివ్రత్య మంటే - భర్త ఎట్లా నడచినా, ఏం చేసినా, ఎట్లా చూచినా - ఆయన తప్ప ప్రపంచమే లేకపోవటం.

- అమ్మ

అమ్మ : ముందు అట్లాగే అన్నారు. నాకు యే వస్తువుల మీద కోర్కెలేదని చెప్పాను. సరే నీ యిష్టమొచ్చినట్లు చేసుకోమన్నారు, వారు కూడ దీనికి సంతోషిస్తారు. యింతకంటె వారికి మాత్రం కావసిందేముంది అంటూ పాదాల మీద పెడుతుంది.

ఒక్కొక్క నోటె పూజగా చేస్తుంది పాదాల మీద. తన తల్లో వున్న పూలు తీసి పాదల మీద నోట్ల మీద పెట్టి దణ్ణం పెడుతుండగా బామ్మ వస్తుంది. అమ్మ లేచి ఒక పక్కకు నుంచుంటుంది.

బామ్మగారు నాన్నగారి పాదాలు చూడకుండా ముఖము చూచి లోపలకు వెళుతుంది. అమ్మ బామ్మతో పాటు లోపలకు వెళుతుంది.

నాన్నగారు పాదాల మీద డబ్బు తీసి జేబులో పెట్టుకుంటారు.

బామ్మగారు : కసువు చిమ్మి, మీ బావకు బార్లీ నీళ్లు పెట్టివ్వు.

అమ్మ : బావేంటత్తయ్యా?

బామ్మగారు : నిన్నటిదాక పిల్చిందానివే గదా యేమొచ్చింది కొత్తగా యీవేళ, మరేం ఫర్వాలా, బావ గాకపోతే - మరేమనాలి?

అమ్మ : యేదయినా అను, బావఅనెందుకు? అత్తయ్య కొడుకులందర్నీ బావ అనే పిలుస్తున్నాగా, తేడా యేముంది?

బామ్మగారు : నీ యిష్టమొచ్చింది చెప్పు.

అమ్మ : నాకు వేరే యిష్టమేముంది అత్తయ్యా? పేరు చెప్పు. పేరుతోననయినా పిలవొచ్చుగాని బావ అని అనటం కష్టం.

బామ్మగారు : నీకు తోడు కష్టం కూడ, నీమెళ్లో ఏమని తాడుకట్టాడో వెంటనే మంచమెక్కాడు. జబ్బు ఎక్కువయినాడనుకున్నా - యింకొకరి మెళ్ళోనయినా తాడు కడితే వాడికి నయమవుతుందని. మురుకాళ్ల పెద్దమ్మవు దాపురిస్తివి, యింకొక పిల్ల యెట్లా దొరుకుతుందీ?

అమ్మ మనస్సులో - పిచ్చత్తయ్య ఎంత అమాయకురాలు. యిదివరకే జరిగిందని ఎరగదు అత్తయ్య అన్నట్లుగా ఆమె అదృష్టాన్ని తగ్గించింది గదా. అదృష్టమొకరిదయినా ప్రతిఫలం అందరం అనుభవించొచ్చు. అత్తయ్యా, ఈ రాత్రి యిక్కడ వుండమంటావా అని అడుగుతుందమ్మ.

బామ్మగారు : ఎందుకిక్కడ?

అమ్మ : సరే వెళ్ళొస్తా అత్తయ్యా.

బామ్మగారు పోయిరా, అని దొడ్లో కాపరమున్న వారి వాకిట్లో కూర్చుంటుంది.

అమ్మ వెళుతున్నానని నాన్నగారికి నమస్కారం చేసి చెపుతుంది.

---

భగవంతుడు భర్త కాదు, భర్తే భగవంతుడు. - **అమ్మ**

